# సర్వ సిద్ధాంత సౌరభము

కర్త

పరమహంస పరివ్రాజకాచార్య

## శ్రీ అనుభవానంద స్వాములవారు

## దర్శన ఖండము

తృతీయ భాగము

మీమాంసా - వేదాంత దర్శనములు



ప్రకాశకులు

శ్రీ అనుభవానంద గ్రంథమాల

భీమునిపట్టణము

బాపట్ల - బ్రాంచి

Go ye, O Bhikkhus, and wander forth for the gain of many...Proclaim the Doctrine glorious, preach ye a life of holiness, perfect and pure.

BUDDHA

తరలిపొండు ఓ భిక్కులారా, జనబాహుళ్య ప్రయోజనమునకై పరివ్రజింపుడు ... తేజోవంత సిద్ధాంతమును ప్రకటింపుడు, పవిత్ర జీవనమును బోధింపుడు.

బుద్ధ

ఓం

# శ్రీ అనుభవానంద గ్రంథమాల

---

**ఉద్దేశము :** ఈ గ్రంథమాలలో శ్రీ అనుభవానందస్వాముల వారిచేతను, యితరులచేతను రచితములైన భక్తి జ్ఞాన వైరాగ్య ప్రబోధక గ్రంథములు ప్రకటింపబడును.

**విధానము :** సంవత్సరమునకు కనీసము రెండువందల పుటలు గల గ్రంథములు వెలువడుచుండును.

**విరాళములు :** 1) రు 500 లు మించు విరాళ మొసంగు వారు మహారాజ పోషకులు. ఒక ముఖ్య గ్రంథమున వీరి ఫొటో ప్రకటింపబడును. వీరి నామములు ప్రతి కుసుమమున ముద్రింప బడుచుండును. గ్రంథమాల ప్రచురణములన్నియు నుచితముగ వీరి కొసంగబడును.

2) రు 100 లు మించు విరాళ మొసంగువారు రాజపోషకులు. ప్రతి గ్రంథమున వీరి నామములు ముద్రింపబడుచుండును. మరియు గ్రంథమాల ప్రచురణములన్నియు వీరుగూడ నుచితముగ బడయుదురు.

3) రు 50 లు మించు విరాళ మొసంగువారు పోషకులు. వీరి నామములు అన్ని ప్రచురణముల బ్రకటింపబడును. ప్రచురణముల వీరు సగము ధరలకు బడయుదురు.

4) రు 25 లు మించు విరాళ మొసంగువారు అభిమానులు. వీరు ప్రచురణముల $\frac{3}{4}$ ధరలకు బడయుదురు.

5) రు 10 లు మించు విరాళ మొసంగువారు సభ్యులు. ప్రచురణముల వీరు 1/8 తగ్గింపు ధరలకు బొందుదురు.

# విరాళకర్తలు

| | | | | |
|---|---|---|---|---|
| 1 | శ్రీ | మెంటా ఈశ్వరయ్యగారు | నెల్లూరు | రు 300 |
| 2 | ,, | కలిగొట్ల సూర్యనారాయణగారు | భీమునిపట్టణము | 100 |
| 3 | ,, | సుదురుపాటి వీరరాజుగారు | శిర్లపాలెము | 100 |
| 4 | ,, | బొలిశెట్టి సీతారామయ్యగారు అడ్వొకేట్ | బాపట్ల | 232 |
| 5 | ,, | నందగిరి వేంకటరామదాసు పంతులుగారు | శిర్లపాలెము | 100 |
| 6 | ,, | పులవర్తి సుబ్రహ్మణ్యంశెట్టిగారు | భీమునిపట్టణము | 100 |
| 7 | ,, | బలభద్రుని చెన్నయ్యశెట్టిగారు & సన్స్ | భీమునిపట్టణము | 100 |
| 8 | ,, | దుర్గా దానయ్యశెట్టిగారు & సన్ | భీమునిపట్టణము | 100 |
| 9 | ,, | కాళ్లకూరి సూర్యనారాయణగారు | విశాఖపట్టణము | 100 |
| 10 | ,, | బూదరాజు వేంకట నరసింహారావుగారు | స్వర్ణ | 100 |
| 11 | ,, | పసుమర్తి శేషాచలంగారు | నెల్లూరు | 100 |
| 12 | ,, | ఏడిద సూర్యనారాయణమూర్తిగారు | భీమునిపట్టణము | 50 |
| 13 | ,, | గఱ్ఱె సత్యనారాయణ గుప్తగారు | విజయవాడ | 50 |
| 14 | ,, | పెనుబోలు బ్రదర్స్ | నెల్లూరు | 100 |
| 15 | ,, | ఎలిశెట్టి సుబ్బారాయుడు శెట్టిగారు | నెల్లూరు | 58 |
| 16 | ,, | రాయపురెడ్డి అప్పారావు నాయుడుగారు | భీమునిపట్టణము | 100 |
| 17 | ,, | కొత్త రమణాజీరావుగారు | బొబ్బిలి | 100 |
| 18 | ,, | ఆడక్కి వేంకట కృష్ణ హనుమంతరావుగారు | శ్రీకాకుళం | 100 |
| 19 | ,, | నిట్ట భీమశంకరంగారు ఇన్‌కమ్‌టాక్స్ ఇన్‌స్పెక్టరు | విశాఖపట్టణము | 100 |
| 20 | ,, | బండి వీరరాఘువమ్మగారు | చింతలపూడి | 100 |
| 21 | ,, | బండి రామారావుగారు | చింతలపూడి | 100 |

22 శ్రీ గైనేడి వేంకట అప్పారావుగారు విజయవాడ రు 100
23 ,, ఉద్దగిరి శ్రీరామమూర్తిగారు అనకాపల్లి 100
24 ,, బొమ్మదేవర హేమలతాదేవి బహదూర్‌గారు ఏలూరు 100
25 ,, చుండూరు రామానుజంగారు నెల్లూరు 100
26 ,, వెలగపూడి సుందరరామదత్తుగారు నెల్లూరు 100
27 ,, నూనె శేషాచలంశెట్టిగారు నెల్లూరు 100
28 ,, నూనె జగ్గయ్యశెట్టిగారు నెల్లూరు 100
29 ,, చిత్తూరు మునుస్వామి మొదలియార్‌గారు నెల్లూరు 116
30 ,, యడ్లపల్లి గోవిందు శెట్టిగారు నెల్లూరు 116
31 ,, పోలిశెట్టి వేంకట రమణయ్యగారు పాంఁడ్రంగి 116
32 ,, పూసర్ల జగన్నాథ అప్పలనరసయ్యగారు & సన్స్
విజయనగరము 58
33 ,, శారదా గ్రంథాలయము శిర్లపాలెము 116
34 ,, పొట్టా వీరరాజుగారు భీమునిపట్టణము 116
35 ,, నుదురుపాటి సత్యనారాయణ శెట్టిగారు భీమునిపట్టణము 58
36 ,, కులుకూరు సన్యాసి శెట్టిగారు విశాఖపట్టణము 100
37 ,, నంగునూరు మహబూబురెడ్డిగారు దేశిముఖ్ వరంగల్లు 100
38 ,, మేఘాద్రి మహాలక్ష్మమ్మగారు గజపతినగరము 116
39 ,, మంతెన వేంకట రామరాజుగారు బుద్దాము 116
40 ,, వేంకటేశ్వరస్వామి దేవస్థానము మచిలీపట్టణము 116
41 ,, వల్లూరి వేంకట సూర్యనారాయణగారు ప్లీడరు
మచిలీపట్టణము 100
42 ,, యద్దనపూడి రామచంద్రరావుగారు మచిలీపట్టణము 100
43 ,, తాడంకి వేంకటకృష్ణారావుగారు - అడ్వొకేట్
మచిలీపట్టణము 100
44 ,, మోటమర్రి దయానిధిగారు మచిలీపట్టణము 100

| | | | | |
|---|---|---|---|---|
| 45 | శ్రీ | తాడికొండ నాగేంద్రరావు గుప్తగారు | మచిలీపట్టణము రు | 100 |
| 46 | ,, | చిత్రపు అచ్యుతరామయ్యగారు | మచిలీపట్టణము | 100 |
| 47 | ,, | దీవిసేతు మాధవాచార్యులుగారు | మచిలీపట్టణము | 100 |
| 48 | ,, | పసుపర్తి సుబ్బరాజుగారు ఆడిటర్ | మచిలీపట్టణము | 100 |
| 49 | ,, | అద్దేపల్లి వేంకట రామయ్యగారు | మచిలీపట్టణము | 100 |
| 50 | ,, | పిన్నమనేని లింగయ్య చౌదరిగారు అడ్వొకేటు | మచిలీపట్టణము | 116 |

ఓం

# సర్వ సిద్ధాంత సౌరభము

## ప్రథమ భాగము - అభిప్రాయములు

1. ఆధ్యాత్మిక విజ్ఞాన ప్రచారమునకు యీ గ్రంథరచయిత చేయుచున్న కృషి ప్రశంసనీయమైనది. పుస్తకములద్వారా యీ జ్ఞాన ప్రచారమునకు శ్రీ అనుభవానంద గ్రంథమాల అవిరళకృషిగావిస్తున్నది.

దర్శన, అద్వైత, వైష్ణవ, శైవ, బౌద్ధ, సమన్వయ ఖండములలో శ్రీ కపిల మహర్షి ప్రోక్త సాంఖ్య సిద్ధాంతము, శ్రీ పతంజలిప్రోక్త యోగ దర్శనము ప్రథమభాగమున పొందుపరచబడినవి. ముఖప్రబంధము, సాంఖ్యదర్శనము, యోగదర్శనము అను శీర్షికలతో యీ విషయము లన్నియు విపులీకరించబడినవి. అనేక ఆంగ్ల గ్రంథములనుండి అవసర మగుచోట్ల కొటేషన్లు యివ్వబడినవి. శైలిగ్రాహ్యముగనున్నది. ఇదితత్త్వ జ్ఞానాన్వేషకులకు, సాధకులకు మిక్కిలి ఉపయోగకరముగా నుండును.

గోలకొండపత్రిక

2 వీరు రెండు దర్శనాలనుగురించి ప్రత్యేకంగా వేర్వేరధ్యాయాలలో వివరించారు. ప్రత్యేకంగా ఆయా ప్రకరణాలలో ఆయా సిద్ధాంతాలు దొరికినంతవరకు తత్కర్తల చరిత్రలు, సిద్ధాంతాలలోగల వాదోపవాదాలు మొదలైనవన్నీ విపులంగా వివరించారు.

సాంఖ్యానికి సంబంధించిన అధ్యాయంలో ప్రత్యేకంగా సంస్కృతసాంఖ్య కారికలుకూడ చేర్చారు. అలాగే యోగదర్శనానికి సంబంధించిన ప్రకరణంలో పతంజలి యోగసూత్రాలుకూడా చేర్చారు.

మూలగ్రంథాలనుగురించి వీరు వ్రాసినదంతా సంస్కృత వ్యాఖ్యానాల వివరణ శైలిలో ఉదాత్తంగాను నిర్దుష్టంగానూ సాగిపోయింది.

ప్రత్యేకంగాను తెలుగులో యీ దర్శనాలను గురించి యింత విపులంగా వ్రాసిన పుస్తకాలు చాలా అరుదుగా ఉన్నాయి. అందుచేత తెలుగులో యీ దర్శనాలనుగురించి తెలుసుకోదలచినవారి కిది అవశ్యం చదువవలసిన పుస్తకం.

ఆంధ్రపత్రిక

3. శ్రీ స్వాములవా రీ మహాగ్రంథమును ఆరు ఖండములుగా వెలయింపదలచినారు. అందు మొదటిదైన దర్శనఖండంలో మొదటి భాగము మాత్రమే యిది. ఎంత పెద్దఎత్తులో యీ గ్రంథరచనకు శ్రీ స్వాములవారు సంకల్పించారో దీనివలన స్పష్టం.

శ్రీ స్వాములవారు అనుభవానందులేకాదు, సకలశాస్త్ర పారంగతులుకూడ. అన్ని శాస్త్రాలు వారికి కొట్టిన పిండివలె అయిపోయినవంటే అతిశయోక్తి కాదు. వివిధ సిద్ధాంతాలనుగూర్చి ప్రాచ్య పాశ్చాత్య పండిత అభిప్రాయములన్నీ వారికి హృత్కఠలి. మంచినీళ్లప్రాయంగా వాటిని ఉదాహరించుకొంటూ పోగలరు.

తాత్త్విక దృష్ట్యా సాంఖ్య యోగదర్శనములు ఒక జంట. సాంఖ్యానికి ఈశ్వరకృష్ణుని కారికలనూ, యోగానికి పతంజలి సూత్రాలనూ పరిపూర్ణంగా ప్రకటించి, వానితోపాటు యింకా అనేక యితర గ్రంథస్థ విషయాలను క్రోడీకరిస్తూ స్వాములవారు వ్రాసిన వ్యాసాలు జిజ్ఞాసువు లెల్లరూ చదువదగినవి.

ఈ ఆరు ఖండముల ప్రకటనమూగూడా పూర్తి అయ్యేపక్షంలో యిది తెలుగులో ఒక మహా గ్రంథమై వెలయగలదనుటకు సందేహము లేదు. గ్రంథానికి కొలికిపూస ఆరవఖండమైన సమన్వయ ఖండమని ఊహించవచ్చు. ఆ సమన్వయం చేయడానికి శ్రీరామకృష్ణపరమహంస సంప్రదాయానికి చెందిన స్వాములవారే ఉత్తమాధికారులు.

కృష్ణాపత్రిక

4. సాంఖ్యయోగదర్శనముల విపుల విమర్శన మీ గ్రంథము. ఇది శ్రీ స్వాములవారు సంకల్పించిన 'సర్వ సిద్ధాంత సౌరభము'న నొక తరంగము. హైందవ సాంప్రదాయిక సిద్ధాంతము లన్నింటి సారమును స్వాములవా రీగ్రంథమునందు వెలువరించ సంకల్పించి యీ ప్రథమ భాగమున సాంఖ్యయోగ దర్శనముల బరామర్శించియున్నారు.

శ్రీ అనుభవానందస్వాములవా రాంధ్రదేశమున సుప్రసిద్ధ వ్యక్తి. బాల్యమున విరాగము వారికిలబ్ధమగుట పితృపైతామహ ప్రసాదమని వారే చెప్పియున్నారు. శ్రీరామకృష్ణ పరమహంసనే గురుదేవునిగగొని, బ్రహ్మచర్యమునుండియే సన్న్యసించి, తమ సాధనానుభవముల నెల్లరకు పంచి

యిచ్చుట కుపన్యాసముల, గ్రంథముల నాధారముగ గొని వారు చేయు చున్న అనుగ్రహ ప్రసరణము యెల్లరకు సువిదితమే. కాని శ్రీవారింత పండితులని, పాశ్చాత్య ప్రాచ్య దర్శనములందు వారి పాండితి తలస్పర్శ మని, వారి శోధన మద్భుతమని, వారి విచక్షణా మేధా విమర్శనశక్తు లనుపమములని, విషయ నివేదన కౌశల్య మప్రతిమానమని యీ గ్రంథ ముసు జూచిన దనుక చిరపరిచయులగు వారికిని తెలిసియుండదు. ఈ గ్రంథమున ప్రాచ్య పాశ్చాత్య విమర్శకాగ్రణుల యభిప్రాయములతోగూడ దర్శనకర్తలు, వ్యాఖ్యాతలు, వారి జీవిత విశేషములు, విషయప్రమాణము లగు గ్రంథములు, ఆయా దర్శనసారము తద్విమర్శనలు వేయేల సర్వవిష యము లిందు సంగ్రహింపబడి యున్నవి. కాన నీ గ్రంథము ఆయా దర్శన విషయముల నెరుంగగోరువారికి రసగుళిక యని చెప్పవచ్చును.

శ్రీ అనుభవానంద స్వాములవా రీ గ్రంథ పరంపరను ప్రకటించి ముముక్షు జనోపకారము నిట్లే ఒనర్చుచుందురుగాక యని మా నమస్కార పూర్వకాభ్యర్థనము.

ఆరాధన

5. సర్వసిద్ధాంత సౌరభమును చిత్రించటంలో తమరు అనుస రించిన మార్గం ఎంతో బాగా ఉన్నది. మనవారు యిట్టి ఉత్తమగ్రంథాల్ని చదివినగాని మన సంస్కృతి చక్కగా గ్రహించటానికి వీలుండదు. ప్రతి కళాశాలలో ఉన్నత విద్యాలయంలో యిట్టి గ్రంథం ఉండితీరాలి. విద్యార్థులు యీ గ్రంథాన్ని చదవటానికి ప్రారంభించారా, వారిని యీ కాలంలో ఎదుర్కొనుచున్న సమస్యలన్నింటిని సునాయాసంగా పరిష్క రించుకొనవచ్చు. విద్యార్థులకన్నా యీగ్రంథాన్ని చదువవలసినవారు ఉపాధ్యాయులు. అప్పుడే ఉపాధ్యాయులు తమ విద్యుక్తధర్మాన్ని సొంతంగా నెరవేర్చినవారవుతారు. తద్వారా విద్యార్థులకు ఆదర్శమూర్తులు కాగలరు. సంస్కృతి చాలా పురాతనమైనదని, దానితో సరిసమానమైనది ప్రపంచంలో ఎక్కడా లేదని చెప్పుకుంటే లాభంలేదు. ప్రప్రథమాన దాని రహస్యాన్ని అర్థంచేసుకోవాలి. అంతేగాదు దానిని తమ జీవితాలల్లో కార్యరూపాన పెట్టాలి. తమ గ్రంథము లిట్టి కార్యకలాపానికి ఎంతో సహాయపడగలవు. అందుచేత తాము ప్రారంభించిన పని అంతేవాసు లందరికి వారి జీవిత వికాసానికి ఎంతో సహాయపడగలదు.

6. శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ శ్రీ శ్రీ అనుభవా నంద స్వాములవారు రచించిన సర్వ సిద్ధాంత సౌరభము అను గ్రంథమును ఆమూలచూడము పరికించి విస్మయానంద ముగ్ధుడ నయితిని. వారి గ్రంథ మును అంథకూప నిపతితమైన మహారత్నమును ఉద్ధరించినట్లు ప్రమోద మును గూర్చినది. పాశ్చాత్యవాత్యాభిఘాతచే ప్రాచ్య విజ్ఞానలక్ష్మి నేడు సంమూర్ఛితయైనది. ఈ సౌరభము నాఘ్రాణించిన నవనవ చైతన్యము తిరిగి తేజరిల్లును.

శబ్దప్రామాణ్యము ననుసంధించి ప్రతిభావిశేషముచే తత్త్వశోధన జేసిన ప్రాచ్యమహాశయుల వాఙ్మయములో వాసిగాంచిన షడ్దర్శనములు. పరమ శాంతి చరమసీమయగు వేదాంత దర్శనమునకు సాంఖ్యయోగ దర్శనములు దక్షిణ వామపక్షములు. అట్టి పక్షముల ప్రచారము విశేషించి మనదేశమున క్షీణాక్షీణమైనది. ఈ దురవస్థను గమనించి శ్రీ స్వాముల వారు తమ సౌరభములో సాంఖ్యయోగములకు నగ్రతాంబూలము నొసం గిరి. వారి పరిశ్రమ వాచామగోచరము ఊహాతీతము. వారి హృదయ సీమను ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞానలక్ష్ములు గంగా యమునలవలె సరస సంగతిని పొంది లోకమును తరింపజేయ సమకట్టినవి. ఈ సౌరభము నాఘ్రాణించిన నాస్తికత పటాపంచలగును. ఆస్తికత తిరిగి తేజరిల్లును.

ఆబాలగోప సులభశైలిలో మహత్తర విషయములను ప్రకటించిన శ్రీవారి యద్భుతశక్తి మిగుల శ్లాఘాపాత్రము. ఇట్టి భగవదంశాంశ సంభూతులు సనాతన ధర్మోద్ధరణకై అరుదుగా నావిర్భవింతురు. వారి సంకల్పసిద్ధికి నస్మదాదులు పరమేశుని ప్రార్థించుట కృతజ్ఞతాప్రదర్శ నమే యగును.

ఆమూలాగ్రము శ్రద్ధతో శ్రీవారి గ్రంథములను పఠింపవలసినదిగా పాఠకమహాశయులను ప్రార్థింతును.

శ్రీవారి చరణ సరోజములకు నావందన పరంపరలు.

శ్లో. జీయాదాచంద్రతారార్కం సర్వసిద్ధాంత సౌరభం ।
మూర్ఛితాధ్యాత్మచైతన్య సంజీవన మహౌషధిః॥

శ్రీ వాసా సూర్యనారాయణశాస్త్రి

# సమర్పణము

శ్రీరామాది దశావతారములకున్, శ్రీలక్ష్మీవాణీ ఉమా
తారాశక్తులకున్, త్రిమూర్తులకు స్వస్థానంబుగా నొప్పు నా
పారావారము, రామకృష్ణగురు, సర్వాధ్యాత్మికస్థానమున్
ఆరాధించుచు గ్రంథ మిచ్చెదను సర్వాధ్యాత్మికాన్వేషినై

శ్రీవిద్యాప్రతిభాస్వరూపులు, మహోత్కృష్టానుభూతస్థితుల్
భావాతీతులు, తత్త్వసిద్ధులును, సర్వాధ్యాత్మికాచార్యులై
భావిన్ భూతము వర్తమానములలో భాసిల్లు తత్త్వజ్ఞులన్
భావిం చే నిడువాడ గ్రంథమును సర్వాధ్యాత్మికాన్వేషినై

శుభమై, సుందరమై, సుఖప్రదమునై శోభిల్లు తత్త్వార్థ సు
ప్రభ కన్వేషకులౌ ముముక్షులకు సర్వాధ్యాత్మికోత్కృష్టతా
విభవార్థంబు ననుగ్రహింపగల దేవిన్ 'సర్వ సిద్ధాంత సా
రభమున్' నేను సమర్పణం బిడుదు సర్వాధ్యాత్మికాన్వేషినై

ఓం

# విషయ సూచిక

# సర్వ సిద్ధాంత సౌరభము

## ముఖ్యప్రబంధము - తృతీయభాగము

### ప్రథమ భాగము – సూచనలు

సాంఖ్య యోగదర్శనములతో గూడిన సర్వసిద్ధాంత సౌరభ ప్రథమభాగ పఠనము గావించిన కొందరు మిత్రులు కొన్ని సముచితమగు సలహాల నా కొసంగిరి. గ్రంథ రచనా విధానము నెల్లరు కొనియాడియుండిరి. కాని ఆయాసిద్ధాంత నిర్వచన వివరణములుండి, ఆయాకర్తల జీవితకాల నిర్ణయ మీమాంసలు గ్రంథమును విస్తరింపజేసినవని కొందరు వాకొనిరి. కాని పాశ్చాత్య ప్రతీచీ సంప్రదాయముల దిలకించినచో నొక వ్యత్యాసము గోచరము. కర్తయొక్క పుట్టుపూర్వోత్తరములును, జీవితవిధానము లెట్లున్నను, అతడొక సుప్రశస్త గ్రంథరచనము గావించినచో నతడు ప్రసిద్ధుడై తత్త్వవేత్తలలో పాశ్చాత్యమున బరిగణింప బడును. కాని భారతీయ సాంప్రదాయమున నట్లుగాక కర్తయొక్క వంశము, గురువు, అతని జీవిత నిర్మలత్వము, తపోనిమగ్నత, అనుభవసందోహము మొదలగు అనేక వ్యక్తివిశేషములుగూడ నా సిద్ధాంతముతో ముఖ్యమై పాఠకుని హృదయమున నొకవిధమైన భక్తిశ్రద్ధల గలుగ

జేయును. కర్త తన జీవితవిధానముచే పాఠకుని యాకర్షింప గలిగినగాని పాఠకుని చిత్తము రంజించుటయేగాక, యతని హృదయముగూడ వికసించి, సాధనాపథమున బ్రవేశించి, యందభివృద్ధి నొంది కర్త రచనమును సార్థకముజేయదు. అట్లు జరుగనిచో నారచనా ఫలిత మేమని యర్థము? చిత్త వికాసముతో హృదయ వికాసము గలిగినగదా అనుభవో దయము! పరోక్షాపరోక్షము లేకమైనగదా జన్మసార్థకము! అందుచే గర్త తన ధీవిశేషమున బాఠకుని నాకర్షించి యున్నను, తన జీవితానుభవ సంపదచే నతని నాకర్షింప కున్నచో దన రచనము వ్యర్థమనియే యార్ష రచనావిధాన రహస్యము. అందుచే నాయా సిద్ధాంతకర్తల జీవితవిశేష ముల గ్రహించి ఆదర్శముగనుంప ననేక గ్రంథపరిశీలన వివరణము లవసరమని తోచెడిని.

అంతియగాక సంస్కృతవాఙ్మయమును గాలించి, యనేక అమూల్య రహస్యముల బహిర్గత మొనరించి, స్తుతించి యున్న పాశ్చాత్య పండితవర్గము మన ఋషివర్యుల జీవిత విశేషముల సక్రమరీతి గ్రహింపనేరక, గొన్ని పొరపాటుల గావించి యుండిరి. అనార్ష సంప్రదాయకులు ఆర్షమును నిర్దుష్టముగ గ్రహించుట కష్టసాధ్యముగదా! అట్లే ఋషి వర్యుల కాలనిర్ణయమునగూడ నా పండితలోకము కొన్ని దోషముల గల్పించిరి. పాశ్చాత్య సంస్కృతి అతి యర్వా చీనమై ఏసుక్రీస్తుకు బూర్వము సుమారు ఆరు ఏడు శతా బ్దములనుండియే పరిమితమై యొప్పారుట యిట్టి పొరబాటు

లకు గారణమై యుండును. ఆర్ష సంస్కృతియన్ననో దుర్గ్రాహ్యమై వెనుకకు అన్వేషకుని కందక బర్వెత్తుచు యుగముల మన్వంతరములదాటి కల్పముల మహాకల్పముల నధిగమించి ప్రస్తుత మానవచిత్తమునకు దూరమై యొప్పారుచున్నది. ప్రస్తుత కల్పమున మాత్రము జూచుచో వైవస్వత మన్వంతరము ఏడవది యగుట, ఆరు ముందరిగి యుండుటచే, స్వాయంభువ మనువువరకు గణించిచూచినను, నేటికి 195,58,85,056 సంవత్సరములు అగుచున్నది. అదియును గల్పప్రారంభమగుటచే 'యథాపూర్వ మకల్పయత' అను ఆర్యసూక్తి ననుసరించి, పూర్వకల్పానుసార సృష్టి యగుచున్నది. అందుచే ఆర్షసంస్కృతి ప్రవాహ ప్రారంభము ఆ గణితమునుగూడ నధిగమించి 'అచింత్యా ఖలు యే భావాః న తాం స్తర్కేణ యోజయేత్' అను వాక్యరీతి దర్కమున కలభ్యమై యనాది యగుచున్నది. అందుచేతనే ఆర్యధర్మమునకు సనాతనధర్మమని ప్రసిద్ధిగల్గినది. అట్టి సంస్కృతిని కించపరుప దలంపుతో గాకపోయినను, సక్రమరీతి గ్రహింపజాలక భారతీయ ఋషిగణముల గాలనిర్ణయముల నత్యాధునికమైన ఏసుక్రీస్తు జననముతో బోల్చి అతి సంకుచితముగ వారు గావించిరి. అంతియగాక, ప్రాచీన ఋషిసత్తముల రచనములగల భావములబోలు భావజాలములు గ్రీసు మొదలగు దేశములగల తత్త్వవేత్తల గ్రంథముల బొడగట్టుటచే, దర్శనాదిశాస్త్రకర్తలు తమ భావసంపత్తిని పాశ్చాత్యులనుండియే గ్రహించి యుండిరనియు నపూర్వ

మును అత్యాశ్చర్యమును అయిన హేయ ప్రతిపాదనముల గావించిరి. విషయ ప్రాధాన్యత ననుసరించి, అది ఎట నున్నను, ఎప్పుడున్నను స్వీకరించుట విజ్ఞుల విధానమై యున్నను యథార్థమును మరుగుపరచి చరిత్రను భంగపరచి ధర్మవిరుద్ధ ప్రతిపాదనము నెవరు గావించినను ధర్మచింతకులు, సత్యార్థులు వాని సత్యమును వెలిబుచ్చుట ఉచితమగునను 'సౌరభ' విధానము సమంజసముగదా! మరియు, ఋషీశ్వరుల గాలనిర్ణయము జేయజాలక గొందరు పాశ్చాత్య విజ్ఞానులు ఆ ఋషిపుంగవులు కేవలము కల్పితులనిగూడ దీర్మానింప సాహసించుట గడుంగడు విచిత్రము. వీరికి దోడుగ గొందరు భారతీయ విద్వాంసులును బై నిర్ణయముల స్థిరపరచి చిత్రాతిచిత్రముగ బాశ్చాత్యుల యడుగుజాడల ననుసరించిరి. అందుచే 'సర్వసిద్ధాంత సౌరభము'న దర్శన ఖండము ముఖ్యముగ అతి పురాణపురుషులును, భారతీయ సంస్కృత సౌధమునకు బునాదులును అగు మహర్షి చంద్రులు కల్పితులు కారనియు, వారు మానవగణితమునకు దూరులనియు, వారి సిద్ధాంతములు పరమ ప్రాధాన్యములై సర్వ ప్రపంచాధ్యాత్మిక చింతనా విధానమునకు ఆధారములనియు, దనశక్తి కందనంతవరకు సూచింప యత్నించుచున్నది.

కావున బాశ్చాత్య పండితలోక వాక్యములను, ప్రతీచీ విద్వాంసుల వచనసంచయమును సాధ్యమైనంతవరకు సేకరించి, వివరించుట 'సౌరభము'నకు అవసర మనిపించెను. అందును, కొన్ని గ్రంథముల శ్రమతో బరిశీలించి, అపరిచితమును, అన్య

మును అగు సంస్కృతభాషా గ్రంథముల మిగుల బరిశోధించి, అందలి గొన్ని మహత్తర విశేషముల వెలిబుచ్చుటయేగాక ననేకభాషల ననువాదముల గావించి ప్రాక్పాశ్చాత్యదేశముల భారతీయ విజ్ఞానౌన్నత్యమును బ్రకటించి యనేకులకు మేలుకొలుపులు పాడియున్న యీ పండితప్రకాండుల విస్మరింప సమంజసముకాదు. కాన, నట్టి ప్రబోధకర వాక్యసమూహమునకు 'సౌరభము' ప్రాధాన్యత యొసంగియున్నది. కాని ఆ పండితవర్గము వివరించిన విషయమే ప్రధానమగును గాని ఆయావ్యక్తులు ప్రధానముకాదని వేరుగ జెప్పనవసరము లేదు. ఆయాసిద్ధాంత గ్రహణమునకు ఆయావిమర్శకు లెంతవర కుపయుక్తమో, అంతదనుకయే వారి వాక్యములు మనకు ప్రయోజనములు.

మరియు, పాశ్చాత్యభాషా పండితుల వాక్యము లాంగ్లభాషలో నుండుటచే, అనువదించినను సంపూర్ణరసము అనువాదమున స్రవించుట కష్టసాధ్యమగుటచే వారి భాషనే యథాతథముగనుంచి, వెంటనే ఆంధ్రానువాదమును జేర్చితిమి. అందుచే నాంగ్లభాషాజ్ఞానము గలవారికి దృప్తి గలుగునని భావము. అందులకై ఆంగ్లము దెలియనివారల నలక్ష్యముసేయక, ఆంధ్రులకే గ్రంథము సంకల్పించిన దగుటచే ఆంగ్లవాక్యముల యర్థము నుంచితిమి. ఆంగ్లమును వదలి ఆంధ్రమునే చదువుకొనినచో గ్రంథపఠనము వారికి సులభముగ సాగిపోవును. అట్లు పఠించుట కష్టమనిపించదు. మధ్యమధ్యగల ఆంగ్లవాక్యముల పుటాంతమునగాని,

గ్రంథాంతమునగాని యుంచు విధానమును కొందరు అనుస రించిరి కాని, అట్లుగావించిన వాక్యమాధుర్యము సందర్భాను సారముగ వెంటనే గోచరించక గాలాంతరగ్రహణము గలుగ జేయునుగాన ఆంధ్రరచనము మధ్యనే సంబంధము లేని సంబంధ ముతో జేర్పవలసి వచ్చినది.

---

## తత్త్వవేత్త కర్తవ్యము

ప్రాచీనకాలమునుండి తత్త్వవేత్తయొక్క స్థాన మతి ప్రధానమై రాజిల్లుచున్నది. కేవల మనస్సునకే ప్రాధాన్యత నొసంగి దాని చంచలమునకు గురియయి, సుస్థిర ఆధ్యా త్మికభావ సముదాయము నార్జింపనొల్లక సంశయాత్ములుగను, నాస్తికులుగను బరిణమించువారలకును; సాధనామార్గమున బడి కించిదనుభవసంపత్తి నార్జించియు, సత్యాసత్యముల నారయజాలని సాధకులకును ఉపదేశకుడై సందేహనివారణో పాయమై తత్త్వవేత్త యొప్పారును. ప్రథములకు ప్రాపం చికవిషయముల సత్యత్వమును ఎత్తిచూపుటనుంచి, అవి భ్రాంతి జన్యములని నిరూపించి భోక్తృభోగ్యముల విడదీసి, భోక్తృ విమర్శ గావించి, భోక్తృభోగ్యభావసంబంధముగనున్న భోక్త యొక్క ఆనందాతిశయ వివరణముల గావించి వారి సన్మార్గ వర్తనుల గావించుట తత్త్వశాస్త్రవిదుని బాధ్యతయే యగు చున్నది. అటులే సాధకునికి ప్రపంచతత్త్వమును బోధించి,

శాస్త్రీయ సాధనవిధానముల నుపదేశించి, సందేహముల నివారించుటయు నాతని కర్తవ్యముగ నున్నది. ఆపనిని బండితుడు గావింపగలడా అను సందియము గల్గునుగాని, తత్త్వవేత్తయన ఉపనిషద్వాక్యమున దెలుపబడిన శ్రోత్రియత్వ బ్రహ్మనిష్ఠత్వములుగల వ్యక్తి యనియే యని 'సౌరభ' తాత్పర్యము.

మీదుమిక్కిలి ఆధునిక కాలమున Science, Reason, భౌతికవిజ్ఞానయుక్తి లోక కతుగను, Religion, Dharma మతాచరణము మతశాస్త్రము లోక కతుగనుండి ప్రాబల్యమునకు నిత్యపోరాటము సల్పుచుండ, వీని సమగ్రతాత్పర్యమును గ్రహించియున్న తత్త్వజ్ఞుని యవసర మెంతేని ఆవశ్యకమయ్యెడిని. ఈకతుద్వయమునకు మధ్యగల తారతమ్యముచు తగ్గించుచు, సమన్వయపరచుచు బరస్పర సందేహముల నివారణ మొసంగి, భౌతికవిజ్ఞానమును యాంత్రికవిధానము ననుసరించి వారికి సందే తత్త్వశాస్త్రమును ధర్మశాస్త్రమును, ఆస్తికతను రూపించుటయు, ధర్మపరాయణులకు భౌతికాది ఆధునిక విజ్ఞానరహస్యముల బోధించి భౌతిక ధర్మవిజ్ఞానముల సమన్వయ మొనరించి ప్రబోధించుటయు నీతని ముఖ్యధర్మము. అట్టి సమర్థత 'సౌరభము'నకు లేకున్నను, ప్రథమభాగ ముఖప్రబంధమున సూచించిన విధానమున నీరచనము అధికతరమైన అధికారులకు మేలుకొలుపుల బాడి ఉత్తమ రచనములకు బ్రోత్సహించు సరస్వతీపూజ

యుని భావింపదగును. తా గ్రహింప సులభమై యున్నను, ఇతరులకు జెప్పి ఒప్పించుట కష్టసాధ్యముగదా!



## తృతీయ భాగము

ద్వితీయభాగ ముఖప్రబంధమున వాకొనినచందము మిత్రుల ప్రోత్సాహముచే గణాదమునివరప్రోక్త వైశేషిక సిద్ధాంతము. గౌతమమహర్షికృత న్యాయదర్శనములతో గూడిన ద్వితీయభాగము ముద్రింపబడుచుండ, పరమేశ్వర కృపాకటాక్షములచే తృతీయభాగముగూడ ముద్రణాలయ మును జేరెను. ఈశ్వరానుగ్రహము అజేయముగదా! ఇట్లే ఆ దేవదేవుని కరుణావిశేషమున అచిరకాలముననే శంకరపూర్వ, శంకర, శంకరానంతర భాగములతో గూడిన యద్వైతఖండముగూడ ఆంధ్రమహాజనుల కరముల నలంక రించి వారివారి కనుగుణ విధానమున సహకారి యగునుగాత అని 'సౌరభము'యొక్క గాఢ విశ్వాసము. అంత వైష్ణవ, శైవ, బౌద్ధ, సమన్వయ ఖండములుగూడ అత్యుత్సాహ మున ఆంధ్రమాత సేవగావింప బయల్వెడలును. అంతగాని 'సర్వసిద్ధాంత సౌరభ' గ్రంథము సార్థకము కాదుగదా!

—

# మీమాంసా తత్త్వము

షడ్దర్శనములలో నొక్కొక్కదర్శనమున కొక్కొక్క ప్రత్యేకత కలదని పూర్వము గ్రహించియుంటిమి. సాంఖ్యము ప్రకృతిపురుషుల పరిణామసంబంధముల బోధింప, తత్సంబంధ రహిత కైవల్యమును బ్రతిపాదింప, యోగము చిత్తవృత్తి నిరోధరూప సాధనలబోధించి, కైవల్యప్రాప్తికి మార్గములను, కైవల్యస్థితిని బోధించెను. వైశేషికము స్థూలసృష్టిపద్ధతిని వివరించి సిద్ధత్వమును దృష్టికందింప, న్యాయము తర్కమార్గమున దాని సమర్థించి, విమర్శకుల జయించి మార్గమును పటిష్ఠము గావించినది. ప్రస్తుత మీ భాగమున జర్చింపబడబోవు మీమాంసాద్వయములో బ్రథమమైన కర్మమీమాంసాశాస్త్రము జీవమీమాంసగావించి, వాని ప్రపంచ జీవనమున సుఖము జేకూర్ప యనేక కామ్యనిష్కామ్యరూప యజ్ఞయాగాదులను, కర్మానుష్ఠాన పద్ధతిని బోధించెను. బ్రహ్మమీమాంసయు బ్రహ్మమును శాస్త్రోచిత న్యాయ మార్గమున జర్చించి, జీవబ్రహ్మముల సంబంధముల వివరించి, వారి సమానత్వ విచారముగావించి, జీవుని బ్రహ్మమున జేర్చి యతని ఆనందస్వరూపుని గావించినది.

కాన ప్రస్తుత చర్చనీయాంశమైన మీమాంసా శాస్త్రము జీవుని కర్తవ్యనిష్ఠుని గావింప నుద్యుక్తమై అతని సుఖ సంపాదనమునకు నసంఖ్యాకవిధముల బ్రతిపాదించి, శాసించి, 'కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతం సమాః'

అను ఈశావాస్య వాక్యమురీతి నూరువత్సరముల జీవింప గర్మనాచరింప శాసించుచున్నది. అనగ గర్మమార్గావలంబకుడు, ఆమార్గమును శాస్త్రోక్తరీతి ఆచరించుచో దీర్ఘకాలము సుఖసంపత్తితో ప్రపంచమున జీవించి, బ్రహ్మమీమాంసయందడుగిడ సమర్థుడగుచున్నాడని చెప్పనగును. అవును కర్మమీమాంసా నియమముల యోచించుచో నట్టి నమ్మకము దోచకమానదు. ఆ నియమావళిలో నడుగడుగునను సాధకుని ఆరోగ్యము ముఖ్యముగనుండుచు, తత్సిద్ధికి మార్గముల సాంకేతికముగ బోధించుచున్నది. ఆ శాస్త్రవిషయముల నాకించుక భౌతిక విజ్ఞానదృష్టి బరిశీలించుచో ప్రస్తుత భౌతికవిజ్ఞానరహస్యములు సాధకుని కుపయుక్తములు గావింపబడియున్నవి. ఆధునిక శాస్త్రజ్ఞులకందని Scientific Truths వైజ్ఞానికసత్యములందిమిడియున్నవనియు దోచును. అట్టివాని technical శాస్త్రీయదృష్టితోగాక ప్రస్తుతము స్థూలదృష్టితో గ్రహింప యత్నించెదముగాక.

మీమాంసాశాస్త్ర కర్మానుష్ఠానక్రమము సాధకునికి బ్రహ్మముహూర్త మనబడు ప్రాతఃకాలముననే ప్రారంభమగును. జన్మించిన సాధకుని జాతకకర్మతో బ్రారంభించిన కర్మకాండ అన్నప్రాశనాక్షరాభ్యాసాదులతో నభివృద్ధి నొందించి, ఉపనయన మనబరగు బ్రహ్మవిద్యానుష్ఠానప్రవేశము గావింపజేసి వానప్రస్థులగు మహర్ష్యాశ్రమములకు గొంపోయి కర్మ మీమాంసాభిధానమున నిష్ణాతులై బ్రహ్మనిష్ఠులైయున్న అనుభవపరుల అంతేవాసులగావించి, శిక్షణకు

నొందించును. సూర్యోదయాత్పూర్వము సుమారు మూడు గంటలకు శయ్యలపైడి కాల్యకృత్యముల నొనర్పవలెను గదా బ్రహ్మచారి! ఆ సమయ మతి ప్రశాంతమై సర్వజీవ రాసులు గాఢనిద్రను బాసి జాగ్రదవస్థ కుపక్రమింపబోవు చున్న కాలమది. సూర్యుని యరుణకాంతుల సూచించుచు ప్రాగ్దిశ మందకాంతులు తొంగిచూచు మందమలయమారు తము ప్రాణుల నుత్తేజమొనరించు కాలమది. వాతావర ణము అప్రయత్నముగ సాధకుని చిత్తము నేకాగ్ర మొన రించు కాలమది. నక్షత్రరాసులనుండియు, చంద్రునినుండియు అవ్యక్తశక్తుల నాకర్షించి, లయింపచేసికొని ఒకవిధమగు అద్భుతశక్తితో జలములు సాధకుని కుత్తేజ మొనరించు కాలమది. అందుచే బ్రహ్మచారులు ఆ సమయమున శరీరమున కారోగ్యదాయకమైన శీతలోదకముల జలకమాడి అగ్నిహోత్రాది కార్యముల నిమగ్ను లగుచుందురు. ఆ సమయమున జలజలప్రవహించు నదీమతల్లులు ప్రఖ్యాత ముగ ఆరోగ్యశక్తి స్నాతునకు ప్రసాదించుచుండ కూపాదిక జలాశయములును అనుసరించును. అట్లు స్నాతులై కౌపీన ధారులై అశ్వత్థ, ఔదుంబర, మోదుగాదిక సమిధలతోడను, ఆజ్యముతోడను, సర్వప్రాణికోటికి దేజోపుంజముల నొసంగు అగ్నిహోత్రునకు హోమకార్యముగ బ్రహ్మచారులు కడంగు దురు. అంత సూర్యోదయకాలమున ఆసన ప్రాణాయామ ములతో, ప్రకాశస్వరూపుడైన సూర్యుని ఎదుట ఆసీనులై సంధ్యావందన మొనరించెదరు. ఉదయ భాస్కరుని కిరణ

ముల గల Cosmic and Ultra-Violet శక్తులు బ్రహ్మచారి శరీరమునకు దగిలి అతనియం దద్వితీయ పరివర్తనమును గలుగజేయును. దాని కనుగుణముగ Anti-Malarial and anti-germicide మలేరియా నిరోధకమై క్రిమిసంహారిణియగు విభూతిధారణముగూడ నతని కెక్కువ యుపయుక్తమగు చున్నది. అంత ధ్యానాదినిష్ఠల జరిపి గురుసేవాదికమైన యంత గురుసన్నిధానమున స్వాధ్యాయమున మునుంగుదురు. మరల మాధ్యాహ్నిక సాయంసమయ సంధ్యావందనాదుల గావించి రాత్రి లఘ్వాహారముగావించి అనుష్ఠానముల చిత్తమును పునీతము జేసి. గురుముఖద్వారమున వెల్వడు అమృతోప దేశముల శ్రవణముగావించి మననముతో నిద్రబొందుదురు ఆనాటిబ్రహ్మచారులు. ఈ కార్యక్రమమాహాత్మ్య మెద్దియో గాని, కొంతకాలమునకు, బ్రహ్మచారి ముఖము బ్రహ్మ తేజోబింబమై, ఆకర్షవంతమై యొప్పారును. ప్రాతఃకాల స్నానమహిమ చేతను, హోమద్రవ్యమునుండి వెలువడు అపూర్వ శక్తియుక్తమగు ధూమము, మరియు నుష్ణప్రసార ములనుండి యుద్భవించిన మహిమచేతను, అతడు కాయక వాచిక మానసిక శక్తియుక్తుడై విద్యావంతుడై ఆదర్శ వర్త నుడై విరాజిల్లును. ఇదియంతయు మీమాంసాశాస్త్ర ప్రోక్త అనుష్ఠానముననే జరుగుచున్నదని నమ్మదగును.

అంత నా బ్రహ్మచారి ఉపకుర్వాణ బ్రహ్మచారియై యుండుచో గుర్వాజ్ఞను స్వీకరించి సాంప్రదాయిక కుటుంబ జన్యయగు కన్యను పరిణయమాడి గృహస్థాశ్రమమున [illegible]

శించును. అయినను, మీమాంసాశాస్త్రము అతని అంగ రక్షకుడై నియమనిష్ఠలనుంచి కాపాడుచు సర్వవిధముల నతనికి అభివృద్ధి గలుగజేయును. అతని కేలోపమున్నను దీర్ఘ నాశాస్త్రము కంకణము ధరించును. సంతానము లేకున్న 'పుత్రకామేష్టి'ని చేయుమనును. పశుసంతతికొరకై 'పశు కామేష్టి'ని సూచించును. వర్షాభావమైయున్న చో 'వృష్టికామము' ను దెల్పును. ఈ విధముగ నాయా లోపములకుదగు నాయాయజ్ఞ యాగాదికముల బోధించి తన యాశ్రితుని సర్వసంపన్నునిగా చేయు నీ పూర్వమీమాంసా శాస్త్రలక్ష్యము నెల్లు కొనియాడదగును! పుత్రకామేష్టికైయుప యోగించు ద్రవ్యములలో వాని వాయువులలో నెట్టి యద్భుత శక్తియుండి దంపతులకు వీర్యవృద్ధిగావించి సంతానమును ప్రసాదించునో! వృష్టికామమున నుపయోగించు పదార్థ ముల హోమముజేయ నందుండి వెల్వడు వాయువులకును మేఘమండలమునకు నెట్టి సంబంధముండి వర్షింపజేయునో గదా! అట్లే యితరవిషయములగూడ నాయాయజ్ఞాదికమున నుపయోగించు వస్తువుల శక్తులను హోమకాలమున నుద్భ వించు అజ్ఞాతశక్తులను, ఆధునిక భౌతికవిజ్ఞాన విధానమున (Scientific Research) విచారించి శాస్త్రవేత్తలు దేశమునకు బ్రసాదించినచో నెట్టి ప్రయోజనము లోకమునకు జేకూర గలదో! అందుచేత మీమాంసాశాస్త్రము ప్రస్తుత మాధునికుల కవగాహనము కాసిఅనేక శాస్త్రీయ (Scientific) సత్యముల నంతర్గత మొనరించి ఆధునికభౌతికవిజ్ఞానవేత్తలకు

సముచిత గవేషణావిషయముగ బెంపొందుచున్నది. అట్టి కృషికి సమర్థులగు బండితాగ్రేసరులు భౌతికశాస్త్రజ్ఞులతో సంప్రదించి పూనుకొని, మీమాంసాశాస్త్రమున నజ్ఞాతముగ నున్న అనేక లోకోపకారక శక్తిసముదాయమును బహిర్గత మొనరించి లోకసేవ గావించెదరుగాక అని 'సర్వసిద్ధాంత సౌరభము' విశ్వసించుచున్నది.



## వేదాంతదర్శనము

వేదాంతదర్శన ఉపోద్ఘాతమున దాని ప్రాధాన్యత వివరింపబడియున్నది. మీమాంసాశాస్త్రము జీవునిపై దృష్టిని కేంద్రీకరింప, వేదాంతము సర్వాధారమైన బ్రహ్మపదార్థముపై బుద్ధినుంచి, న్యాయవైశేషిక సిద్ధాంతప్రోక్త స్థూల సృష్టిని, సాంఖ్యయోగ ప్రతిపాదిత జీవుని ఆ బ్రహ్మముతో సమన్వయపరుప యత్నించినది. ఆ సమన్వయము అద్భుత లీల నసంఖ్యాకమై వివిధసిద్ధాంతులకు వివిధములుగ దోచునట్లు గావించి సర్వప్రపంచ తత్త్వశాస్త్రముల పాదపమై యలరారియున్నది. 'బ్రహ్మసత్యం జగన్మిథ్య జీవో బ్రహ్మైవ నా పరః' అనురీతి బ్రహ్మజీవప్రకృతుల సంబంధమును స్పష్టపరచెను. వేదాంతమునుండి జనించిన వివిధ సిద్ధాంతముల వ్యత్యాసము లెట్లున్నను, బ్రహ్మమే సర్వ సృష్టికి పరమకారణముగ సర్వసిద్ధాంతుల సమ్మతము. జీవ

బ్రహ్మములకు. బ్రహ్మప్రకృతులకువలె జనకజన్య భావ సంబంధమున్నను లేకున్నను, చైతన్యసంబంధము మాత్రము సుస్పష్టము. అదియు సర్వమత సమ్మతము.

అందుచే ఈతత్త్వత్రయ సంబంధమును శాస్త్రీయ విధానమున విచారించుచో నాధునిక భౌతికవిజ్ఞాన (Scientific) రహస్యములు వెలువడును. 'అణోరణీయాన్ మహతో మహీయాన్' Microcosm & Macrocosm అనిగదా బ్రహ్మ నిర్వచనము. అవియేగదా ప్రత్యక్పరాగాత్మలని అన్వయము. అదియేగదా అంశాంశిభావ సంబంధము. అట్లగుట జీవబ్రహ్మములు శుద్ధచైతన్య స్వరూపులై తత్త్వతః నుండుచు, ఉపాధితః విభేదము గలిగియున్నట్లు గోచరము. దానినింకను విమర్శించిచూచుచో నాజీవుడు బ్రహ్మము యొక్క ఆభాసరూపుడై ప్రతిబింబించి న్యాయమున బ్రహ్మ చైతన్యమునుమాత్రముగలిగి అవధికుడై యొప్పారుచున్నట్లు విదితము. కాన నాబ్రహ్మము 'తదంతరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః' అనురీతి సర్వవ్యాప్తమై All pervasive force సర్వశక్తియై యొప్పారుచుండుట గాన నగును. అందుచే ప్రకృతిలో వ్యక్తమగుచున్న, సర్వజీవులలో చైతన్యమును గనుపరుచుచున్న Life ప్రాణశక్తియు నాబ్రహ్మశక్తియొక్క భాగమో రూపాంతరమో ప్రతిబింబమో అయియుండవలయునని వేదాంతతాత్పర్యము. అనగా Life ప్రాణ Matter ప్రకృతి జన్యముకాక బ్రహ్మమనియే బోధ్యము.

ఇక బ్రహ్మ ప్రకృతిసంబంధమును విచారించినచో, ప్రకృతియు బ్రహ్మవికారమే యగుచున్నది. కాని అది స్థూలము. జీవుడు సూక్ష్మము. 'పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే । పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే॥' బ్రహ్మము అఖండము అనంతము, ప్రకృతియు ననంతము. బ్రహ్మమునుండి ప్రకృతి జన్యము. అనంత బ్రహ్మమునుండి అనంతప్రకృతిని దీసివైచినను బ్రహ్మ మనంతముగనే నుండునని ఉపనిషత్తు. ఈ యర్థమునే 'జన్మాద్యస్య యతః' ఈప్రకృతి దేనినుండి జననమో అని తన ద్వితీయ సూత్రముననే ప్రస్తావించియున్నది. ఆ పుట్టు కను వివరించుటకు ఆరంభణ, పరిణామ, మాయా (ఆభాస) అజాతి వాదము లెవ్వియైనను బ్రహ్మముయొక్క కారణ త్వము నంగీకరించును. బ్రహ్మప్రేరణము లేనిదే సృష్టి దుర్లభము. కాని వివిధ సిద్ధాంతములు ప్రకృతిబ్రహ్మముల సంబంధమును వేదాంతదర్శనాధారముగనే శ్రుత్యానుసార ముగ దీర్మానించియుండిరి. అయిననిందు ఆధునిక భౌతిక శాస్త్రవాదములు (Scientific Thought) లేకపోలేదు. ప్రకృతి జడముగాన సృష్టి చేతనసహాయాపేక్షికముగాన, సృష్టికి జీవు డసమర్థుడగుటచే, పరిశేషన్యాయమున బ్రహ్మచైతన్యమే సృష్టికి నిమిత్తకారణ మగుచున్నది. అందుచేతనే 'తదై క్షత బహుస్యాం ప్రజాయేయ' నానాత్వ మగుదునుగాక యని అది దలంచెను అనియు, 'సో కామయత, తత్తేజో సృజత' అది సంకల్పించెను, అది తేజస్సును సృజించెను

అను శ్రుతివాక్యములు సృష్టిసంకల్పమును బ్రహ్మాధీనము గావించియున్నవి. 'రూపే రూపే వ్యాకరవాణి' రూప రూపము నది సృజించి, నవి జడము లగుటచే చేతనాంశమగు తాను ప్రాణరూపమున 'తదేవానుప్రావిశతు' అందు ప్రవేశించెను. కాన జీవసృష్టికిని ప్రకృతిసృష్టికిని తారతమ్యము గోచరము. అట్లు బ్రహ్మసంకల్పిత ప్రథమసృష్టి స్థూల సృష్టి కాధారమైయున్నను అతిసూక్ష్మములై సర్వేంద్రియాతీతమై యొప్పారినది. అదియే అవిద్య. మాయ, శక్తి మొదలగు పర్యాయపదముల వ్యక్తము. ఈ సృష్టిక్రమమును వివరించుచు 'ఆత్మనః ఆకాశస్సంభూతః, ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యపృథివీ' ఆత్మనుండి ఆకాశము జనితము. అందుండి వాయువు, దానినుండి అగ్ని, అగ్నినుండి జలము, దానినుండి పృథివీభూతములు (Elements) జనించినవి. Elements పదార్థములు పై పంచభూతములు కాదనియు నవి ప్రస్తుతమునకు తొంబదిరెండని భౌతికవిజ్ఞానవేత్త లందురుగాని, యీ పంచభూతములు పదార్థములు గాక, సృష్టిక్రమమున పదార్థములు పొందు రూపాంతరములని గ్రాహ్యము. ఎట్లనిన, విద్యారూపుడగు, బ్రహ్మమునకు అన్యముగ జడమై విరుద్ధముగనున్న అవిద్య ఆత్మనాబరగు బ్రహ్మమునుండి జనించెను. అది బ్రహ్మమువలె సర్వవ్యాప్తము. సర్వాంతర్గతము. అదియే కాలాంతర స్థూలసృష్టి కాధారము. అది యిసుమంత రూపాంతరమునొంది ఆకాశతత్వ మగుచున్నది

అవిద్యారూప మాయ Science భౌతికవిజ్ఞానమునకింక అగ మ్యముగ నున్నను, యీ ఆకాశత త్త్వమును Inter stellar Space గోళాంతరాకాశముగ సమన్వయము. అదియు 'అవ కాశవాన్ ఆకాశః' అనురీతి గోళరూపమున గగనమున గోచరించు సర్వవిశ్వములును వానిలోగల సర్వచరాచర వస్తుకోటియు నుండుట కవకాశ మొసంగుచున్నది. అది మరల రూపాంతరమునొంది గోళాకారములగు అనేక నక్షత్ర విశ్వములకు దృశ్యమానరూపమైన Gaseous State వాయు భూతమగును. దీని నొకించుక గ్రహింప సాధ్యము. స్పర్శ గ్రహణమునకు సాధ్యము. దీనిలో Plank ప్లాంక్ అను శాస్త్రజ్ఞునిచే దెలుపబడిన Quantam శక్త్యణుసిద్ధాంతము ననుసరించి అద్భుతశక్తి నిండియుండును. అది పరిణమించి Light State తేజోస్థితి నొందును. ఇది నేత్రములకు గోచ రము. దీనినే Nebulous State నెబ్యులస్ స్థితి అని అందురు. అది ఘనీభవించి Liquid State జల అనగా ద్రవరూపము దాల్చును. అట్టి నక్షత్రములు అంతరాళమున గలవని శాస్త్రజ్ఞుల విశ్వాసము. పిమ్మట నదియు స్థూలమై ప్రస్తుత భూమండలాకృతి నొందుచున్నది. ఇది యంతయు ఆధునిక భౌతికవిజ్ఞానానుసారముగ నుండుటయం దాశ్చర్యములేదు. ఈ Scientific view భౌతికశాస్త్రదృష్టి ప్రాచీనమహర్షులకు అనాదికాలమునుండి సుపరిచితమే యని స్పష్టము. ఇట్లు భూతసృష్టి కాధారభూతమైన పరిణామమును దిలకించిన, Gaseous వాయుస్థితిలో శక్తి అది సూక్ష్మమై యుండును.

దానినే పరిమండలము నాబరగు Nucleus న్యూక్లియస్‌లో అంతర్విభాగములైన Proton, Neutron, Electron, ప్రోటాన్ న్యూట్రాన్ ఎలెక్ట్రానులగల అది సూక్ష్మశక్త్యాణువు (forcicle) లు సర్వవ్యాపకములై యొప్పారి 'యా దేవీ సర్వభూతేషు శక్తిరూపేణ సంస్థితా' అను వాక్యమును స్ఫురింపజేయుచున్నవి. అందుచే మనకు స్థూలముగ సర్వవస్తు సముదాయము యథార్థముగ నతి సూక్ష్మద్రవ్య పరిణామరూపములుగనో లేక ఆభాసరూప ములుగనో గానబడునని వేదాంతతాత్పర్యము అవును, ఆధునిక భౌతికవిజ్ఞానమురీతిగ అణుస్పందన తారతమ్యము (Vibrations of atoms) ననుసరించియేగదా వస్తువుయొక్క రూపగుణములు వ్యక్తమగుట. పైవిధముగ బ్రహ్మము జీవప్రకృతుల కాధారభూత చైతన్యమైయున్నను, వీని కన్యమును అతీతముగనుండి వారి పరిణామవికారములతో సంబంధ మావంతయును లేక నుండును. ప్రకృతి పరిణామము నొందినను, దానగల చైతన్యశక్తిమాత్రము దానివికారము గాక కేవల బ్రహ్మమేయనియు అనగ జీవుడు ప్రకృతికన్యు డనియు దాత్పర్యము.

కావున వేదాంతశాస్త్రము తదంతర్గత వివిధ సిద్ధాంతములతో అధ్యయనముగావించి, Scientific View విజ్ఞాన దృష్టి బరిశీలించినచో ప్రస్తుత విజ్ఞానశాస్త్రమునగల యనేక విషయములు వ్యక్తమగుటయేగాక, ప్రస్తుత మాశాస్త్రముగ

కలీతముగనున్న అసంఖ్యాక ప్రకృతి, చైతన్యరహస్యములు వెలువడును. అట్టి గవేషణాపద్ధతికి తజ్ఞులు పూనుకొని ఆర్య ధర్మ మహాత్మ్యమును బ్రకటించి ధన్యత గాంచెదరుగాక అని విశ్వాసము.



## దర్శనఖండము

ఆదివిద్వాంసుడును పరమసిద్ధుడును అవతారవంద్యుడును అగు కపిలమునివరేణ్యుని ఆశీస్సులతో బ్రారంభింపబడిన మన సౌరభగ్రంథమున దర్శనఖండము వేదాంతముతో Intellectual Power ప్రజ్ఞాశక్తి స్వరూపమని ప్రఖ్యాతి నార్జించి అసంఖ్యాక ఉద్గ్రంథరచనము గావించిన వేదవ్యాసుని అనుగ్రహావిశేషముతో బూర్తిగాంచినది. అటులనే భగవాన్ శ్రీ రామకృష్ణదేవుని కృపామహిమచే మిగిలిన దశాధిక భాగములుగల, అద్వైత, వైష్ణవ, శైవ, బౌద్ధ, సమ్వానయు ఖండములును అచిరకాలమున ప్రకటితమై దేశవ్యాప్తి నార్జించి, తత్త్వజ్ఞానాభిలాషుల కుపయుక్తమై సార్థకమగును గాక అని మరల సౌరభముయొక్క నమ్మకము.

మంగళం మహత్

# సర్వ సిద్ధాంత సౌరభము

## దర్శనఖండము

## మీమాంసా దర్శనము

ఓం

# మీమాంసా దర్శనము

## ఉపోద్ఘాతము

---

### భారతీయ సంస్కృతి

The aim of philosophical wisdom is not merely the satisfaction of intellectual curiosity, but mainly the enlightened life led with far-sight, fore-sight, and insight.[1] తాత్త్వికవిజ్ఞానముయొక్క గమ్యము కేవలము బౌద్ధికవిస్మయోపశమనమునకుగాక దూరదృష్టితో, సూక్ష్మదృష్టితో, అంతర్దృష్టితో దేజోవంతమగు జీవితమును సాగించుకొనుటకేయని శ్రీసతీశచంద్రఛటర్జీ తన భారతీయ తత్త్వశాస్త్రమున వాకొనును. అందుచేతనే In India religion is hardly a dogma, but a working hypothesis of human conduct, adapted to different conditions of life.[2] హిందూదేశములో మతము కేవలము సిద్ధాంతరూపముగనే యుండక, వివిధస్థితులుగల జీవన విధానముల కనుగుణముగ మానవప్రవర్తనమునకు అనుష్ఠేయమార్గముగ

1. Prof. Satish Chandra Chatarjee : An Introduction to Indian Philosophy p-15
2. Pandit Jawaharlal Nehru : Discovery of India p-145

విలసిల్లియున్నదని Havell హావెల్ అనురీతి ప్రాచీనకాలము నుండి భారతవర్షము కేవల తార్కికపద్ధతులకే ప్రాధాన్యత నిడి జీవనవిధానమును విస్మరింపక నిఃశ్రేయసరూప ముక్తి సాధకమగు బద్ధతి వాచాలత్వమునగాక బ్రవర్తనముననే గలదని నొక్కివక్కాణించుచున్నది. అట్లు తమ విజ్ఞానమును నిత్యజీవితప్రక్రియతో సమ్మేళనమొనరించుచు, Man must rest, get his breath, refresh himself at the living wells which keep the freshness of the eternal. [3] మానవుడు విశ్రాంతిగైకొనుచు, నిత్యమైన వికాసముతో సంబంధమేర్పరచుకొని ఆనందముగ నుండవలెనని Michelet మిఖెలెట్ అనునట్లు నిత్యానందవిభూతిలో మైమరచుచు మన ఆర్షలోకము కాలమును గడిపెను. కావున Indians of those distant days were light-hearted race, confident and proud of their traditions, dabbling in the search for the mysteries full of questions addressed to nature and human life, attaching importance to the standards and values they had created, but taking life easily and joyously, and facing death without much concern [4] ప్రాచీనకాలపు భారతీయులు మృదుహృదయము గలజాతి. తమ సంప్రదాయముల గర్వమును విశ్వాసమును గలవారు. సంశయములతో గూడిన ప్రకృతి, మానవజీవితములయొక్క అద్భుతముల

3. Dr. Michelet : The Bible of Humanity

4. Pandit Jawaharlal Nehru : Discovery of India n-౨

అన్వేషణలో మునుగుచు, తాము నిర్మించిన విధానములకు ప్రాధాన్యత నొసంగుచుందురు. కాని జీవితమును స్వల్పము గను, ఆనందముగను గైకొనుచుందురు అయినను మృత్యువును నిర్లక్ష్యముగ నెదుర్కొనుచుందురు అని జవహరిలాల్ నెహ్రూ పండితుడన్నటుల నాటి భారతీయులు నిరతిశయానందమున జీవించియుండిరి. అందుచేతనే ఒక్క మాటలో Our ancestors were great [5] మన ప్రాచీనులు గొప్పవారు అని వివేకానందులు వచించియున్నారు. అట్టి అద్భుత మానవకోటిచే నాశ్రయింపబడిన భారతవర్షము The most fascinating and the most mysterious country on the face of the earth [6] అమితాకర్షణీయమై ప్రపంచమున అత్యంతాద్భుత దేశమని పేరెన్నికగాంచుటయం దాశ్చర్యమావంతయును లేదు. ఈ విషయమును సమగ్రదృష్టి బరిశీలించి In certain chapters of the Brahmanas and Upanishads, we see a picture of the social and intellectual life of India, at that time, which seems fully to justify the saying that India has always been a nation of philosophers[7] ఉపనిషద్బ్రాహ్మణములలో ఆనాటి భారతము యొక్క సాంఘిక, వైజ్ఞానిక జీవితము గోచరించును. భారతవర్షము ఎల్లప్పుడును తత్త్వవేత్తల భూమి యను సూక్తి యథార్థమని అది నిరూపించునని Max Mullur మాక్సుముల్లరు

---

5. Swami Vivekananda; The Complete Works Vol. III p-288
6. Rev. S. Fletcher Williams: Life and work in India
7. Prof. F. Max Muller: The Six Systems of Indian Philosophy p-11

గర్వముతో వచించెను. As far back as we can trace the history of thought in India from the time of the King Harsha (610 – 650 A. D.)......and in the end the Upanishads themselves, and the hymns of the Veda, we are met every where by the same picture, a society, in which spiritual interest predominates and throws all material interests in the shade; a world of thinkers, a nation of philosophers. [8] క్రీ. త. 610 సంవత్సరములకు చెందిన శ్రీహర్షుని కాలమునుండి భారతీయ సంస్కృతి చారిత్రమున సాధ్యమైనంత వెనుకకు వెడలినచో చివరకు ఉపనిషత్తులు, వేద మంత్రములవరకు అరుగగ, భౌతికవిషయముల ప్రక్కకు ద్రోసి, ఆధ్యాత్మిక విషయమునకే ప్రాధాన్యత యొసంగబడిన సాంఘిక వ్యవస్థయొక్క రూపమే మనకు గోచరించును. అందుచే భారతి ధీశాలుర ప్రపంచము, తత్త్వవిదుల ఆస్థానము అని మాక్సుముల్లరు ఆనందించెను. అనాది కాలమునుండి India has ever held views which are both wide and of the deepest [9] హిందూదేశము అతివిశాలమును నిగూఢమును అగు భావజాలముల గల్గియుండెనను Sir John Woodroffe సర్ జాన్ ఉడ్రాఫ్ వాక్యములు యథార్థములు సముచితములు. ఆ కారణముననే India also is in one of Her forms a specific Shakti the Bharata Shakti[10] భారతదేశము శక్తియొక్క ప్రత్యేకరూపమై భారతశక్తి

8. Prof. F. Max Muller: The Six Systems of Indian Philosophy p-32
9. Sir John Woodroffe: The World as a Power-Reality

యగుననియు, It is not without reason that it has been called Punya Bhumi and Karma Bhumi[10] అది పుణ్యభూమి అనియు కర్మభూమి అనియు కీర్తినార్జించియుండుట కారణములేక జరుగలేదనియు నతడు సగర్వముగ వక్కాణించి యున్నాడు. భారతము అనేక వేల వర్షములనుండి has been a fountain spring of spirituality [11] ఆధ్యాత్మిక స్రవంతియనియు Sir Francis Younghusband సర్ ఫ్రాన్సిస్ యంగ్‌హస్బెండు ఉప్పొంగియున్నాడు. కాని ఇట్టి అసమానాధ్యాత్మిక దృష్టి భారతీయులకుండుటకు కారణ మెయ్యది? అని యోచించుచో భారతీయ దృష్టియే ఉత్కృష్టము. అదెట్టులన If to the old Greek the universe was an expression of art and beauty, if to the Roman it was an expression of law and order, to the Hindu, it is an expression of the Divine[12] ప్రాచీన గ్రీకులకు కళాసౌందర్యములమూర్తిమంతమే విశ్వమగుచుండ, రోమనులకు శాసనబద్ధత్వమే విశ్వముగానుండును. కాని భారతీయులకు విశ్వమన దేవత్వమావిర్భవించుటయే యగును అని మనకు T. E. Slater టి. ఇ. స్లేటర్ సమాధాన మొసంగుచున్నాడు.

---

10. Sir John Woodroffe: Shakti and Shakta p-433
11. Sir Francis Younghusband: Spiritual Renaissance Stirs in India
12. Dr. T. E. Slater:
Higher Hinduism in Relation to Christianity p-4

## వేదము

ఈ విధముగ అనాదికాలగత భారతీయ వై
ప్రవాహము భారతావని నాక్రమించి పునీత మొనర్చుచ
'స యథార్ద్రైధాగ్నేరభ్యాహితాత్ పృథగ్ధూమా విని
ఏవం వా అరేఽస్య మహతో భూతస్య నిఃశ్వసి
ద్యదృగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వాంగిరస' (2
తడి కర్రలను వెలిగింపగ నందుండి ధూమ మేతెం
ఆ మహద్భూతముయొక్క నిశ్వాసనములవలె బ
స్సామాథర్వణ వేదము లుద్భవించినవని బృహదా
వాక్యముచందము ఆ పరమేశ్వరునినుండి జనించి
హేయములని స్వతః ప్రమాణబలమున కీర్తివహించిన
పై నుదాహరింపబడిన భారతీయవిజ్ఞానధారకు ఆ
యొప్పియున్నవి. అందుచే 'వేదశాస్త్రార్థ తత్త్వజ్ఞో
తత్రాశ్రమే వసన్। ఇహైవ లోకే తిష్ఠన్ స
భూయాయ కల్పతే॥' (12.102) వేదశాస్త్రార్థ త
నెరింగినవా డే యాశ్రమమున నున్నను యీ ల
నుండియే మోక్షమును పొందునని వేదతాత్పర్యవిదుడ
నభిమానించుచు మనువు నుతించియున్నాడు.

సాక్షాత్తు పరమేశ్వర నిర్మితమైన 'ఋగ్
విభాగేన వేదాశ్చత్వార ఈరితాః। తేషాం శాఖాహ్యనే
స్తాసూపనిషద స్తదా॥' (1-11) ఋగ్యజుస్సామాథర్వ
మున వేదము చతుర్విధము. అందు అనేక శాఖలు

అదేవిధముగా ఆశాఖలందు ఉపనిషత్తులుగూడ గలవని తెలుపుచు'ఋగ్వేదస్య తు శాఖాస్స్యు రేకవింశతి సంఖ్యకాః। నవాధికశతం శాఖా యజుషో మారుతాత్మజ॥ సహస్ర సంఖ్యయా జాతా శ్శాఖా స్సామ్నః పరంతప । అధర్వాణస్య శాఖాస్స్యుః పంచాశద్భేదతో హరే।' (1.12.13) ఋగ్వేదమునకు నిరువదియొక్క శాఖలు గలవు యజుర్వేదమునకు నూటతొమ్మది శాఖలున్నవి. సామవేదమునకు వేయి సంఖ్యగ శాఖలు విరాజిల్లును. అధర్వవేదమునకు ఏబది శాఖలుగలవు అను ముక్తికోపనిషద్వాక్యము రీతిగ నీ వేదరాశి బహుళమైయుండుటయు నందు తాత్త్విక విచారణా విషయములు అందందు చెల్లాచెదురుగా నుండుటయు దిలకించి నాయా విషయముల సేకరించి వానికొక రూపమునుఏర్పరచి జిజ్ఞాసువులకు బ్రసాదించుటలో గొందరు మహర్షి పుంగవులు సిద్ధహస్తులై ప్రకాశించియుండిరి. ఆఋషిప్రోక్తతత్త్వవిచారణా శాస్త్రములు 'దృశ్యతే తత్త్వం అనేనేతి దర్శనం' అనురీతిగను They all help us to see some aspect of the Truth[13] సత్పదార్థముయొక్క యొక అంశము నవి గోచరింపజేయునని రాధాకృష్ణుని వచనమురీతిగ దర్శనములని వ్యవహరింపబడినవి. ఆ దర్శనశాస్త్రములుగూడ కేవలము ఒక మునీశ్వరు మేధాజనితములుగాక Those Sutras often refer to other philosophers, who, therefore, must have existed before the time when the Sutras received their final form[14]

13. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol. 2 p-18
14. Prof. F. Max Muller: The Six Systems of Indian Philosophy p-83

ఈ సూత్రములు కొందరు తత్త్వవిదుల నామముల సూచించు చుండుటచే, నాతత్త్వజ్ఞులు సూత్రములు పర్యవసానరూపము నొందు కాలమునకు బూర్వమునుండి యుండవలయునని Max Muller మాక్సుముల్లరు వాక్యమురీతి బూర్వకాలిక సంయమీంద్రభావముల ప్రమాణముగ స్వీకరించి యేర్పడియున్నవి. అనగా They are not the work of one thinker or of one age but a succession of thinkers spread over a number of generations[15] అవి ఒక కర్తకును ఒక తరమునకును జెందక, అనేక తరములకు బ్రసరించియుండిన, తత్త్వజ్ఞపరంపరానిర్మితమై యున్నవని గ్రహింపనగును.

---

## దర్శనములు – పూర్వమీమాంస

ఆవిధముగ నేర్పడిన దర్శనగ్రంథములు న్యాయ వైశేషిక సాంఖ్య యోగ మీమాంసా వేదాంతములై గౌతమ కణాద కపిల పతంజలి జైమిని వ్యాసాఖ్య మహర్షిషట్కము క్రమమున కర్తలనుగా నలంకరించుకొని ప్రతిభాయుత తత్త్వప్రవాహమై ప్రపంచము నావరించెను. అందు Nyaya and Vaiseshika lay stress on the practical side, Sankhya and Yoga emphasize the mental aspect, while the Mimamsa systems stress the spiritual aspect.[16]

---

15. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol. 2 p-22
16. Jeva Sevaka Pratistha Tyagi Mahatma: The True Vedanta

న్యాయవైశేషికములు ప్రాకృతిక విషయమును, సాంఖ్య యోగములు మానసిక తత్త్వమును, మీమాంసాద్వయము ఆధ్యాత్మిక విషయములను వివరించుచున్నవి. పై షడ్దర్శనములలో[6] 'మీమాంసకాః ప్రాధాన్యేన శబ్దప్రమాణ శరణా ఏవ' (జై. సూ. 1.1.4-5) మీమాంసికులు ముఖ్యముగా శబ్దప్రమాణ శరణ్యులే. The Mimamsa and the Vedanta may be regarded as the direct continuation of the Vedic culture [17] మీమాంసా వేదాంతములు వేదసంస్కృతికి సాక్షాత్తు ఆధేయములుగ చెప్పదగునని సతీశచంద్రఛటర్జీ మహాశయుడును వచించెను. మరల నీ మీమాంసాద్వయమున మీమాంసాశాస్త్రము 'కర్మణా చిత్తశుద్ధిః ...... ......... అనురీతి వేదమునందల కర్మభాగమునకు ప్రాతినిధ్యము వహించుచున్నది. The Vedic tradition had two sides, ritualistic and speculative. The Mimamsa emphasized the ritualistic aspect and raised a philosophy to justify and help the continuation of the Vedic rites and rituals [17] వేదసంప్రదాయము కర్మజ్ఞానరూపమున ద్వివిధము. మీమాంసము కర్మభాగమునకు ప్రాధాన్యతనొసంగి, వైదిక యజ్ఞయాగాది కర్మకాండ ననుష్ఠించుటకు సహాయభూతమైన యొక్క తత్త్వశాస్త్రమును నిర్మించెనను సతీశచంద్రఛటర్జీయొక్క అభిప్రాయము సముచితము. Performers of Vedic rites found themselves the need

17. Prof. Satish Chandra Chatergee:
An Introduction to Indian philosophy p-7

of rules of interpretation, Nyayas, to guide them through the maze of texts— The Sutras of the school essentially aims at laying down principles regarding interpretation of texts in their connection with carrying out the sacrificial ritual; man's duty is the performance of sacrifice in due manner and the Veda is the one authority [18] వైదిక కర్మానుష్ఠానపరులకు వివిధ గ్రంథములుగాగల కర్మ భాగమున న్యాయములనబరగు నియమావళి యవసరనుయ్యెను. యాజ్ఞికకర్మ నిర్వహణమున నియమముల నిర్ణయించుటలో ముఖ్యముగ నీశాస్త్రమున సూత్రము లుద్దేశింపబడియున్నవి. విధ్యుక్తముగ యజ్ఞాదుల నిర్వర్తించుటయే మానవకర్తవ్యము, దానికి వేదమొక్కటియే ప్రమాణము అని A. B. Keith ఎ. బి. కీత్ వివరణము గావించి మీమాంసా తాత్పర్యమును వ్యక్తపరచెను. అందుచే మీమాంసాశాస్త్రము కర్మకాండకు ద్వివిధముగా ఆధారమయ్యెను. (a) by giving a methodlogy of interpretation with the help of which the complicated Vedic injunctions, regarding rituals may be understood, harmonized, and followed without difficulty (b) by supplying a philosophical justification of the beliefs on which ritualism depends [19] క్లిష్టముగు వైదిక కర్మకాండవిధులు, గ్రాహ్యమై, సమన్వయమై, శ్రమలేక ననుష్ఠించుటకు సహకారమగు నిర్వచనావిధానమును ఒసంగుటయు, కర్మ

18. Dr. A. B. Keith: A History of Sanskrit Literature p-472
19. Prof. Satish Chandra Chatergee:
An Introduction to Indian Philosophy

నిరతి యాధారపడుచున్న విశ్వాసములకు తాత్త్వికబలము చేకూర్చుటయును మీమాంసాదర్శనము చేయుచున్నది. కావున We cannot expect much real philosophy from Jaimini's Purva Mimamsa[20] జైమినీయ పూర్వమీమాంసా దర్శనమున మనకు తత్త్వవిజ్ఞానము ఎక్కువ లభించదని Max Muller మహాశయులు అనుకొని ఈ దర్శనము తాత్త్విక ప్రాముఖ్యతను గణింపకున్నను, The avowed aim of the Purva Mimamsa is to examine the nature of Dharma. It's interest is more practical than speculative. [20] ధర్మతత్త్వ విచారణమే పూర్వమీమాంసాశాస్త్ర నిర్ణీతోద్దేశ్యము. విచారణాపరముగాక అనుష్ఠానపరముగ నధికముగ దాని యుద్దేశ్యము గలదు. ఆ కారణముననే శ్రీ రాధాకృష్ణు డనునట్లు, It's importance for the Hindu religion is great. The scriptures which govern the daily life of the Hindu require to be interpreted in accordance with the Mimamsa rules. Modern Hindu code is considerably influenced by the Mimamsa System.[21] హిందూమతమున దాని ప్రాధాన్యత అత్యధికము. హైందవుని నిత్యజీవిత విధానమును నియమించు శాస్త్రములు మీమాంసాశాస్త్రము ననుసరించి నిర్వచింపబడవలసి యుండును. ప్రస్తుతపు హిందూధర్మశాస్త్రముగూడ మీమాంసాశాస్త్రము నాధారముగా గొనియున్నదని రాధాకృష్ణుడు వక్కాణించెను.



20. Prof. F. Max Muller: The Six Systems of Indian Philosophy p-107

21. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol. 2 p-375

## మీమాంసా దర్శనకర్త

ఇట్లు భారతీయ సంస్కృతి కాధారమైన వేదమున అధిక భాగమును నిర్వచించు యీ మీమాంసా మహాశాస్త్రమునకు కర్త ఎవరో ఆతని జీవితాంశములెవ్వియో నెరుంగ యత్నించెదముగాక.

'అనంతరం చ వక్త్రేభ్యో వేదా స్తస్య వినిస్సృతాః। మీమాంసా న్యాయ విద్యా చ ప్రమాణాష్టకం సంయుతా॥' (3.2) అను మత్స్య పురాణప్రోక్తము రీతి ప్రమాణాష్టక శోభిత న్యాయవిద్యయు మీమాంసాశాస్త్రము వేదము చతుర్ముఖుని వక్త్రములనుండి వెలువడెనుగాన నీ శాస్త్రము మానవకృతముగాక ఈశ్వర కృతమనియే తేలుచున్నది. కాని మీమాంసాశాస్త్రమునకు ఈశ్వర కర్తృత్వము సముచితమైయున్నను, మనకు ప్రస్తుతము లభించు దర్శనమునకు 'కణాదేన తు యత్ప్రోక్తం శాస్త్రంవై శేషికం మహత్।గౌతమేన తథా న్యాయం సాంఖ్యంతు కపిలేన తు॥ద్విజన్మనా జైమినినా పూర్వం' అను పద్మపురాణవాక్యము దర్శనముల వాని కర్తల ప్రస్తావించుచు జైమినిమహర్షిని గూడ నైదవదర్శన కర్తగా సూచించియున్నది. అటులే 'యది జైమినేఃశ్లథయతి' (5.21) అని పతంజలి చరిత్రగూడ జైమినియే మీమాంసా కర్తగా దృఢపరచుచున్నది. కాని Who Jaimini was we cannot say. A Jaimini is credited with authorship of a Srauta Sutra and a Gribya Sutra and the name occurs in texts of doubtful authenticity in the Aswalayana and

Sankhyayana Grihya Sutra. A Jaimini Samhita and a Jaimini Brahmana of the Sama Veda are extent. As one authority on Philosophy Jaimini appears in the Vedanta Sutra and in often in later works; but it is significant that, while it is possible that the Mahabharata recognizes the existence of the Mimamsa, it does not refer to Jaimini as a philosopher, but merely as an ancient sage [22] జైమిని ఎవరో మనము తెలుపజాలము. శ్రౌతసూత్ర గృహ్యసూత్రముల కర్తగానొక జైమినియు, సంశయ ప్రామాణికమై యున్న ఆశ్వలాయన, సాంఖ్యాయన గృహ్యసూత్ర గ్రంథముల జైమిని నామము వినంబడుచున్నది. సామవేదీయ జైమిని సంహితయు జైమిని బ్రాహ్మణమును గానంబడుచున్నవి. వేదాంత సూత్రములందును తర్వాత కృతులందును, తత్త్వజ్ఞానమున ప్రామాణికుడు జైమిని గోచరించుచున్నాడు. కాని, మహాభారతము మీమాంసా శాస్త్రమును గుర్తించుచు, జైమినిని ప్రాచీన మహర్షిగా సూచించెనేగాని తత్త్వజ్ఞాన విదునిగా పలుకకుండుట కడుంగడు గమనార్హము అని కర్మమీమాంసా గ్రంథమున A. B. Keith ఏ. బి. కీత్ జైమిని వ్యక్తినిర్ణయమునగల క్లిష్టత్వమును వ్యక్తపరచెను. ఇంతియగాక There is also the Sankarshana Kanda consisting of four chapters, composed by Jaimini, and this which is known by the name of Devata Kanda, belongs to the Karma Mimamsa because

22 Dr. A, B. Keith: Karma Mimamsa p-4.

it teaches the act called Upasana or worship.[23] జైమినీ కృతమగు నాలుగధ్యాయముల సంకర్షణకాండమను గ్రంథముకూడ గలదు. దేవతాకాండమనియు తెలియబడు నీ గ్రంథము, ఉపాసనావిధానమును బోధించునుగాన కర్మ మీమాంసకే చెందియున్నది అని Max Muller మాక్సు ముల్లరు వ్రాసెను. జైమినీయభావములు ప్రాచీనకాలపు కొన్ని గ్రంథములలో గోచరమని తెలుపుచు The influence of this discipline can plainly be discerned in the existing texts; the works of Aswalayana, Sankhyayana, Apastamba, Hiranya Kesa, Latsayana and Dravyayana have been composed under its influence.[24] ఆశ్వలాయన, సాంఖ్యాయన, ఆపస్తంభ, హిరణ్యకేశ, లాత్యాయన, ద్రవ్యాయనుల గ్రంథములు దీని ఛాయలనే రచితములైనవి. కాన వానిలో యీశాస్త్రభావములు స్పష్టముగ గోచరించు నని A. B. Keith ఎ బి. కీత్ వక్కాణించెను. కాని జైమిని వ్యక్తిత్వనిర్ణయమునగాని అతని కాలనిర్ణయమునగాని అవి కొంతయు సహకారులు కానేరవు. అటులనే మనుస్మృతికి ప్రస్తుతము లభించు భాష్యములలో ప్రథమమైన మేధాతిథి వ్యాఖ్యానమున మీమాంసాతత్త్వము సువ్యక్తమగుటచే మేధాతిథికాలమునకే మీమాంసాశాస్త్రము వ్యవహార మునుండుట విదితము గాని, మేధాతిథి యొక్క date is most

23. Prof. F. Max Muller : The Six Systems of Indian Philosophy p-78
24. Dr. A. B. Keith : Karma Mimamsa p-3

probably to be placed in the ninth or tenth centuries A. D. [25] కాలము క్రీ. శ. తొమ్మిది పది శతాబ్దములకు సుమారుగా నుండుటచే దానిననుసరించియు జైమిని కాల నిర్ణయము గావింపజాలము అని Keith కీత్ తెలుపును.

## బాదరాయణ - జైమిని

కాని మీమాంసాశాస్త్రద్వయమున ద్వితీయమగు వేదాంతదర్శనమనబడు ఉత్తరమీమాంసాకారుడైన బాదరాయణుడు 'సాక్షాదప్య విరోధం జైమినిః' (బ్ర. సూ. 1.2 28) 'సంపత్తేరితి జైమినిః, తథా హి దర్శయతి' (1.2.31) 'అన్యార్థం తు జైమినిః ప్రశ్న వ్యాఖ్యానాభ్యా మపి చైవమేకే' (1 4 18) 'ధర్మం జైమినిః, అతఏవ' (3 2.40) 'శేషత్వాత్పురుషార్థవాదో యథాఽన్యేష్వితి జైమినిః' (3.4 2) 'పరామర్శం జైమినిరచోదనా చ, అపవదతి హి' (3.4.18) 'తద్భూతస్య తు నాతద్భావః; జైమినేరపి, నియమాతద్రూపాభావేభ్యః' (3.4.40) 'పరం జైమినిః, ముఖ్యత్వాత్' (4.3.12) 'బ్రాహ్మేణ జైమినిః, ఉపన్యాసాదిభ్యః.' (4.4.5) 'భావం జైమినిః, వికల్పామననాత్' (4.4.11) మొదలగు సూత్రముల జైమిన్యాచార్యుని వేదాంతతత్త్వ విచారణంబునగూడ ప్రామా

25. Dr. A. B. Keith: Karma Mimamsa p-10

ణిక పురుషునిగా స్వీకరించి తన వేదాంతదర్శనమున గైకొని యుండుటచే వేదాంతదర్శన నిర్మాణకాలమును, లేక తత్కర్తయగు బాదరాయణ కాలమునకును జైమిన్యాచార్యుని కాలమునకు కొంచెము సంబంధముండునట్లు అగుపడును. అనగా ప్రాచీనత్వముగలదని తోచును. కాని జైమిన్యాచార్యులును తన మీమాంసా దర్శనమున బాదరాయణ నామమును 'ఔత్పత్తికస్తు శబ్దస్యార్థేన సంబంధః, తస్య జ్ఞానముపదేశః అవ్యతిరేకశ్చార్థేఽనుపలబ్ధే తత్ప్రమాణం బాదరాయణస్యానపేక్షత్వాత్' (పూ. మీ. 1.1.5) 'అంతే తు బాదరాయణః తేషాం ప్రధాన శబ్దత్వాత్' (5.2.19) 'జాతిం తు బాదరాయణః అవిశేషాత్ --' (6.1.8) 'విధిం తు బాదరాయణః' (10.8.43) 'విధివత్ప్రకరణ విభాగే ప్రయోగం బాదరాయణః' (11.1.64) అను అయిదు సూత్రములలో బాదరాయణుని నామము స్మరించియుండుటచే సమస్య క్లిష్టతరమై యొప్పారినది. బాదరాయణునకు జైమినియే పూర్వమగుచో తనసూత్రముల నాతడు బాదరాయణు నెట్లు సూచించుకొనును అను సందేహము పొడకట్టక మానదు. అందుచే పండితుల చిత్తములు యీ సమస్యనుండి తరించుటకై అనేక యూహాగానములకు అవకాశ మిచ్చినది. ఇట్లు ఒకరి నొకరు సంస్మరించుకొని యుండుటచే ఉత్తర పూర్వమీమాంసలు రెండును ఒకే కాలమున రచితములై యుండుననియు[26] అందుచేతనే జైమిని

26. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol 2, p 2 5

మహర్షికి బ్రహ్మసూత్రగ్రంథ పరిచయమున 3.3.53 సూత్రభావముల తన సూత్రగ్రంథమున 11.1.64 సూత్రమున స్వీకరించెననియు రాధాకృష్ణపండితుని అభిప్రాయము.[26] ఈ విషయమునే చర్చించుచు, జైమిని బాదరాయణాచార్యుల నామములు రెండుదర్శనముల గోచరించుటచే ఆదర్శన ద్వయము ఒకేకాలమున రచితములని తీర్మానింప నవకాశమున్నదు, But this conclusion is by no means assured.[27] ఈ నిర్ణయము సుస్థిరముకాదు. ఎందుచేతనన We have no valid reason for assuming that the Sutras were actually redacted by Jaimini and Badarayana themselves, and unless this is established, the argument for contemporaniety is invalid[27] ఒక దర్శనసూత్రభావముల ద్వితీయుడు తనసూత్రముల చేర్చుటలో సాక్షాత్తు జైమిని బాదరాయణులే గావించియున్నట్లు నిశ్చయింపబడునంత వరకు వాని ఏకకాలికత్వము అనిశ్చయమేయగును. అంతియుగాక It is true that it is impossible to deduce from the style of the Mimamsa as Purva Mimamsa, a relation of temporal priority for Jaiminis work; the Mimamsa is prior to Vedanta because it deals with the sacred rites, the knowledge of which, in the view of one school of Vedanta, is an indispensible preliminary to the knowledge of the absolute, though Sankara declines to accept this view[27]

26. Prof. S. Radhakrishnan; Indian Philosophy Vol, 2 p-375

27. Dr. A, B. Keith: Karma Mimamsa p-5

పూర్వమీమాంసా గ్రంథశైల ననుసరించిచూచుచో జైమినీయము వేదాంతమునకు పూర్వకాలిక మగుచున్నది. ఒకే వేదాంతశాఖభావము ననుసరించి బ్రహ్మజ్ఞానమునకు పూర్వము అత్యవసరమగు, కర్మకాండను యిది ఉపదేశించుచున్నది. దానిఅవసరమును శ్రీశంకరులుమాత్ర మంగీకరింపరు. None the less it remains true that we must assume that the Mimamsa as a science developed before the Vedanta[27] అయినను వేదాంతమునకు పూర్వమే అభివృద్ధిగాంచిన శాస్త్రముగా మీమాంసాశాస్త్రమును గ్రహింపక తప్పదని Thibaut తిబూట్ యొక్క అభిప్రాయము. ఇట్లు మీమాంసా ద్వయముయొక్క పరస్పరాకాంక్ష చాలవరకు అసంభవమై సమకాలికత్వమునకుగూడ అంతరాయ మేర్పడుచుండినను, The probability surely lies in favour of the view that the Mimamsa Sutra was redacted first and served as a model for other schools. Even if this view is accepted, it remains difficult to assign any definite date to the Sutra.[27] ప్రథమతః మీమాంసా సూత్రము గ్రహింపబడుచు, యితర సిద్ధాంతవాదులకు ఆదర్శముగ నుండెననుట సమంజసము. అయినను సూత్రకాలమును నిర్ణయించుట కష్టముగనే యున్నదని Keith కీత్ మహాశయుడు భావించెను. మరియు Badarayana refers to Jaimini as an authority on Vedanta in ten different Sutras...Since nine of these cannot be traced to Mimamsa Sutras,

27. Dr. A. B. Keith; Karma Mimamsa p-5
28. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol. 2 p-375

it is sometimes urged that the Jaimini referred to in the Badarayana Sutras is different from the author of the Mimamsa Sutras. Others hold that some of Jaimini's works are lost [28] వేదాంతమునకు ప్రమాణముగా బాదరాయణుడు జైమిన్యాచార్యుని పదిసూత్రములలో గైకొనెను. కాని అందు తొమ్మిదిమాత్రము మీమాంసయందు గోచరింపకుండుటచే, బాదరాయణసూత్రముల సూచితమైన జైమిని, మీమాంసాకర్తకు అన్యుడైయుండునని కొందరి అభిప్రాయము. జైమినిరచిత గ్రంథములుకొన్ని నశించియున్నవనియు వానినుండి బాదరాయణుడు గైకొనియుండుననియు కొందరు భావించినట్లు రాధాకృష్ణపండితుడు వాకొనును Uttara Mimamsa must have been constituted contemporaneously with that attributed to Jaimini because the two authors refer to each other [29] ఆ గ్రంథకర్తలు ఒకరినొకరు స్మరించియుండుటచే ఉత్తరమీమాంసాదర్శనము జైమినీయదర్శనమునకు సమకాలికమని Macdonell మాక్డొనెల్ కూడ భావించెను.

---

## బాదరాయణ వేదాంత-జైమినీ మీమాంస

ఈ సమస్య పై తెరంగున అనిర్ణీతమైయుండ యీ జైమినీ బాదరాయణులు మరియొక్క సమస్యను కల్పించిరి.

---

28. Prof. S. Radhakrishnan : Indian Philosophy Vol. 2 p-375
29. Dr. A. A. Macdonell : India's Past

బాదరాయణుడు తన సూత్రములలో 'తదుపర్యపి బాదరాయణః సంభవాత్' (1.3 26) 'భావం తు బాదరాయణః, అస్తి హి' (1.3.33) 'పూర్వం తు బాదరాయణః, హేతు వ్యపదేశాత్' (3.2.41) 'పురుషార్థతః, శబ్దాదతి బాదరాయణః' (3.4.1) 'అధికారోపదేశాత్తు బాదరాయణస్యైలిం, తద్దర్శనాత్' (3.4.8) 'అనుష్ఠేయం బాదరాయణః, సామ్య శ్రుతేః' (3.4.19) 'అప్రతీకాలంబనాన్నయతీతి బాదరాయణః ఉభయథాఽదోషాత్, తత్ క్రతుశ్చ' (4.3.15) 'ఏవమప్యుపన్యాసాత్ పూర్వభావాదవిరోధంబాదరాయణః' (4.4.7) 'ద్వాదశాహవదుభయవిధం బాదరాయణోఽతః' (4.4.12) అను ప్రదేశముల తన నామమునే స్వతఃప్రమాణముగా సూచించుకొనుచుండ నదేవిధముగా జైమిన్యాచార్యుడును తన పూర్వమీమాంసా దర్శనమున 'కర్మభేదం తు జైమినిః ప్రయోగవచనైకత్వాత్ సర్వేషాముపదేశః స్యాత్' (6.3.4) 'తదావృత్తం తు జైమినిరన్నామ ప్రత్యక్ష సంఖ్యత్వాత్' (8.3.7) 'అధికం చ వివర్ణం చ జైమినిః స్తోభశబ్దత్వాత్' (9.2.39) 'జైమినేః పరతంత్రాపత్తేః స్వతంత్రప్రతిషేధః స్యాత్' (12.1.7) మొదలగు సూత్రముల తన స్వతఃప్రామాణ్యసిద్ధత్వమును నిరూపించుకొనెను. కాని అట్లు తమకుతామే తమను ప్రమాణముగా గైకొనుట సాధారణము కాకుండుటచే The fact that the name of the latter is mentioned in several places in the

third person, inclines one to think that Badarayana is not its author [30] కర్తయొక్క నామము అనేకస్థలముల ప్రథమపురుషవాచకమున సూచితమైయుండుటచే దాని రచయిత బాదరాయణుడు కాదని భావింప నవకాశము గలదు. Such a use of the third person is not, however, an uncommon practice in ancient India, and it need not imply a different authorship [30] అయినను ప్రాచీన భారతవర్షమున ప్రథమపురుషప్రయోగము అసామాన్యము కాదుకావున అన్యకర్తృత్వప్రతిపాదనము అవసరము లేదని రాధాకృష్ణుడు వాదించెను.



## పూర్వ ఉత్తర మీమాంసలు

అదియునుగాక మరొకవిధముగా సమస్యల సమన్వయింప వీలగునని కొందరు యత్నించిరి. ఎట్లన The Sutras themselves were redacted at a time when the schools had been in contact, and for that reason we have no real chance of determining their dates even relatively, for it serves as if those of the Purva Mimamsa the Vedanta, the Nyaya Vaiseshika cannot have been composed as they stand at any very great distance of time from one another[31] ఆ యా సిద్ధాంతసంఘములు ఒండొరుల సంస్పర్శ మేర్పడినప్పుడు అన్యోన్యాపేక్షికములై

30. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol. 2 p-432
31. Dr. A. B. Keith: A History of Sanskrit Literature p-472

యుండుననియు, అందుచే వాని రచనకాలమును నిర్ణయింప సరియైన అవకాశము మృగ్యమనియు, ఎందుచేతనన, పూర్వమీమాంస వేదాంతములు, న్యాయ వైశేషికములు తమ కర్తలనుండి మిగుల దూరసముగ నుండుటచేననియు, A. B. Keith ఎ. బి. కీత్ వాగొనెను. అనగా దర్శనరూపములు కర్తలచేగాక వారి అనుచరబృందముచే సంపూర్ణరూపమును గాంచినవని నిశ్చయించినచో కర్తల దర్శన కాలముగూడ యథాపూర్వముగా క్లిష్టముగనే యున్నది. కాని పరస్పరాపేక్షికత్వమును కొంతవరకు యీసిద్ధాంతము సమన్వయమొనరింప యత్నించును.

అట్లుగూడగాక From the first the Purva Mimamsa and the Vedanta or Uttara Mimamsa were one school, and that it was only later through Kumarila and Sankara that they were differentiated[31] ప్రథమమున పూర్వమీమాంసయును, వేదాంతము నాబడు ఉత్తర మీమాంసయును ఒక సిద్ధాంతమే యనియు, కాలక్రమమున కుమారిల శంకరులవలన నవి విభజింపబడినవనియు Jacobi జకోబి వాదించెను. అటులే యగుచో This, of course, would give the Purva Mimamsa a very different aspect, as merely a part of a philosophy, not the whole, but the contention seems dubious, and the syncretism of the systems seems rather to be due to the commentators[31] పూర్వ మీమాంసాశాస్త్రము ఒక తత్త్వశాస్త్రమునకు భాగమై,

31. Dr. A. B. Keith : A History of Sanskrit Literature p-472

సమగ్ర సిద్ధాంతము గాకపోవును. ఈవాదము అసంబద్ధము. భాష్యకర్తలవలననే యీ రెండుదర్శనముల సమ్మేళనము ఏర్పడి యుండవచ్చునని A. B. Keith ఎ. బి. కీత్ సమాధానమొసంగియున్నాడు. అనగా పూర్వ మీమాంసా శాస్త్రము షడ్దర్శనములలో ప్రత్యేకదర్శనస్థానమున లేకుండ యుండవలయును. కాని షడ్దర్శనవ్యవహారము చిరకాలము నుండి సుప్రశస్తము. ఈవిషయమున వ్యాఖ్యాతలుగూడ భిన్నభావముల వ్యక్తపరచియున్నారు. వృత్తికారుని అనుసరించుచు, శ్రీరామానుజాచార్యులు మీమాంసా ద్వయము ఒక్కటేయని భావింప, శ్రీశంకరాచార్యులు దాని ఖండించిరి. అయినను It may be that the two originally formed parts of the same treatise. The two Mimamsas are pre-eminently exegeses of the Sruti or Veda [32] అవిరెండును ప్రథమమున నొకేశాస్త్రముగ నుండియుండు ననియు రెండును ప్రధానముగ శ్రుతి నాబడు వేదముపై నాధారపడియున్నవనియు రాధాకృష్ణాభిప్రాయము.

ఆ విధానముగ గూడకాక They may have been combined by a later editor into one work, and provided with the cross references. This combined work was commented upon by Upavarsha on whose work the commentaries of Sabara on the Purva Mimamsa, and Sankara on the Uttara Mimamsa rest [33] దర్శనరచనా

32. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol. 2 p-433
33. Swami Veereswarananda: Brahma Sutras Introduction p-7

నంతరకాలమున ఒక సంపాదకుడు వాని నేకమొనర్చి, పర స్పరాపేక్షిక ప్రమాణముల కల్పించి యుంచనగుననియు, ఆ సమష్టిగ్రంథమునకు ఉపవర్షాచార్యుడు వృత్తిని లిఖింప, దాని పూర్వమీమాంసాభాగమునకు శ్రీశబరస్వామియు, ఉత్తరమీమాంసాభాగమునకు శ్రీశంకరాచార్యులును భాష్య ముల నిర్మించిరని Prof. Duessen దేవసేన్ ఆచార్యుడు సమన్వయించెను. శ్రీశంకరులు 'ఏక ఆత్మనశ్శరీరే భావాత్' (3.3.53) అను వేదాంతసూత్రభాష్యమున 'ఇత ఏవా కృష్యాచార్యేణ శబరస్వామినా ప్రమాణలక్షణే వర్ణితం, అత ఏవ చ భగవతోపవర్షేణ ప్రథమే తంత్రే ఆత్మాస్తిత్వా భిదానప్రసక్తౌ శారీరకే వక్ష్యామీ ఇత్యుద్ధారః కృతః' ఆచార్యుడగు శబరస్వామిచే నిటనుండియే యాకర్షించి ప్రమాణలక్షణమున ఆత్మాస్తిత్వము చెప్పబడియె. అట నాత్మాస్తిత్వమును బ్రతిపాదించు సూత్రము లేదుగావుననే పూజ్యుడగు నుపవర్షాచార్యుడు ప్రథమతంత్రమున నాత్మా స్తిత్వమును వచించుట ప్రసక్తించెను గాన శారీరకమునందు గూడ వచించెదమని విరమించెను. అనగా ఆత్మవిషయ ప్రసంగము ప్రథమతంత్రము నాబరగు పూర్వమీమాంస యందు ప్రస్థాపితము గాదాయన శబర ఉపవర్షాచార్యులుగూడ యీసూత్రమునే ఆధారముగగొని ఆత్మనిర్వచన గావించిరని శ్రీశంకరులు సమాధానమొసంగెను. అందుచే మీమాంసా ద్వయము ఒకేగ్రంథముగానుండి ప్రథమ ద్వితీయభాగము లుగా యుండి యుండుననియు కాలగతముగా రెండుగా చీలి

యుండుననియు తాత్పర్య మీభాష్యవచనమున స్ఫురించు చున్నదనియు పండితాభిప్రాయము.[33]



## బాదరాయణుడు – వ్యాసుడు

అందుచే This combined work might have been arranged by Vyasa, the author of Mahabharata. Or it may be that he had written them himself according to the views that were traditionally handed down as Badarayana's. This latter view easily accounts for the references to Badarayana by name in the Sutras [33] యీసమష్టి గ్రంథమును మహాభారతకర్తయగు వ్యాసుడు నిర్మించియుండ వచ్చును. లేక, సాంప్రదాయికముగ నరుదెంచు బాదరాయణభావముల నాతడు తానే గ్రంథముగా ఉల్లేఖించియుండ వచ్చును. సూత్రములలో బాదరాయణ నామసంస్మరణ మును యీసిద్ధాంతము సులభముగాననయించునని వీరేశ్వరానందస్వామి తన బ్రహ్మసూత్రపీఠికలో వ్యక్తపరచెను. If Badarayana and Vedavyasa are not one and the same person as tradition holds, the latter must have had in the present recension of the Sutras, though it is very difficult to say to what extent, whether it was by way of merely revising the original Sutras of Badarayana or writing them down *in toto* after the teachings of Badarayana [34] సాంప్రదాయికభావమునకువిరుద్ధముగ బాద

33. Swami Veereswarananda: Brahma Sutras Introduction p-7
4. Swami Veereswarananda: Brahma Sutras Introduction p-6

రాయణ వేదవ్యాసులు ఒకేవ్యక్తి కాకున్నచో, వేదవ్యాసునకు ప్రస్తుత సూత్రగ్రంథమున సంబంధ ముండియుండవచ్చును. బాదరాయణుని స్వంతసూత్రముల పునఃపరిశీలనయో లేక బాదరాయణభావముల సంపూర్తిగా లిఖించుటయో వచించుట కష్టమనియు అతని భావము. యథార్థమున సూత్రకారుడైన బాదరాయణునిగూర్చి ఏమియు తెలియరాదు. కాని మహాభారత, భగవద్గీతాకర్తయైన వ్యాసుడే బాదరాయణుడని సాంప్రదాయికవచనము. 'బ్రహ్మసూత్రకృతే తస్మై వ్యాసాయాపరవేధసే। జ్ఞానశక్త్యావతారాయ నమో భగవతో హరేః॥' (భామతి) హరియొక్క జ్ఞానశక్త్యావతారుడును, అపర సృష్టికర్తయు, బ్రహ్మసూత్రకర్తయునగు వ్యాసునకు నమస్కారమని వాచస్పతులు ప్రార్థింప, 'సర్వజ్ఞో బాదరాయణో బ్రహ్మజిజ్ఞాసాం' (బ్ర. భా. 1.1.1) అని గోవిందానందులును బ్రహ్మసూత్రకర్తృత్వమున అభిన్నత్వమునే గావించియుండిరి. అటులే ఆనందగిరియును భావించెను. కాని రామానుజ, మధ్వ, వల్లభ, బలదేవాది ఆచార్యులు వ్యాసునే సూత్రకర్తగా గావించిరి. కాని శ్రీ శంకరులవారుమాత్రము, Sankara, however, in his commentaries refers to Vyasa as the author of the Mahabharata and the author of the Sutras he refers to as Badarayana. Perhaps to him these two personalities were different [35] తన భాష్యగ్రంథముల

---

35. Swami Veereswarananda: Brahma Sutras Introduction p-6

మహాభారతరచయిత వ్యాసుడుగను, సూత్రకారుడు బాదరాయణుడుగను సూచించెను. బహుశః యీయిరువురు వేరు అని వారిభావమై యుండునని వీరేశ్వరానందులు ఉద్దేశించిరి. 'శిష్టైర్మనువ్యాసప్రభృతిభిః' (బ్ర. భా. 2.1.12) శిష్టులగు మనువు వ్యాసుడు మొదలగువారిచే అనియు 'స్మరంతి వ్యాసాదయః' (బ్ర భా. 2.3.47) వ్యాసాదులు స్మరించిరి అని భాష్యమున శ్రీశంకరులు వ్యాసుడు సూత్రకర్తకాదగు విధంబును లిఖించియుండిరి.

---

## వ్యాసుడు

మరల నీ వ్యాసులన్నో పలువురు గ్రంథముల గానవచ్చెడిని. అందు ఏ వేదవ్యాసుండు సూత్రరచనము గావించెనో తెలియుట దుర్లభము.

---

## వ్యాసుడు - జైమిని

మీమాంసాద్వయరచన విధానముననేగాక, వ్యాసజైమినులకు గురుశిష్యసంబంధముగూడ నున్నటుల మహాభారతము రూపించుచున్నది. (మహాభారత శాంతి, 5) శుకయోగీంద్రుడు వ్యాసదర్శనార్థమై హిమగిరి కేతెంచెను. అట్టి మహామహిమగల నా హిమవంతంబునకు మున్నే వచ్చి

సుమంత వైశంపాయన, జైమిని పైల నామధేయులగు శిష్యులం గరుణావిధేయుండును సాత్యవతేయుండు అధ్యయనంబు సేయుచుండ శుకుండు గాంచినట్లు గలదు. ఈ విషయమే 'పైలాదిభిర్వ్యాసశిష్యైర్వేదాచార్యైర్మహాత్మభిః। వేదాశ్చ కథితా వ్యస్తా ఏతత్సౌమ్యాభిధీయతామ్॥' (శ్రీమద్భాగవత 12.6.36) 'సామ్నాం జైమినయే ప్రాహ' (శ్రీమద్భాగవత 12.6.53) 'ధారుణి పారాశర్యుని కార్యులు పైలుడు సుమంత జైమిని మునులున్।ధీరుడు వైశంపాయను డారయ నలువురును శిష్యులై యుండి, రాగిన్' (ఆంధ్రభాగవతము 12.29) అనిగూడ శ్రీమద్భాగవతము బోధించుచున్నది. అందు 'పైలాయ సంహితా మాద్యాం బహ్వృచాఖ్యా ముువాచ హ।వైశంపాయనసంజ్ఞాయ నిగదాఖ్యం యజుర్గణం॥ సామ్నాం జైమినయే ప్రాహ తథా ఛందోగ సంహితాం। అథర్వాంగిరసంనామ స్వశిష్యాయ సుమంతవే॥' (శ్రీమద్భాగవత 12.6.52,53) పైలుడు ఋగ్వేదమును, జైమిని సామవేదమును, వైశంపాయనుడు యజుర్వేదమును, సుమంతుడు అధర్వవేదమును శ్రీ వేదవ్యాసుడైన సాత్యవతేయునుండి అధ్యయనము గావించిరనియు భాగవతగ్రంథము తెలుపుచున్నది. అగుటచే వేదవ్యాసునకుగల నల్వురు శిష్య ప్రముఖులలో జైమిన్యాచార్యుడుగూడ ఒకశిష్యుడుగా రూపొందింపబడియుండుటయు గానవగును. కాని గురుశిష్యు లిరువురును మీమాంసాద్వయమును వ్రాయుచు, అందు నొకరి నొకరు ప్రమాణముగ గైకొనుటయేగాక, ఒకరివాద

ముల మరొకరు పూర్వపక్షముగావించుటయు గాననగును. వారిరువురు గురుశిష్యులేయై యున్నచో అది అసంభవ మని కొందరివాదము. ఈ విషయమును చర్చించుచు Sometimes this view is contested on the ground that Jaimini, whom Badarayana quotes a number of times, is a pupil of Vyasa, if we believe the Mahabharata, Vishnu Purana and the Bhagavata, and so the cross references in the works of Jaimini and Badarayana are not consistant with the relation of disciple and the master [36] సూత్రకారకత్వమును వ్యాసున కన్వయించుటయందు వివాదముగలదు. మహాభారత, విష్ణుపురాణ, భాగవత ప్రమాణముల మనము విశ్వసించుచో బాదరాయణునిచే అనేక పర్యాయములు ప్రమాణముగ గైకొనబడిన జైమిని వ్యాసునకు శిష్యుడై యుప్పారును. అందుచే జైమిని బాదరాయణుల పరస్పరాపేక్షిక సూత్రరచనము గురుశిష్యసంబంధమునకు వ్యతిరేక మనిపించును. కాని Sabara, Govindananda and Anandagiri hold that there is nothing inconsistent [36] శబర గోవిందానంద ఆనందగిరులకు అది అసందర్భముగ గోచరించలేదు అనియు యీవిషయమున శ్రీశంకరు లెట్టి యభిప్రాయమును గలిగియుండిరో అవిస్పష్టమనియు శ్రీరాధాకృష్ణు డుద్దేశించెను.

---

36. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol. 2 p-432

## జైమిని కాలము

అట్లు వ్యాస జైమినులకు గురుశిష్యసంబంధ మే యథార్థమైయుండు చో, లేక వారు సమకాలికు లైయున్న చో, కొంతవరకు కాలనిర్ణయమున సులభత్వ మేర్పడును. ఇక వ్యాస కాలనిర్ణయము ననుసరించి జైమిని కాలనిర్ణయముగావింప యత్నింపనగును. So far may be said to determine his chronological position as anterior to that of another Vyasa, who was the father of Suka, the teacher of Gaudapada, the teacher of Govinda, the teacher of Sankara and who, if Sankara belonged to the eighth century, might have lived in about 6th century of our era [37] ఆతని కాలనిర్ణయమును నిర్ణయింప నతడు శుక దేవుని తండ్రియగు మరొక వ్యాసునకు పూర్వుడై యుండును శుక దేవుడు గౌడపాదునకును, అతడు గోవిందునకును మరల నతడు క్రీ. త. ఎనిమిదవ శతాబ్దమునకు చెందిన శంకరునకు గురువగుట చే బాదరాయణుడు క్రీ.త. ఆరవశతాబ్దమునకు చెంది యుండునని Max Muller మాక్సుముల్లరు అభిప్రాయపడెను. The investigations of Jacobi resulted in the belief that the Nyaya and Brahma Sutras were composed after the Nihilistic Vadins' idealism, say between 200 A. D. and 450 A. D. While the Purva Mimamsa and Vaiseshika might be a little older [38] న్యాయ బ్రహ్మసూత్రములు

---

37. Prof. F. Max Muller: The Six Systems of Indian Philosophy p-114
38. Dr. A. B. Keith: A History of Sanskrit Literature p-472

శూన్యవిజ్ఞానవాదులకు తర్వాత ఏర్పడినవగుటచే క్రీ. త. 200 నుండి 450 సంవత్సరముల మధ్యలో రచితమైయుండు ననియు, పూర్వమీమాంసా వైశేషికములు మాత్రము వీనికి పూర్వములనియు జకోబి పరిశీలనా ఫలితమువలన తెలియుచున్నట్లు A. B. Keith కీత్ పండితుని భావము. The basic work on the Mimamsa is the Purva Mimamsa Sutra of Jaimini (probably 200 B. C.)[39] మీమాంసా శాస్త్రమునకు ఆధారమగు గ్రంథము జైమిన్యాచార్యకృత మీమాంసాసూత్రమనియు, అది క్రీ. పూ. 200 సంవత్సర మునకు చెందినదనియు మాధవానందస్వామి యభిప్రాయము. We may fairly conclude that at this date, probably not later than the middle of the third century B. C., the Sutras did not exist in the present form, but it is plain that the science itself was in full vogue, and a Mimamsaka appears to have been deemed a necessary member of a Parishad[40] క్రీ. పూ. మూడవశతాబ్దమున ప్రస్తుతరూప మున సూత్రములు లేకున్నను, మీమాంసాశాస్త్రము పూర్తి వ్యవహారమున గలదనియు పరిషత్సభకు మీమాంసా శాస్త్రవిదుడు అత్యవసరముగా భావింపబడుచుండెనని స్పష్టముగా తీర్మానింపనగుననియు A. B. Keith కీత్ మహాశయుడు తెలుపును. మరియు It is then a plausible conclusion that the Mimamsa Sutra does not date after

39. Swami Madhavananda: Mimamsa Paribhasha
40. Dr. A. B. Keith: Karma Mimamsa p-3

దున్న బ్రహ్మసూత్ర శబ్దముచే బ్రస్తుతమందున్న వేదాంత సూత్రములు నిర్దిష్టమైనవని గీతారహస్యమందలి పరిశిష్ట ప్రకరణమున నేను సవిస్తరముగ నిరూపించితిని' (గీతా రహస్యము 13.4) అని స్పష్టపరచియుండిరి. అట్లగుటచే గీతాదులకు వేదాంతసూత్రములు పూర్వమనియు, భగవద్గీతాశాస్త్రము బుద్ధునికి పూర్వమనియు నిర్ధారింప నవకాశ మేర్పడుచున్నది. అందుచే From what has been said above we find that there are strong grounds for believing that Vedanta Sutras must have existed before Buddha[43] వేదాంతసూత్రములు బుద్ధునికి పూర్వమే గలవనుటకు బైచర్చా విషయములు బలిష్టముగు ప్రాతిపదిక నేర్పరుచుచున్నవని వ్యక్తము అని వీరేశ్వరానందుల వాదము. This, if we could rely on it, would prove the existence of the Sutras before the time of Panini or in the 5th century B. C[44] పాణిని సూత్రములగల భిక్షుకసూత్రములే వేదాంతసూత్రములని మనము విశ్వసించుచో, క్రీ. పూ. అయిదవశతాబ్దమునకు జెందిన పాణినికి బూర్వమే సూత్రముగలదని నిరూపితమగుచున్నది. But, if, as we are told, Vyasa collected (వి వ్యాస) not only the Vedas, the Mahabharata, the Puranas, but also the Vyasa Sutras, nay even a prose commentary on Patanjali Yoga Sutra, we can hardly doubt that the work ascribed to him must be taken as the work of several people, or of a literary period rather than of one man[44]

43. Swami Veereswarananda: Brahma Sutras p-11

44. Prof. F. Max Muller: The Six Systems of Indian Philosophy p7-11

కాని, మనకు తెలుపబడినట్లు, వ్యాసుడు వేదముల విన్యాస మొనర్చుటయు, మహాభారతము పురాణముల నుల్లేఖించు టయేగాక, పతంజలి యోగసూత్రములకు వచన వ్యాఖ్యను గూడ రచించెనని యన్నచో, అతని కన్వయించు గార్య మంతయు, నొకవ్యక్తికే యన్వయింపక అనేకవ్యక్తులకు గాని, ఒక వైజ్ఞానిక కాలమునకుగాని అన్వయింప సందే హములేదు అని Max Muller మాక్సుముల్లరు వాదించెను. మిగతా వాదనాభాగ మెట్లున్నను, వేదాంతసూత్రములు పాణినికి పూర్వమని యత డంగీకరించియున్నాడు.

పాణినికి పూర్వమే వేదాంత మీమాంసాసూత్రగ్రంథ ములు గలవనుటకు మరియొక ప్రబల కారణముగలదు. That the Vedanta Sutras and Purva Mimamsa Sutras must have existed before Panini can also be inferred from the commentary on both of them by Upavarsha who is said to be the guru of Panini in the Kathasaritsagara, though we must admit it cannot be conclusively proved that the two Upavarshas are one and the same[45] కథా సరిత్సాగరమున తెలుపబడినరీతి, పాణిన్యాచార్యునకు ఆచార్యుడైన ఉపవర్షాచార్యుడు. యీదర్శనద్వయమునకు వృత్తులు రచించియుండుటచే వేదాంత, మీమాంసాసూత్ర ములు పాణిన్యాచార్యునకు పూర్వరచితములని అనుమా నింపనగుననియు పండితోద్దేశ్యము.

45. Swami Veereswarananda: Brahma Sutras p-8

వేదాంత, మీమాంసాదర్శనములకును వానికర్తలగు వ్యాస, జైమినులకు సన్నిహితసంబంధ ముండుటచే వేదాంతదర్శనకాలముగాని, వేదవ్యాసకాలముగాని నిర్ణయమైయున్నచో జైమిన్యాచార్యకాలము కాకపోయినను, పూర్వమీమాంసాదర్శన కాలనిర్ణయము చేకూరునుగదా యని యింతగ బండితవర్గము చర్చించినది. కాని అంతయు అనిర్ణీతముగనే యున్నది. పాణినీయ వ్యాకరణగ్రంథమునకు భాష్యరచన గావించియున్న పతంజలికాలమే క్రీ. పూ. సుమారు పదవశతాబ్దికి జెందినట్లు తీర్మానింపబడియుండ(సర్వ సిద్ధాంత సౌరభము. (ప. భా.-పతంజలి) అతనికి ప్రాచీనుడైన పాణినియు, అతని ఆచార్యుడైన ఉపవర్షుడును, అతని భాష్యముల కాధారమైన అతిప్రాచీన వేదాంత, పూర్వమీమాంసాదర్శనకాలమును, వానికర్తలైన బాదరాయణ జైమిన్యాచార్యుల కాలనిర్ణయము ఎంతవెనుకకు పోవలసి యున్నదో వేరుగ జెప్పవలయునా? అంతియగాక None the less it remains true that we must assume that the Mimamsa as a science developed before the Vedanta[46] ఎట్లైనను వేదాంతముకంటె పూర్వము మీమాంసము అభివృద్ధిచెందిన శాస్త్రమని మనము గైకొనక తప్పదను Thibaut తిబూట్ వాక్యమురీతి వేదాంతదర్శనముకంటె మీమాంసాదర్శనము పూర్వమగుచున్నది. అట్లు ఈయొక్క దర్శనమునకేగాక 'It is probable that Mimamsa Sutra is the earliest of the six Darsanas preserved to us[46]

46. Dr. A. B. Keith: Karma Mimamsa p-5

మనకు లభించు షడ్దర్శనములలో మీమాంసాసూత్రము అతిప్రాచీనమైయుండుననియు A. B. Keith ఎ. బి. కీత్ వాకొనును. అవును, వేదకర్మకాండాప్రాధాన్యత వ వెలుగొందిన యీదర్శనమే అన్నింటికంటె ప్రాచీనమను టయు ఉచితమగునేమో!

అట్లుగాక పరాశరపురాణ ప్రోక్తమగు 'కిమత్ర బహునోక్తేన వసిష్ఠమునిసత్తమ। వేదమార్గప్రతిష్ఠార్థం కృపయాహం మహామతే॥ మన్నియోద్ధరిసాక్షాదతీవ శ్రద్ధయా సహ। కృష్ణద్వైపాయనో భూత్వా మునే సూత్రం కరిష్యతి॥ జైమినిర్వ్యాసశిష్యస్తు మమాజ్ఞా వశమాగతః కర్మకాండ ప్రతిష్ఠార్థం గృహస్థో నియతేంద్రియః। యజ్ఞదాన తపోయుక్తస్స్వయం సూత్రం కరిష్యతి, ఉభాభ్యాం సుస్థితో లోకే వేదమార్గో భవిష్యతి॥' (పరాశరః 9. అ.) వసిష్ఠ మునీంద్రా, బహుళముగనున్న వేదమార్గ ప్రతిష్ఠాపనార్థము, నేను కృపతో అతిశ్రద్ధతో కృష్ణద్వైపాయనుడనై సూత్రముల 'నిర్మించితిని. నా యాజ్ఞననుసరించి, వ్యాసశిష్యుడును గృహస్థుడును జితేంద్రియుడును అగు జైమిన్యాచార్యుడుకర్మకాండ ప్రతిష్ఠాపనకొరకై యజ్ఞదానతపోయుక్తమగు సూత్రమును కల్పించెను. వేదమార్గము లోకమున సుస్థితినుండుటకు యీసూత్రదర్శనములును ఉండును అను వాక్యముననుసరించి వ్యాసశిష్యునిగా జైమిన్యాచార్యుని స్వీకరించినచో, పై నుదాహరింపబడిన కృష్ణద్వైపాయనుడు 'తథా హ్యపాంతరతమా నామ వేదాచార్యః పురాణర్షి

ర్విష్ణునియోగాత్ కలిద్వాపరయోస్సంధౌ కృష్ణద్వైపాయన స్సంబభూవేతి స్మరంతి' (బ్ర. భా. 3.3.32) వేదాచార్యుడైన యపాంతరతముడను పురాణ ఋషి విష్ణునియోగము వలన కలిద్వాపర సంధియందు కృష్ణద్వైపాయనుడై జన్మించెనని స్మరించుచున్నారు అను శ్రీశంకరప్రోక్త వచనము రీతి కృష్ణద్వైపాయనవ్యాసుడు కలిద్వాపర సంధియం దవతరించినట్లు సంప్రదాయము. అనగా నేటికి కలియుగము ప్రారంభమై 5056 సంవత్సరములు గతించినవి. గాన వ్యాసావతార కాలము అదియేయని అననగును. కూర్మపురాణ వాక్యాను సారముగ స్వాయంభువు వ్యాసాది కృష్ణద్వైపాయన వ్యాస పర్యంతముగల ఇరువదియెనిమిది వ్యాసులలో నితడు కడపటి వాడుగా నుండుటచే కాలనిర్ణయమున కొంతసులభము వచ్చెను. అట్లుగానిచో 'ద్వాపరే ద్వాపరే విష్ణు ర్వ్యాసరూపీ మహామునే। వేదమేకం బహుధా కురుతే జగతో హితః॥' ద్వాపర ద్వాపరమున శ్రీమహావిష్ణువు మహామునియగు వ్యాస రూపముదాల్చి జగత్తుయొక్క హితమునకై ఏకమైన వేదమును బహుధా నిర్మించునను విష్ణుపురాణవాక్యము ననుసరించియు వ్యాసులు అసంఖ్యాకులగుటచే వ్యాసకాల నిర్ణయము, దాన జైమినికాలనిర్ణయమున మరింత క్లిష్టత్వ మేర్పడియుండును.

వేదోద్ధారకమగు నీ జైమిన్యాచార్యుడేయై యుండనోపు పంచతంత్రము ననుసరించి గజమువలన దుర్మరణము నొందినట్లు తెలియుచున్నది (2.34). ఇంతియగాక

మీమాంసాదర్శనకర్తయని ప్రతీతిగాంచిన జైమిని జీవిత విశేషములు మనకు కొంచెమేని అందకుండుట కడుంగడు విచారకరము. అతిక్లిష్టమగు వేదార్థంబుల గ్రహించి, వేద కర్మాచరణపారీణులైన వారి అసంఖ్యాక సందేహ నివృత్తికి, సహాయభూతముగ కర్మమీమాంసాశాస్త్రము నిర్మించి, వేదాధ్యయన నిరతిని, కర్మాచరణ పాటవమును అనాది కాలముననే భారతీయులకు ప్రసాదించిన జైమిన్యాచార్యుడు మననీయుడును, వంద్యుడును అగుచున్నాడు.

---

## పూర్వమీమాంసాచార్యులు

### వృత్తికారులు – ఉపవర్షుడు – బోధాయనుడు

జైమిన్యాచార్య సత్తమునకు బూర్వమే, ఆధ్యాత్మికాభ్యుదయకారకమగు వేదమునం దధికభాగముగ వెలుగొందు యజ్ఞయాగాదిరూప కర్మకాండ నవలంబించు గాలముల ననేక సంశయంబులు అనుష్ఠానవిధులందు పొడసూపుచుండుటచే, బాదరాయణ, బాదరి, కాముకాయనాచార్య మొదలగు తత్త్వవేత్తలు యీ శాస్త్రవిషయ బరిశీలన గావించి, ఆనాటి ప్రజానీకమునకు ఎంతగనో తోడ్పడి యుండిరి. అయినను నాయారచనలు అసమగ్రములగుటచే జైమినీ మహర్షి వరేణ్యుడు దర్శనగ్రంథమును నిర్మించి ప్రసాదించెను. కాని అది యు సూత్రరూపముననుండుటయు, ప్రస్ఫు

టార్థముల నొసంగకుండుటచే చింతించి, ఉపవర్షాచార్యుడు ఉభయమీమాంసలకు రెండు వృత్తులను రచించెను.[47] కాని యీఉపవర్షుడెప్పటివాడో నిర్ణయించుటకుగూడ పండితులు శ్రమించిరి. 'అథ కాలేన వర్షస్య శిష్యవర్గో మహానభూత్ । తత్ర ఏకః పాణినిర్నామ జడబుద్ధితరోఽభవత్ ॥' (కథాసరిత్సాగర. 4.20) అను శ్లోకము నాధారముగ Panini is said to have been a disciple of Upavarsha, minister of a King of the Nanda dynasty [48] నందవంశమునకు చెందిన ఒక రాజుకు అమాత్యపదవి నలంకరించి యుండిన ఉపవర్షునకు పాణిని ఒక శిష్యుడుగా నుండెనని సతీశచంద్ర విద్యాభూషణు డుద్దేశించెను. Katyayana studied along with Panini and both Vyadha, the grammar of Indra under Upavarshopadhyaya in Pataliputra [49] పాణిని వ్యాధులతోసహా కాత్యాయనుడు ఇంద్రప్రోక్త వ్యాకరణమును పాటలీపుత్రనగరమున ఉపవర్షోపాధ్యాయునిదగ్గర పఠించెను అని భాష్యాచార్యులును వాకొనిరి. A still more ancient commentator Upavarsha by name, is mentioned and Sankara in 3.3.53 calls him Bhagavata [50] శబరస్వామికంటె అతిప్రాచీనమైన వ్యాఖ్యాతగా ఉపవర్షుని శంకరులు బ్రహ్మసూత్ర 3.3.53 సూత్రభాష్యమున సూచించి అతని భాగవతుడని

47 Pandit. N. Bhashyacharya The Age of Patanjali
48. M. M, Satis Chandra Vidyabhushana Nyaya Sutras
49. Pandit. N Bhashyacharya The Age of Patanjali
50. Prof. F. Max Muller: The Six Systems of Indian Philosophy p-116

వచించెననియు. కాని But it must remain doubtfull again whether he can be identified with the Upavarsha who according to the Kathasaritsagara was the teacher of Panini[50] పాణిన్యాచార్యుని దేశికునిగా కథాసరిత్సాగరము తెలుపు ఉపవర్షుడితడే యనుట సందేహాస్పదమని Max Muller గారు పుస్నముల్లరు సంశయించుచున్నాడు. Indian tradition also makes Suka one of the earliest commentators. Sabara in his Purva Mimamsa Bhashya called Vrithikara, Upavarsha[51] హైందవ సంప్రదాయము శుకదేవునికూడ ఒక ప్రాచీన వ్యాఖ్యాతగా జెప్పుచున్నది. శబరస్వామి తన పూర్వమీమాంసాభాష్యమున ఉపవర్షునే వృత్తికారులుగా దెలిపిరి. శంకరులుకూడ నదే అభిప్రాయమును వెలిబుచ్చిరి. కాని Ramanuja and his followers call him Bodhayana. Venkata Deshika declares that the same man is called by both the names[51] రామానుజులు వారి అనుచరులును, వృత్తికారుని బోధాయనులుగా బిలిచిరి. ఒకే వ్యక్తి ఈ నామద్వయమున పిలువబడునని వేదాంత దేశికులు ప్రకటించినట్లు తెలియుచున్నది. The Sutra must from the first have been accompanied by a comment, which in course of time was lost or become defective[52] సూత్రమునకు మొదటినుండి యొక వ్యాఖ్య అనుసంధించి యుండవలెను. కాని అది కాలక్రమమున అదృశ్యమైగాని లోపభూయిష్టమైగాని అయియుండును.

50. Prof. F. Max Muller: The Six Systems of Indian Philosophy p-116
51. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol. 2 p-431
52. Dr. A. B. Keith: Karma Mimamsa p-7

The first commentator of whom we have certain knowledge is a Vrithikara, from whose work a long extent is made in the Bhashya of Sabara on Mimamsa Sutra 1.1.5.[52] కొంచెముగ తెలియబడియున్న ప్రథమవ్యాఖ్యాత వృత్తికారులు. మీమాంసాసూత్ర 1.1.5 న శబరస్వామి యీవృత్తివి అధికముగ అనువదించియుండెనని A. B. Keith ఏ. బి. కీత్ పండితుడు వచించెను. ఈవిషయమునే యింక దరచుచు, వృత్తికారుని కుమారిలుడు భావదాసుడనికూడ ననియెననియు, కాని అది అసంబద్ధమనియు, శంకరుల అభిప్రాయము ననుసరించిగూడ ఉపవర్షులే వృత్తికారులు అని కీత్ పండితుడు పలుకును. To this the objectton has been brought that in the passage cited from the Vritthkara by Sabara Swami there is a reference to Upavarsha with the epithet Bhagavata, implying that he was in the eyes of the Vrithikara an author of venerable authority[52] శబరస్వామి గైకొసిన వృత్తికారవచనములలో ఉపవర్షుడు భాగవతుడని వచింపబడుటచే వృత్తికారునకుగూడ ఉపవర్షుడు పరమప్రామాణిక పురుషుడేమో యను వాదన గలదు అనియు Keith కీత్ ఆచార్యుడు తలంచెను. Evidently there were commentaries on Jaimini's work prior to Sabara, such as Bhartri Mitra, Bhavadasa, Hari and Upavarsha, but the works are not available[53] శబరునకుపూర్వము జైమినిగ్రంథమునకు భర్తృమిత్ర, భావదాస, హరి, ఉపవర్షుల వ్యాఖ్య లుండియుండెననియు, కాని

52. Dr. A. B. Keith: Karma Mimamsa p-7

53. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol. 2 p-376

ప్రస్తుతమలభ్యమనియు రాధాకృష్ణు డుద్దేశించి సమన్వ
పప యత్నించెను. శబరాచార్యులు 1.1.5 సూత్ర
ష్యమున వృత్తినుండి పెద్దభాగమును విరచించెను. ఆ
త్తికారులు భావదాసుడని డాక్టరు గంగానాధ ఝూ
చించెను. అతడు బోధాయనుడే యనియు ఉపవర్షుని
నే మీమాంసాద్వయమునకు అతడు వృత్తుల వ్రాసె
యు Jacobe జకోబి తలంచినట్లును గలదు[53] Bodhayana
here else appears as a Mimamsa authority. Of other,
umably, early commentators we hear of Bhartri
ra (Nyaya Manjari—Sloka Vartika V. 10. Partha-
dhi) and Hari (Sastra Deepika X, 2, 59-60), but there
o reason to identify either of those with Vrithikara[54]
మాంసాశాస్త్రజ్ఞుడుగా బోధాయనుడు ఎచ్చటను తెలుప
యుండ లేదనియు, పార్థసారధిచే న్యాయమంజరిలో భర్తృ
తనామము, శాస్త్రదీపికలో హరినామము యితర
చీన వ్యాఖ్యాతలుగ గలవనియు, కాని వీనిని వృత్తి
రునితో నైక్యపరచుట సహేతుకము గాదనియు Keith
వాదించును. ఏదెట్లున్నను ఉపవర్షాచార్యుడే
మాంసాశాస్త్రద్వయమునకు వ్యాఖ్యాతయగు వృత్తి
రులని అధికసంఖ్యాకులగు పండితాభిప్రాయము. ఈభావ
ను పూర్వోత్తరమీమాంసలకు సుప్రశస్త భాష్యకర్త
న శబరస్వామి శంకరులు బలపరచియుండుటచే అదియే
ఎతీర్మానముగా భావింపనగును.

Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol. 2 p-376
Dr A B Keith: Karma Mimamsa p-8

## ఉపవర్షుని కాలము

వృత్తికారకాలమును తర్కించుచు క్రీ.త. 200 నుండి 500 సంవత్సరముల మధ్యకాలములో నుండునని Jacobe జకోబి భావించెను. చిత్రముగ శబరునకుగూడ నదేకాలమునుఅతడు నిర్ణయించెను. It follows, accordingly that the date of the Vrithikara was probably not later than the 4th century A. D.[54] అందుచేత వృత్తికారుని కాలము, క్రీ.త. నాల్గవశతాబ్దమునకు తర్వాత యుండదని A.B. Keith కీత్ మహాశయుని పరిగణనము. భగవాన్ ఉపవర్షునకు న్యాయసిద్ధాంతము తెలియునని రాధాకృష్ణుడు తెలుపుచున్నాడు. అందుచే న్యాయదర్శనకాలమునకు ఉపవర్షుడు తర్వాతవాడని సూచన[55] పాణిన్యాచార్యున కుపదేశికుడైన ఉపవర్షుడు నందవంశరాజునకు అమాత్యుడుగ నుండుటచే క్రీ. పూ. 350 సంవత్సరములకు జెందునని సతీశ చంద్ర విద్యాభూషణుడు తలంచుచున్నాడు.[56] About 1400 years before Christ there flourished in India a great philosopher Patanjali by name[57] క్రీ. పూ. 1400 సంవత్సరములలో భారతదేశమున పతంజలి యను నొక గొప్ప తత్త్వవేత్తయుండెనని వివేకానందుడు ఉపన్యసించియున్నాడు. అందుచే పతంజలికి అతిప్రాచీనుడైన

54. Dr. A. B. Keith. Karma Mimamsa p-8
55. Prof. S Radhakrishnan: Indian Philosophy Vol 2 p-36
56 M M. Satish Chandra Vidyabhushana. Nyaya Sutras
57. Swami Vivekananda: The Complete Works Vol. 2 p-27

పాణినికి గురువు ఉపవర్షుడగుటచే ఉపవర్షుని గాలనిర్ణయమింకను వెనుకకు బోవలసియుండునని తోచుచున్నది. కాన మీమాంసాదర్శన వ్యాఖ్యాతయగు ఉపవర్షాచార్యుడు కొందరుపండితుల భావముల ప్రకారము క్రీ. త. కాక, పూర్వము ప్రాచీనుడని వ్యక్తము.



## భాష్యకారులు - శబరస్వామి

మీమాంసాదర్శనమునకు వృత్తిని ఉపవర్షుడు లిఖించియున్నను, అతిప్రధానమగు ఆశాస్త్రము దుర్జ్ఞేయముగ నుండుటచే శబరస్వామి మీమాంసకే కాక వ్యాససూత్రములకు గూడ భాష్యముల రచించెను [58] శబరరచితమగు నీభాష్యమే తర్వాత మీమాంసాశాస్త్రమునకు ప్రబలాధారముగ నొప్పారియున్నది. ఈమహామహుని గూర్చియు నిసుమంత యోచించెదముగాక. శబరస్వామికి బౌద్ధ, శూన్య విజ్ఞానవాదములు తెలిసియున్నట్లు విదితము.[58] The oldest extent commentary is that of Sabara Swami [59] అతి ప్రాచీనమైన వ్యాఖ్య శబరస్వామిదే యని A. A. Macdonell మాక్డొనెల్ కూడ నిర్ణయించెను. Of Sabara Swami, whose commentary forms the starting point for later discussion, we know practically nothing. It is

58. Dr A. B. Keith A History of Sanskrit Literature p-473
59. Dr A. A. Macdonell: India's Past

an idle fiction which makes him the father of the Vikrama era (57 B. C.) of Bhartrihari and Varahamihira, his true name being Aditya Deva. While he adopted the subsequent Sabara, when he disguised himself as a forester to avoid Jain persecution. The form of his name and his relation to Vrithikara suggest that 400 A. D is the earliest date to which he can be assigned; the later limit is vaguely indicated by his priority to Prabhakara, Kumarila, and Sankara [60] తర్వాత శాస్త్రవిచారణమున కాధారమైన భాష్యకర్త యగు శబరస్వామినిగూర్చి మన కేదియు తెలియదు. క్రీ. పూ. 57 సంవత్సరములుగా రచింపబడు విక్రమార్క-శకమునకు సంస్థాపకుడైన విక్రమాదిత్యునకును భర్తృహరి వరాహమిహిరులకును తండ్రియను కల్పితగాథను విశ్వసింప జాలము. ఇతనినామము ప్రథమమున ఆదిత్య దేవుడు. కాని జైనమతస్థుల బాధనుండి రక్షించుకొనుటకు ఆటవికులైన శబర వేషమును ధరించి శబరస్వామియని నామమును ధరించెను. వృత్తికారునకు యితనికిగల సంబంధము ననుసరించి, యితనికి క్రీ. త. 400 సంవత్సరములు నిర్ణయింపనగును. తర్వాత రాగల ప్రభాకర, కుమారిల, శంకరుల కాలముననుసరించి ఆకాలనిర్ణయము గావించితిమి అని A. B. Keith నిర్ణయించెను. Sabara is the author of the chief commentary on the work of Jaimini. He lived about the first century B. C.[61] జైమినిదర్శనమునకు

---

60 Dr. A. B. Keith · Karma Mimamsa p-9

61. Prof. S. Radhakrishnan. Indian Philosophy Vol. 2 p-375

శబరస్వామియే ముఖ్యభాష్యకర్త. అతడు క్రీ. పూ. ఒకటవ శతాబ్దమునకు జెందినవాడని రాధాకృష్ణపండితుని అభిప్రాయము. ఇంతకు మించి మనకు శబరస్వామియొక్క జీవితవిశేషములు తెలియరావు. అయినను ఆ మహానుభావుడు మీమాంసాదర్శనమునకు ఉత్తమమును సరళమును అగు భాష్యరచనము గావించి ఆర్షసంప్రదాయపాలకుల కృతజ్ఞతాసహస్రమునకు బాత్రుడై వెలుగొందెను.

---

## ప్రభాకర – కుమారిలులు

Mutual criticism further makes Indian Philosophy its own best critic [62] పరస్పరవిమర్శనము భారతీయ తత్త్వశాస్త్రమునకు స్వతఃసిద్ధమైన విమర్శకుని ఏర్పరచునన్న ఆరోక్తిరీతి శబరస్వామి భాష్యమునకు బిమ్మట పరస్పర విమర్శలకు ఆస్పదమై మీమాంసాశాస్త్రము అత్యధికముగ పరిణమించిపోయెను. Of the Bhashya of Sabara Swami we have two different systems founded, one by Prabhakara (600 A. D.) in the Brihati, the other by Kumarila who wrote perhaps about 700 A. D. [63] క్రీ. త. 600 సంవత్సరములకు జెందిన ప్రభాకరునిద్వారా అతని బృహతి గ్రంథమునను, క్రీ. త. 700 సంవత్సరముల ప్రాంత

---

62. Prof Satish Chandra Chaterjee·
An Introduction to Indian Philosophy p-12

63. Dr. A. B. Keith: A History of Sanskrit Literature p-473

ముల భాష్యమురచించిన కుమారిలుని వలనను రెండు విరుద్ధ వాదములు శబరభాష్యమునుండి ఏర్పడియున్నవి. వీరిరువురికి మిగుల సూక్ష్మభేదము లేర్పడుటచే వారి అనుచరులలో మిగుల అనైక్యత ఏర్పడియున్నది. The relation of Prabhakara and Kumarila is represented by tradition as those of pupil and teacher, the tradition is fairly old, as it occurs in the Sarva Siddhanta Sangraha (1.18, 19. 7.15) attributed doubtless wrongly to Sankara himself [64] సంప్రదాయము ననుసరించి, ప్రభాకర, కుమారిలులకు గురు శిష్యసంబంధమున్నటుల గలదు. పొరపాటున శంకరుల కన్వయింపబడిన సర్వసిద్ధాంతసంగ్రహమున నది సూచితమై యుండుటచే నాసంప్రదాయము ప్రాచీనమే యని A. B. Keith కీత్ వ్రాసెను. కుమారిలుడు క్రీ. త. 700 సంవత్సరముల వాడని A. A. Macdonell మాక్డొనెల్ కూడ తలంచెను[65] కుమారిలభావముల ప్రభాకరుడు తన గ్రంథమున ప్రస్తావింపకుండుటయు, కుమారిలుడు ప్రభాకరుసిద్ధాంతములవంటి వానిని సూచించియుండుటచే ప్రభాకరుతర్వాత కుమారిలుడుండియుండునని రాధాకృష్ణుని అభిప్రాయము. ప్రభాకర విరచిత బృహతియొక్క శైలిగూడ కుమారిలునకు పూర్వకాలికత్వమును తెలియజేయునని కీత్ గూడ ఊహించెను. కాని ఆచార్య కుప్పుస్వామిశాస్త్రి, కీత్, గంగానాధఝూ పండితుల భావముల ఖండించి సాంప్రదాయికమై గురుశిష్య బాంధవ్యమునే నెలకొల్ప యత్నించినట్లు రాధాకృష్ణ

64. Dr. A, B. Keith Karma Mimamsa p-9

వాక్యము[66]. హిందూబౌద్ధములకు స్పర్థలెక్కువకాగా కుమారిలుడుద్భవించి శాబరభాష్యమునకు వ్యాఖ్యరచించుటలో దృష్టిగాంచక, జైనబౌద్ధాది మతముల ఖండింప తత్తద్ధర్మముల గ్రహింప నుద్యుక్తుడై ఆయాయాచార్యుల మారువేషమున నర్థించి జైనబౌద్ధధర్మముల పాండితిని గడించి మరల తన నిజరూపమున వాని ఖండించెనట. అంతియగాక నాటి మేదినీపురాధీశ్వరుడైన సుధమ్వు నాశ్రయించి బౌద్ధ జైనావలంబకుల జంపించెనట. అందుచే ఆ గురుద్రోహ దోషఫలితముగ నాతని నేత్రమొకటి పోవ, పశ్చాత్తప్త మానసుడై తుషాగ్నిజొచ్చి ఆత్మహత్య గావించుకొనినట్లు ప్రతీతి. అట్లు అగ్నిమధ్యనున్న కుమారిలుని శంకరులు కలిసికొని తన భాష్యమునకు వార్తికరచింప రమ్మనుటయు, నాతడు తన శిష్యుడైన మండనమిశ్రుని చూపించినట్లును గలదు. బౌద్ధజైనమతాచార్యుల జయింప దేశవ్యాప్తి పర్యటన గావించియుండుటచే ఉత్తరదేశీయుడనియు, దాక్షిణాత్యుడనియు, ఆంధ్ర ద్రావిడబ్రాహ్మణుడనియు వివాదము గలదు. కాని జైనమతస్థుల 'జినవిజయ' అను గ్రంథమున 'ఆంధ్రోత్కలానాం సంయోగే పవిత్రే జయమంగళే గ్రామే తస్మిన్ మహానద్యాం భట్టాచార్యః కుమారిలః ఆంధ్రజాతి స్త్రిత్రిరో మాతా చంద్రగుణా సతీ యజ్ఞేశ్వర. పితా యస్య... మహావాదీ మహాన్ ఘోరః శ్రుతీనాం చాభిమానవాన్ జినానా మంతకస్సాతౌద్గురు ద్వేష్టాతి

---

66. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol. 2 p-377

పాపవాన్'[67] ఆంధ్రోత్కళసంధిలో నదీతీరమునగల జయ మంగళ కుమారిలభట్టాచార్యుని గ్రామము. ఆతని తల్లి చంద్రగుణ తండ్రి యజ్ఞేశ్వరుడు. అతడు గొప్ప వాదియు శ్రుత్యభిమానియు మహాఘోరస్వభావముగలవాడును, జిన మత విధ్వంసకుడును, గురుద్వేషియు అతిపాపాత్ముడు అని యుండుటచే కుమారిలుడు ఆంధ్రుడని వ్యక్తము అని మల్లాది సూర్యనారాయణశాస్త్రి వ్రాసియున్నాడు.

ఈవిషయమునే చర్చించుచు, Kumarila is earlier than Sankara and may be assigned to the 7 th century A. D. According to Mr. Pandit, Kumarila was the Guru of Bhavabhuti (A. D. 620-680) and so is assigned to (A. D. 590-650)[68] కుమారిలుడు శంకరునకు పూర్వుడై క్రీ. శ. ఏడవశతాబ్దమునకు జెందినవాడు. క్రీ.శ. 620–680 వరకు యుండిన భవభూతికి కుమారిలుడు గురు వనియు, అందుచే నతడు క్రీ. శ. 590–650 వరకు యుండిన వాడనియు, పండితుని అభిప్రాయమైనటుల రాధాకృష్ణుడు వచించెను. Kumarila was a south Indian and had a knowledge of the Dravidian Languages[69] కుమారిలుడు దాక్షిణాత్యుడనియు, అతనికి ద్రావిడభాషాజ్ఞానము గల దనియు Macdonell మాక్డొనెల్ భావించెను. Kumarila was a native of Southern India, who reveals his

---

67. Malladi Suryanarayana Sastry. History of Sanskrit Literature
68. Prof. S. Radhakrishnan, Indian Philosophy Vol, 2 p-377
69. Dr. A. A. Macdonell India's Past

knowledge of Dravidian Languages[70] కుమారిలుడు దాక్షిణాత్యుడని ద్రావిడభాషల నెరింగినవాడనియు A. B. Keith కీత్ కూడ తలంచెను. Kumarila is traditionally made out to have instigated persecution of the Buddhists[70] కుమారిలుడు బౌద్ధహింసకు ద్రోహదము గలుగజేసినట్లు వాదుకలదనియు కీత్ వాకొనెను. According to the tradition Prabhakara and Mandana were the pupils of Kumarila who gave Prabhakara the title of 'Guru' in recognition of his brilliant powers[71] ప్రభాకర మండనమిశ్రులు కుమారిలునకు శిష్యులై యుండ నందు ప్రభాకరుని అద్భుతశక్తుల గుర్తించి కుమారిలుడే అతనికి 'గురు' బిరుదము నొసంగెనని సంప్రదాయము. కాని అది ఎంతవరకు సముచితమో నిర్ణయింప అసాధ్యము.



## మీమాంసా గ్రంథకర్తలు

ఇట్లు కుమారిల ప్రభాకరవిరచిత గ్రంథముల ననుసరించి మీమాంసికులు భిన్నత్రోవలద్రొక్కి రెండు సిద్ధాంతముల అభివృద్ధి గావింపజేసిరి. అందు మండనమిశ్రుడు, 'మీమాంసానుక్రమణిక' 'విధివివేక' యను గ్రంథముల కుమారిలుననుసరించి విరచింప, 'విధివివేక' పై వాచస్పతి మిశ్రులు 'న్యాయకణిక' అను వ్యాఖ్య రచించిరి. తన

70 Dr. A. B. Keith · A History of Sanskrit Literature p 473
71. Prof. S. Radhakrishnan . Indian Philosophy Vol. 2 p. 377

'తత్త్వబిందు' గ్రంథమునగూడ నతడు కుమారిల వాదమునే యుల్లేఖించెను. తర్వాత ఉద్భవించిన పెక్కు గ్రంథముల, మాధవాచార్యులు రచించిన, 'న్యాయమాలావిస్తార' ఆప దేవుని 'మీమాంసాన్యాయప్రకాశ' లేగాక్షి భాస్కరుని 'అర్థసంగ్రహా'ములు సుప్రసిద్ధములు,

పై విషయము ననుసరించి విచారించినచో, మీమాంసాశాస్త్రమునకు ఆధారముగ 'వృత్తిః భగవతోప వర్షకృతా. తతః శబరస్వామినా భాష్యం రచితం, తతః కుమారిలభట్టపాదైః వార్తికం వ్యచరతి' (శివదత్తశర్మ) నున్నట్లు వ్యక్తమగుచున్నది.



# మీ మాం సా వై భ వ ము

## మీమాంసా-వైదికకర్మ

Indeed, the daring of the Mimamsa arguments, the fearlessness of its admissions, and the firmness of its inferences, approved as the very glory of Hinduism[72] మీమాంసాశాస్త్రముయొక్క వాదములు, దాని సిద్ధాంతములయొక్క నిర్భయత, దాని తీర్మానముల స్థైర్యము హిందూమతముయొక్క మహాత్త్వమును నిరూపించునని శ్రీవివేకానందస్వాములవారు మీమాంసాశాస్త్రమునుగురించి సగర్వముగ వక్కాణించిరి. అట్లే మీమాంసాశాస్త్రగవేషణమును గావించియున్న Max Muller మాక్సుముల్లరు మహాశయుడుగూడ, It is easy to see from this table of contents that neither Plato nor Kant would have felt much wiser for them[73] మీమాంసాశాస్త్ర విషయసూచికను తిలకించి ప్లేటో కాంట్ మొదలగు తత్త్వజ్ఞులకుగూడ నివి సుదూరమని గ్రహించుదురని మనకు సులభముగా దోచును అనియు వాక్రుచ్చియున్నాడు. అవును, అపౌరుషేయములగు వేదములతోగూడ 'అనంతరం చ వక్త్రేభ్యో వేదా స్తస్య వినిఃసృతాః। మీమాంసా న్యాయ విద్యా చ ప్రమాణాష్టకసంయుతా ॥' అను మత్స్యపురాణ వచనమురీతి విధాతముఖమునుండి సృష్టాదిన ఆవిర్భవించి

72. Swami Vivekananda. The Life of Swami Vivekananda Vol. 3 p. 377

73. Prof F. Max Muller. The Six Systems of Indian Philosophy p. 202

అనంతరము 'అంగాని చతురో వేదాన్ పురాణ న్యాయ విస్తరాన్। మీమాంసా ధర్మశాస్త్రం చ పరిగృహ్యాథ సాంప్రతం। మత్స్యస్వరూపేణ చ పునః కల్పాదవుదకాంతరే' (పద్మపురాణము) చతుర్వేదముల అంగములను విస్తరములగు పురాణ న్యాయములను, మీమాంసా ధర్మశాస్త్రమును ఉదకమునుండి మత్స్యరూపమున కల్పాదిని పరిగ్రహించెను అను పద్మపురాణవాక్యముననుసరించి ప్రతికల్పాంతమున నుద్ధరింపబడుచు, 'పురాణో న్యాయమీమాంసా ధర్మశాస్త్రాంగమిశ్రితాః। వేదాః స్థానాని విద్యానాం ధర్మస్య చ చతుర్దశ॥' (1.3) అను యాజ్ఞవల్క్యసంహితా వాక్యము ననుసరించి చతుర్దశమహావిద్యలలో ప్రముఖస్థానము నలంకరించియున్న మీమాంసాశాస్త్రమున కట్టి ఘనత యొనగూడుటయు సముచితమే యగుచున్నది ఎందుచేతనన 'అజ్ఞేభ్యో గ్రంథినః శ్రేష్ఠా, గ్రంథిభ్యో ధారిణో వరాః। ధారిభ్యో జ్ఞానినః శ్రేష్ఠా జ్ఞానిభ్యో వ్యవసాయినః।' (12.103) అను మనుప్రోక్తవచనరీతి మానవులలో గృహిసల్పువాడు గ్రంథజ్ఞానము కల్గినవానికంటె అత్యధికు డగుచున్నాడు. అనగా Philosophy is not a mere reproduction of the facts of life, but is essentially creative in the sense of transforming life [74] జీవితముయొక్క విషయముల యథాతథముగ వర్ణించునదికాక, జీవితమును పరివర్తింపజేయు సచేతనాంశమే ముఖ్యముగా తత్త్వజ్ఞానమని ఆర్యసూక్తి.

74. Prof. S. Radhakrishnan, The Role of Philosophy in Civilization

అట్లు The philosopher meditates on the deeper problems, and the people at large absorb the results of his enquiry [74] నిగూఢ సమస్యలగూర్చి తత్త్వవిదుడు తలపోయగా, అతని విచారణాఫలితముల సామాన్యమానవులు గ్రహించెదరు అను రాధాకృష్ణ వచనములరీతి తత్త్వజ్ఞానవేత్తయే సామాన్య మానవజీవితవికాసమునకు ఆధారమగుచున్నాడు. అంతియగాక A civilization is a philosophy concretized [74] అట్టి తత్త్వజ్ఞాన మూర్తిమత్త్వమే నాగరికతయగుచున్నది. అందుచే మన భారతీయ వైజ్ఞానికవైభవానికంతటికి వేదములే ఆధారమగుచుండ, ఆవైదికతత్త్వమును పరిశోధించి, నిర్ణయించి మానవకోటికి అవలంబనీయముగా నర్పించిన తత్త్వవేత్త ఎంతటి సంస్తవనీయుడో వచింపవలయునా? వేదార్థవిషయముల ననుష్ఠింపయత్నించు ముముక్షువులకు 'తత్ర చ వేదే పూర్వాపరవిరోధినా వాస్తవార్థవిచికిత్సాయాం ప్రసక్తాయాం తద్వారణాయ మీమాంసాశాస్త్రం రచితం'[75] వేదములందు పూర్వాపరవిరోధముల వాస్తవార్థములుగల సంశయనివారణార్థము మీమాంసాశాస్త్రము రచింపబడియున్నదను వాక్యరీతి తద్రచయితయగు జైమిన్యాచార్యు డెంత కరుణాహృదయుడోగదా! అట్లు వైదికజిజ్ఞాసను నిలువబెట్టి భారతీయసంస్కృతిని కాపాడిన ఆమహర్షివరేణ్యునికి యెల్ల భారతీయులును కృతజ్ఞులు.

---

74. Prof. S Radhakrishnan The Role of Philosophy in Civilization

## మీమాంసా విశ్వాసము

The faith underlying Vedic ritualism consists of different elements such as belief in the existence of a soul which survives death and enjoys the fruits of ritual in heaven, the belief in some power of potency which preserves the effects of the rituals performed, the belief in the infallibility of the Vedas on which rituals stand, the belief that the world is real and our life and actions performed here are not mere dreams[76] మృత్యువునకు అతీతమై యజ్ఞాదికర్మఫలితముల స్వర్గమున ననుభవించుచు ఆత్మయొక్క కలిమియందు విశ్వాసమును, ఆచరింపబడిన కర్మఫలితముల బదిలపరచు అపూర్వశక్తి యందు నమ్మకము, కర్మకాండ కాధారభూతమైన వేదముల నిర్దుష్టత్వమునందు అపౌరుషేయత్వమునందు నమ్మిక, ప్రపంచము మన జీవనము సత్యమై మనమాచరించు కర్మలు స్వప్నములు కాదను విశ్వాసమును వైదిక కర్మకాండవిషయములయందు విశ్వాసమువలన కలుగుచున్నవి. Ritual is an art; the art of religion. Art is the outword material expression of ideas intellectually held, and emotionally felt. Ritual art is concerned with the expression of those ideas and feelings which are specially called religious[77] కర్మకాండయన నొక కళ. అదియే మత

76. Prof. Satish Chandra Chatterjee. An Introduction to Indian Philosophy p. 361

77. Sir John Woodroffe: Shakti and Shakta p. 112

సంబంధమగు కళ. బుద్ధితో గ్రహించి, హృదయముతో ననుభవించు భావజాలముల బాహ్యాపరివర్తనమే కళ నాబడును. ధార్మికకళ యన అట్టి భావముల అనుభవముల వ్యక్తీకరణమే యగును. దానినే ప్రత్యేకముగ మతము అని అందురు అని Sir John Woodroffe సర్ జాన్ వుడ్రాఫ్ చక్కగా నిర్వచించెను. అనగా ఏమత జీవితమునగాని కళారూపమైన కర్మకాండ అత్యావసరము. అది లేకున్నచో అది మతమని వ్యవహరింపబడకుండుటయేగాక, యథార్థముగ అనుభవశూన్యమై రాజిల్లును.

---

## వేదము - వ్యాస జైమినులు

అట్టి ప్రమాదమునుండి భారతావనిని రక్షించుటకై 'కృష్ణద్వైపాయనో భూత్వా మునే సూత్రం కరిష్యతి జైమినిర్వ్యాసశిష్యస్తు మమాజ్ఞావశమాగతః । కర్మకాండ ప్రతిష్ఠార్థం ... స్వయం సూత్రం కరిష్యతి । ఉభాభ్యాం సుస్థితో లోకే వేదమార్గో భవిష్యతి।' అను పరాశరవాక్యము ననుసరించి కృష్ణద్వైపాయనజైమినులు లవతరించి 'అతః మనుజశ్రేయః సంసిద్ధయ ఏవ సమగ్రో వేదః కర్మకాండం జ్ఞానకాండం చేతి ద్విధా విభక్తః సమాహితస్వర్గాదిసాధకానాం యజ్ఞకర్మణాం ప్రతిపాదకా కర్మకాండా పరనామధేయా మీమాంసా 'కర్మమీమాంసా' 'పూర్వమీమాంసా' వేతి పదేన వ్యపదిశ్యతే, మోక్షసాధకా జ్ఞాన

కాండాపరాభిధానా మీమాంసా 'వేదాంతః' 'ఉత్తర మీమాంసా' వేతి పదేన చ 'ఏవమర్థకామయోర్గౌణత్వం ప్రతిపాద్య ధర్మమోక్షావేవ మీమాంసాద్వయే ప్రాధాన్యేన విమర్శవిషయాభూతౌ'[78] అంత మానవశ్రేయోసంసిద్ధిదమగు సమగ్రవేదము కర్మజ్ఞానరూపమున ద్వివిధము కామితస్వర్గాదిక సాధకములగు యజ్ఞకర్మముల బ్రతిపాదించు కర్మకాండయగు మీమాంసాభాగమునకు 'కర్మమీమాంసా' 'పూర్వమీమాంసా' అనియు వ్యవహారము. మోక్షసాధకమగు జ్ఞానకాండారూపమగు మీమాంసాభాగము 'వేదాంతము' 'ఉత్తరమీమాంసా' అను పదముల పిలువబడును. ఇట్లు అర్థకామముల అప్రాధాన్యత ప్రతిపాదింపబడి, ధర్మమోక్షములే మీమాంసాద్వయరూపమున ప్రధానముగా విమర్శింపబడుచున్నవి అని కరవీర పీఠాధిపతులు శ్రీశంకరాచార్యులు వివరించిరి. అనగా 'శ్రుతిజనన్యా పురుషార్థచతుష్టయే కర్మాపరపర్యాయా ధర్మ ఏవ మోక్షోపాయత్వే నాదౌ పరిగణితః। అర్థకామౌ ధర్మవిరోధేన సాధితావేవాభ్యుదయ సాధకౌ భవతః నాన్యథా। ఇత్యతో ధర్మ ఏవ సమ్యగాచరితః సన్నభ్యుదయద్వారా నిఃశ్రేయస భవతీతి పురాతన వైదికాచార్యైరవ్యాహతపరంపరయా వ్యవస్థాపితం। యద్యపి యజ్ఞయాగాదికర్మణ్యపూర్వద్వారా నిరతిశయ సుఖరూపం స్వర్గం ప్రాపయంతీతి నిర్ణీతం కర్మమీమాంసా, తథాపి

78. Sri Sankaracharya of Karaviru Pitha :
Mukha Pratibimba Bhava Bodhini

తాన్యేవ కర్మాణి పరమేశ్వరార్పణబుద్ధ్యా విహితాని చిత్తశుద్ధయే'[78] శ్రుతిజన్యములగు పురుషార్థములలో కర్మరూపమగు ధర్మమే మోక్షోపాయహేతువగుటచే నది ప్రథమముగా బరిగణింపబడినది. అర్థకామములు ధర్మబాహ్యములైనచో అభ్యుదయకారకములు గావు. అందుచే ధర్మమే శుద్ధముగా నాచరించిన అభ్యుదయముద్వారా నిఃశ్రేయసము ప్రాప్తించునని పురాతన వైదికాచార్యగణము పరంపరగా నిశ్చయించుచున్నారు. అయినను, యజ్ఞయాగాది కర్మద్వారా నిరతిశయరూప సుఖరూపస్వర్గము ప్రాప్తించునని కర్మమీమాంస నిర్ణయించుచున్నది. అందుచే ఆకర్మలను పరమేశ్వరార్పణబుద్ధితో చిత్తశుద్ధికొరకుగా ఆచరింపవలెను అనియు కరవీరపీఠాధీశ్వరు లుద్బోధించుచున్నారు. అనగా ధర్మార్థకామమోక్షములగు జతుర్విధ పురుషార్థములలో అర్థకామములు ప్రాపంచికములగుచుండ ధర్మము మోక్షసాధకముగాన దాని నాచరించుటకు మీమాంసాశాస్త్రము విహితమై యున్నదని తాత్పర్యము. అందుచే 'తత్ర కర్మసాధికానాం శ్రుతీనాం విచారరూపో భాగః పూర్వకాండః ప్రథమతంత్ర శబ్దవ్యవహృతో మీమాంసత్వేన ప్రసిద్ధో జైమినీయత్వేన ఖ్యాతిం గతః'[79] కర్మసాధకములగు శ్రుతిభాగముల విచారించుభాగమే పూర్వభాగము. ప్రథమతంత్రమను శబ్దమున వ్యవహరింపబడుచు, జైమినీయ

78. Sri Sankaracharya of Karavira Peetha: Mukha Pratibimba Bhava Bodhini.

79. Prof. Sivadatta Sarma: Jaiminiya Nyayamala

మీమాంసయని ప్రసిద్ధిని ఆర్జించియున్నదని జైమినీయ న్యాయమాలా భూమికాకారుడు శివదత్తశర్మయు వచించియున్నాడు.



## మీమాంసా విధానము

ఆ విధముగ పూర్వమీమాంసాశాస్త్రము ప్రయుక్తమైన విషయ, సంశయ, పూర్వపక్ష, సిద్ధాంత, సంగతిరూప పంచవిధసోపానముల గర్మకాండను పరిశీలించుచు, 'మీమాంసకాంశబ్దతత్త్వమగ్రతానిధాయ, వైదికవాక్యానాం సోపపత్తికమర్థం నిర్ధారయితుమేవ శ్రుత్యనుకూలం తర్కం సమాశ్రయంతి'[80] మీమాంసాశాస్త్రము శబ్దతత్త్వమునకు ప్రాధాన్యతనొసంగి, వైదికవాక్యములకు ఉపపత్తికమైన అర్థ నిర్ధారణముసేయ శ్రుత్యనుకూల తర్కమును స్వీకరించి, న్యూనాధికభావేన పదార్థగ్రహణం పదార్థవిభాగః, పదార్థానా మంగాంగిభావకల్పనా, ప్రామాణ్య వివేచనం, అర్థనిర్ణయే చ మనోవిజ్ఞానాధిష్ఠితయోః సంకలన వికలన రూపయో రన్వయవ్యతిరేకయో సమాశ్రయ ఇతి పద్ధతి విజ్ఞానస్య సకలా అపి విశేషాః'[80] న్యూనాధికభావమున పదార్థగ్రహణము, పదార్థవిభాగము, వాని అంగాంగికల్ప

80. Sri Sankaracharya. of Karavira Peetha Mukha Pratibimba Bhava Bodhini

నము, ప్రమాణవిచారణ, అర్థనిర్ణయమున మనోవిజ్ఞానాధి ష్ఠానముల సంకలన వికలనరూప అన్వయ వ్యతిరేక విచారణ పద్ధతుల నన్నింటిని యుపయోగించుచు, ధర్మనిర్ణయమును మీమాంసాశాస్త్రము గావించుచున్నది. అందు చేతనే ఉత్తరమీమాంసా శాస్త్రము గూడ పూర్వతంత్ర వైదిక సిద్ధాంతముల స్వీకరించుచు, అందుగల తాత్త్విక విషయముల త్రోసిపుచ్చెను.

కాని ఆ శాస్త్రము పూర్వోక్తరీతిగ ఆకస్మికము కాదు. Some millenniums ago, sacrifices to different deities formed a very important part of the religious life of the cultured sections in India, and for a proper performance of them the Mimamsa was indispensable.[81] కొన్ని వేలవత్సరముల క్రిందట భారతదేశమున విజ్ఞసంఘముల పారమార్థిక జీవితములలో వివిధదేవతలకై యజ్ఞయాగాదుల సేయుట ముఖ్యముగా నుండెడిది. వానిని నిర్దుష్టముగ నిర్వర్తించుటకు మీమాంసాశాస్త్రము అత్యవసరముగా నుండెను. అందుచే The Mimamsa Sutra of Jaimini presupposes a long history of Vedic interpretation, since it sums up the general rules (Nyayas) which were in use. It describes the different sacrifices and their purposes, the theory of Apurva, as well as some philosophical propositions.[82] ఆకాలమున వ్యవహారములో

81 Swami Madhavananda, Mimamsa Paribhasha

82. Prof S. Radhakrishnan: Indian Philosophy Vol 2 p. 375

గల న్యాయములు క్రోడీకరించియున్నదిగాన, మీమాంసా సూత్రములు, సుదీర్ఘమైన వైదికనిర్వచనా చారిత్రమును సూచించుచున్నవి. వివిధయజ్ఞములను, వాని ఉద్దేశ్యములను, అపూర్వసిద్ధాంతమును, కొన్ని తాత్త్వికవిషయములను అది వివరించెను అని రాధాకృష్ణపండితుని వచనము. అజ్ఞానుల స్వాతంత్ర్య మభిలషించి, వారి నరకమునుండి ఉద్ధరించుటకొరకు 'పరమకారుణికో భగవాన్ జైమినిః తేషాం యథాధికారం వైదికకర్మకలాపప్రవృత్తిప్రవణత్వం సంపాదయిష్యన్ వేదప్రామాణ్యం వ్యవస్థాప్య ద్వాదశలక్షణ్యాతదర్థమధ్యవసాయయతే' [83] పరమకరుణాళువుఅయిన భగవాన్ జైమినిమహర్షి వారి యధికారానుసారము వైదికకర్మకలాపప్రవృత్తి నిర్మాణమును సంపాదింప తదర్థమగు ద్వాదశలక్షణోపేత వేదప్రామాణ్యమును సంస్థాపింప యత్నించెను అని రామేశ్వరసూరి తన సుబోధినీభూమికలో తెలిపియున్నాడు. అందుచే నది It is an inquiry into righteous action.[84] ధర్మమీమాంసయే యగుచున్నదని మాధవానందులు వచించిరి.



83. Pandit Rameswara Suri: Jaiminiya Sutravritti Subodhini
84. Swami Madhavananda. Mimamsa Paribhasha

అంతియగాక It may be true also, as some commentators maintain, that in real life the first step would have been to study the Purva Mimamsa or what is called Dharma Law or virtue etc. In that case the Mimamsa might be looked upon as one only, the Purva Mimamsa forming the first, the Uttara Mimamsa the second part[85] కొందరు వ్యాఖ్యాతలు భావించునట్లు యథార్థమగుజీవితములో ధర్మరూపమగు బూర్వమీమాంసా శాస్త్రపఠనమే ప్రథమసోపానము కావచ్చును. అట్లగుచో మీమాంసాశాస్త్రము ఏకమై పూర్వమీమాంస ప్రథమ భాగముగను ద్వితీయము ఉత్తరమీమాంసగను ఏర్పడునని Max Muller మాక్సుముల్లరు భావించెను. అది అసమంజసమనియు, అప్పుడు మీమాంసాదర్శనము అప్రధానమై యుండుననియు మరియు షడ్దర్శనప్రతీతికే లోపము వాటిల్లుననియు తేటతెల్లము. కాన మీమాంసాద్వయ మేకము కాక ప్రత్యేక వ్యక్తిత్వము విశిష్టత్వముగల శాస్త్రములని భావించుటే సముచితమని పండితాభిప్రాయము. మరియు బూర్వ ఉత్తర శబ్దముల దిలకించి, పూర్వమీమాంసకు ప్రాచీమీమాంసయనియు నామముండుటచే ఉత్తర మీమాంసకు అది ప్రాచీన మనుటయు లోపము. It really meant no more than the Purva Mimamsa having todo with the Karma Kanda, the first or work

85. Prof. F. Max Muller: The Six Systems of Indian Philosophy p. 141

part of the Veda comes first, and the other Uttara Mimamsa being concerned with the Jnana Kanda comes second[86] వేదమున ప్రథమభాగముగల కర్మ కాండకు సంబంధించిన దగుటచే పూర్వమీమాంస యనియు, అందు ద్వితీయభాగమునకు జెందిన జ్ఞానకాండాసంబంధము గాన రెండవది ఉత్తరమీమాంసయనియు ననుట సముచితము అని Max Mullerమాక్సుముల్లరు తీర్మానించెను. అనగా It is clear that while Badarayana endevoured to introduce order into the Upanishads, and to render various guesses to something like a system, Jaimini undertook to the same for the rest of the Veda the so-called Karma Kanda [86] ఉపనిషత్తులలో క్రమత్వము కలుగజేయుచు నొకసిద్ధాంతమునకు వివిధభావనల బాదరాయణుడు యత్నింప, జైమినియు నటులే కర్మకాండ నాబడు మిగిలిన వేదభాగమున యత్నించెననుట స్పష్టము. ఈ విషయమునే చర్చించుచు One of them, being based on the Vedas and the Brahmanas, is concerned with the practical side of Vedic religion, while the other represents a methodical development of the fundamental non-dualistic speculations of the Upanishads[87] వానిలో ఒకటి వేదబ్రాహ్మణములపై నాధారపడుచు, వైదిక జీవనముయొక్క అనుష్ఠానభాగమునకు జెందియుండ, రెండవది ఉపనిషత్తుల అద్వైతభావముల క్రమాభివృద్ధిని

86. Prof. F. Max Muller. The Six Systems of Indian Philosophy p 197

87. Dr. A. A. Macdonell: A History of Sanskrit Literature p. 385

సూచించునని Macdonell మాక్డొనెల్ స్పష్టపరచెను. While the Purva Mimamsa of Jaimini investigates the duties (ధర్మ) enjoyed by the Veda, together with the rewards attached thereto, the Uttara Mimamsa of Badarayana describes the philosophico-theological views of the Upanishads. Together, the two form a systematic investigation of the contents of the whole Veda [88] వేదమునకుగల ధర్మములను, వాని ఫలితములను జైమినీయ పూర్వమీమాంస పరిశీలింప, బాదరాయణుని ఉత్తరమీమాంస ఉపనిషత్తుల తాత్త్విక ధర్మభావముల వర్ణించును. ఈ రెండును సంపూర్ణ వేదవిషయముల క్రమ పరిశీలనము గావించును అని రాధాకృష్ణుడును వాక్రొనెను. Each system of philosophy is complete, and elaborated in its minutest details [89] ప్రతిసిద్ధాంత దర్శనము సమగ్రమై అతిసూక్ష్మవిషయములతోకూడ ప్రతిపాదింపబడియున్నదనుట కెట్టి సంశయమును లేదు.



## స్వర్గము

పై విధముగ మీమాంసాధర్మమును గ్రహించి, తదాచరణము సమగ్రలీల గావింపగలుగు ఫలితాంశముల నొకిం

88. Prof. S. Radhakrishnan. Indian Philosophy Vol. 2 p. 430
89. Prof. F. Max Muller: The Six Systems of Indian Philosophy p. 3

చుక జూతము. The disinterested performance of the obligatory rites, which is possible only through knowledge and self - control, gradually destroys the Karmas and brings about liberation after death.[90] జ్ఞాన సంయమనములతో సాధ్యమగు నైమిత్తికకర్మలను నిష్కామ్యత నాచరింప క్రమముగ కర్మలు నశించి, మరణా నంతరము ముక్తి చేకూరును. మీమాంసాశాస్త్రప్రకారము నిఃశ్రేయసమనగ, to have been the attainment of Heaven or a state in which there is unalloyed bliss. Heaven is regarded as the usual end of rituals[91] నిష్కళంకమగు సుఖముగల స్థానమైన స్వర్గమును పొందుటే యగును. కర్మకాండయొక్క పర్యవసానము స్వర్గముగా విశ్వసించును అని సతీశచంద్ర చటర్జీ వర్ణించును. అందుచే Liberation is then desirable not as a state of bliss, but as the total cessation of painful experience[92] ముక్తి నపేక్షించుట సుఖస్థితికొరకుగాక దుఃఖదమగు అనుభూతి నాశమునకే యని గ్రాహ్యము. It is a state where the soul remains in its or intrinsic nature beyond pleasure and pain[92] ఆత్మ

90. Prof. Satish Chandra Chatterjee: An Introduction to Indian Philosophy p. 52

91. Prof. Satish Chandra Chatterjee: An Introduction to Indian Philosophy p. 309

92. Prof. Satish Chandra Chatterjee: An Introduction to Indian Philosophy p. 390

తన స్వభావ స్వరూపమునుండి సుఖదుఃఖముల కతీతమై యుండుటయే ముక్తస్థితి యనియు సతీశచంద్రుని వివరణము.



## ఆత్మ

మీమాంసావిధానమున కర్మాచరణ గావించి, కర్మ కతీతమై మరణానంతరము ఆ సుఖస్వరూపమగు స్వర్గము ననుభవింప ఆత్మ యొక్కటి యుండవలయుననుటలో సంశయ మావంతయు లేదు. కాన The conception of soul in the Mimamsa is more or less like that of other realistic and pluralistic schools, as Nyaya-Vaiseshika. The Soul is an eternal, infinite substance [93] మీమాంసలో ఆత్మనిర్వచనము చాలవరకు సత్కార్య వాదులును, నానాత్మవాదులును అగు న్యాయ వైశేషికుల బోలియుండును. ఆత్మ నిత్యము అనంతమునగు ద్రవ్యము అని తెలియుదగును.



## ఈశ్వరుడు

ఇక మీమాంసాశాస్త్రమున ఈశ్వరునకు స్థానమేమి అనియుగూడ మనము విచారింపవలసియున్నది. The authoritativeness of the Vedic injunctions is derived

93. Prof. Satish Chandra Chatterjee: An Introduction to Indian Philosophy p. 383

from the fact that they deal with objects beyond the reach of experience of man or of the Devas. Hence there is no room for an Iswara in the Mimamsa system[94] దేవమానవుల కతీతమగు విషయము తెలుపును కావుననే వేదవాక్యములు ప్రామాణికము లగుచున్నవి. కావున మీమాంసాదర్శనమున ఈశ్వరునకు అవకాశము లేదయ్యెను అని V. T. శ్రీనివాసఅయ్యంగారు వ్రాసిరి. అనగా ప్రత్య క్షాది ప్రమాణ గోచరముకాక యొప్పారు విషయములే వేదవిషయమగుట ఈశ్వరాస్తికతా ప్రతిపాదనమునగాని వివరణమునగాని మీమాంసాశాస్త్రమునకు అవసరము లేక పోయెను. అందుచేత ఈశ్వర సంబంధ కర్మాచరణమున కాక The whole emphasis of the Mimamsa is on the machanical performance of rites, and it has no use for God as the author of the periodical manifestation and dissolution of the world, nor does it believe in Him[95] సదా యజ్ఞయాగాది కర్మాచరణముననే మీమాంసయొక్క సంపూర్ణ ప్రాధాన్యత గలదు. ప్రపంచ కాలాంతర సృష్టి ప్రళయకారకుడుగా ఈశ్వరుడు దానికి అవసరములేదు. అతనియందు దానికి విశ్వాసమును గూడ లేదు అని మాధవా నందులు అభిప్రాయపడిరి.

---

94. V. T. Srinivasa Iyengar: Outlines of Indian Philosophy p. 223
95. Swami Madhavananda. Mimamsa Paribhasha

పై విధానమున నీశ్వరుడే లేకున్నచో యీ సృష్టి యంతయు నెట్లు జరుగుచున్నది? కాని దానికి వారొకమార్గ మును ఆలోచించుకొని యున్నారు. Some Mimamsakas believe like the Vaiseshikas in the atomic theory. But the difference is that according to Mimamsa, atoms do not require, for their arrangements in the world, an efficient cause like God[96] పరమాణుసిద్ధాంతమును వైశేషికులవలె ప్రభాకరాది మీమాంసకులు కొందరు విశ్వ సింతురు. కాని కొంచెము వ్యత్యాసముగలదు. మీమాంస ననుసరించి ప్రపంచమున నణువుల పరస్పరానుసంధానము నకు ఈశ్వరునివంటి నిమిత్తకారణము అవసరములేదు. మరి ఎట్లు అనగా The autonomous law of Karma independently regulates the atoms to form the kind of world deserved by the souls[96] జీవుల కుచిత ప్రపంచ నిర్మాణమునకు బరమాణువులు స్వతంత్రముగా స్వాపేక్షిక మగు ధర్మసిద్ధాంతము నియమించునని సతీశచంద్ర చటర్జి తెలుపుచున్నాడు. మరియు గార్యకారణములు బీజాంకుర న్యాయమున శాశ్వతమైయుండుటచే వాని గల్పించుటకు సర్వజ్ఞుడగు సృష్టికర్త మీమాంసయందు అనవసర మయ్యెను. ప్రపంచనిర్మాణమునకు కర్మసిద్ధాంతమే చాలును. జీవులు భోగాయతనమగు శరీరమును ధరించి, భోగసాధన కుప

96. Prof. Satish Chandra Chatterjee: An Introduction to Indian Philosophy p. 381

యుక్తమగు ఇంద్రియాదులతో భోగవిషయముల ననుభ వించుటకు ఈశ్వరు డెందులకు? అని మీమాంసవాదము. అంతయు పూర్వవాసనాబలమున సృజింపబడుచుండును.

---

## వేదనిత్యత్వము

అదియునుగాక, మీమాంసాశాస్త్రమున కాధార మగు వేదముయొక్క నిత్యత్వమును, అపౌరుషేయత్వమును రక్షించుకొనుటకై ఈశ్వరు కలిమిని మీమాంసాశాస్త్రము ఖండించెను. The Mimamsa does not believe in a creator of the world. In its anxiety to secure the supreme place for the eternal Vedas, the Mimamsa could not believe in God whose authority would be superior to or atleast on a par with that of the Vedas[97] ప్రపంచమునకు సృష్టికర్తను మీమాంసాశాస్త్రము విశ్వ సింపదు. వేదమునకంటె అధికముగనో, కనీసము సమా నముగనో అధికారముగలిగియుండు ఈశ్వరునికిగాక నిత్యమైన వేదమునకు అధికతర స్థానమును సుస్థిరపరుచు ఆతురతతో మీమాంసా దర్శనము ఈశ్వరుని విశ్వసింపదు అనియు పండితాభిప్రాయము.

---

97. Prof. Satish Chandra Chatterjee: An Introduction to Indian Philosophy p. 387

కాని యజ్ఞయాగాది కర్మలలో మీమాంసికులు కొందరు దేవతల నారాధింతురు. అయినచో ఆదేవతల స్థానమెయ్యది అను సందేహము కలుగును. The different Vedic deities of course still form necessary parts of the sacrifices performed. Depending on this evidence one might say at last, that the Mimamsa believes in polytheism. But even such a view is rendered doubtful by the facts that these deities are not regarded as objects of worship, nor even believed to have any existence anywhere except in the Vedic hymns that describe them [98] యజ్ఞములలో అత్యవసర కరణములుగా వివిధమైన వైదిక దేవతలు కలుగుమాట సత్యమే. దీని ననుసరించి మీమాంసాశాస్త్రము బహుళ దేవతారాధన చేయునని తీర్మానింపరాదు. ఈ దేవతలు ఉపాస్యములుగా బరిగణింపబడకుండుటయు, వారిని వర్ణించు వైదికమంత్రములకు అన్యముగా వారి యునికినిగూడ విశ్వసింపకుండుటయు పూర్వభావమును నిష్ఫలమొనర్చునని సతీశచంద్రుడు వాకొనును. So polytheism of the ordinary kind cannot also be attributed to the Mimamsa without some qualification [98] అందుచే నొకప్రత్యేకత లేక మీమాంసా శాస్త్రమునకు బహుళ దేవతారాధన నన్వయింపజాలము. The deities of the Mimamsa are like immortal charac-

98. Prof. Satish Chandra Chatterjee · An Introduction to Indian Philosophy p. 391

ters of classical Epics; they do not belong to the space time world; they are not existing persons, but types [98] మీమాంసాశాస్త్రగత దేవతాగణము పురాణములలోని పురుషులవంటి నిత్యపాత్రలు, దేశకాలబద్ధ ప్రపంచమునకు వారు చెందరు. వారు సజీవవ్యక్తులుగాక ఆదర్శములు అనియు సతీశచంద్రుని అభిప్రాయము.

---

## మీ మాం సా నిం ద

పూర్వోక్తచందము మీమాంసాశాస్త్రము సర్వసృష్టిస్థితిలయకర్తయగు ఈశ్వరుని విశ్వసింపకుండుటయేగాక వైదికయజ్ఞాదుల సంబోధింపబడుచు హవిస్సులగైకొనుచుండు దేవతాగణమునుగూడ కేవలము యజ్ఞాంగములుగను ఉపకరణములుగను పరిగణించి తగు వ్యక్తిత్వమునుగూడ నొసంగకుండుటచే 'కాణాదపి కపిలాద్వైస్తు మునీంద్రైరపి కీర్తితం।మందబుద్ధ్యనుసారేణ కేవలం'. పరికీర్తితం కణాద కపిలాది మునీంద్రుల చే గీర్తింపబడియున్నను, ఆశాస్త్రములు కేవలము మందబుద్ధి ననుసరించియె చెప్పబడియున్నవి అనుసూతసంహితా వాక్యమురీతి అవైదికములుగా జెప్పబడిన వైశేషిక సాంఖ్యములతోసహా, ఈశ్వరప్రతిపాదన చేయలేదను నెపమున మీమాంసాదర్శనమునుగూడ నిరీశ్వరముగమాత్రమే

---

98. Prof. Satish Chandra Chatterjee: An Introduction to Indian Philosophy p. 391

పరిగణించక అవైదికముగ గూడ పద్మాదిపురాణములు చూడ జొచ్చెను. 'కణాదేన తు యత్ప్రోక్తం శాస్త్రం వైశేషికం మహత్ । గౌతమేన తథా న్యాయం సాంఖ్యం తు కపిలేన తు ॥ ద్విజన్మనా జైమినినా పూర్వం వేదమపార్థకం । శాస్త్రాణి చైవ గిరిజే తామసాని నిబోధమే ॥' అను వాక్యము కణాద గౌతమ కపిలకృత వైశేషికన్యాయసాంఖ్యములతో జైమినిచే నిర్మింపబడిన పూర్వమీమాంసయు అపార్థము గాన తామసములుగ బోధింపబడినదని వచింపబడెను. ఇది విపరీతమే యగును. అంతయు వైదికకర్మమీదనే ఆధారపడి వేదమును నిత్యమొనరించి, వేదరక్షణార్థమే ఈశ్వరుని బరిత్యజించిన మీమాంస నిష్ఫలశాస్త్రముగా బరిగణింపబడుట, ఆశ్చర్యమే. అట్లు ఈశ్వరు విశ్వసింపని శాస్త్రము నిరీశ్వరమే యగునుగదా! అందుచే One more point seems to require our attention, namely, the charge of atheism that has been brought against Jaimini's Mimamsa. This sounds very strange charge after what we have seen of the character of this philosophy, of its regard for the Veda...... [99] జైమినీయ మీమాంసాశాస్త్రమునకు నిరీశ్వరత్వదోషము కలుగుట మనము విచారింపవలయును. దాని తాత్త్విక సంస్థితి, దాని వేదవిశ్వాసముల దిలకించిన మనకు అది చాల ఆశ్చర్యమును కలుగజేయును. కుమారిలకాలముననే అది లోకాయతమతముగ వ్యవహరింపబడుచుండెనట.

మరియు వైదికకర్మకాండగల అగ్ని వరుణ ఇంద్రాది దేవతలు ప్రకృతిశక్తులగుటచే The old Vedic sages are looked upon with pity by western scholars, as according to the latter, the baby-like people had no idea of God and therefore had to personify as living Gods the inanimate powers of nature...... This commiseration on the part of western scholars is absolutely groundless...... The Vedic sages never personified Natural forces [100] ఈశ్వరభావన లేని శిశుతుల్యులగు వైదికఋషులు జడములగు ప్రకృతియొక్క శక్తులను మూర్తిమంతము గావింపవలసివచ్చినదని పాశ్చాత్య పండితులు కొందరు వైదికఋషీశ్వరుల 'పాపము' దలచిరి. కాని యీ అపవాదు సంపూర్తిగా నిరాధారము. వైదిక ఋషివర్యులు ప్రాకృతికశక్తుల మూర్తిమంతము గావింప లేదని రామకృష్ణానందస్వామి సమాధాన మొసంగెను. వైదిక దేవతాగణము ఒక్కొక్క ఆదర్శమును వ్యక్తము చేయునని గ్రాహ్యము.

## మీమాంస - తత్త్వశాస్త్రము

అట్లు పూర్వమీమాంసాదర్శన తాత్పర్యమును గ్రహింపజాలక కొందరు పండితులుగూడ అందు తాత్త్విక విషయప్రసంగము లేదనుకారణమున The twelve books

---

100. Swami Ramakrishnananda, Message of Eternal Wisdom p. 90

of Sutras give often the impression of not very effective compilation[101] పండ్రెండు అధ్యాయములుగల యీ సూత్రగ్రంథము సమర్థమైన రచనగాదని తోచునని భావించియున్నారు. కాని the Purva Mimamsa represents a very primitive need involving no great philosophical skill[101] ప్రాచీనకాలమున ప్రాథమికావసరములగూర్చి పూర్వమీమాంసము తెలుపునుగాన అందు గొప్ప తాత్త్వికనైపుణ్యము అవసరములేదనియు భావించిరి. కాని తాత్త్వికవిషయపరిశీలన, ప్రతిపాదనములు ఉత్తర మీమాంసా శాస్త్రవిషయములగుటచే The Sutras of Jaimini contain little of what we could consider philosophy[102] జైమిని సూత్రములలో తత్త్వజ్ఞానము యిసుమంతయు లేదని Macdonell మాక్డొనెల్ వ్రాసెను. But as its speculative side was intended to serve the purpose of rituals, it is neither comprehensive nor very convincing as a philosophy[103] కాని దాని విచారణాభాగము యజ్ఞకాండకే యుపయుక్తము గాన, తాత్త్వికముగ నది సమ్పూర్ణమును విశాలమును కాదు అని మాధవానందుని వాక్యము. ఈ విషయమునే విచారించి మీమాంసాతత్త్వమును వివరించుచు Jaimini's Sutras are of course highly disappointing, viewed at from the standpoint of the philosopher[104] తత్త్వజ్ఞునిదృష్ట్యా చూచినచో

---

101. Dr. A. B. Keith: A History of Sanskrit Literature p. 473

102. Dr. A. A. Macdonell: India's Past

103. Swami Madhavananda: Mimamsa Paribhasha

జైమినీసూత్రములు మిగుల ఆశాభంగమును గలుగజేయును. But we must remember that Jaimini does not contemplate the analysis of the universe from any special philosophic stand-point. Nor was it possible for him to do so, weighed as he was with an extra-ordinary load of ritual to be gone through, teeming with a crop of questions of exegesis, whose solutions did not require anything more than grammar and logic[104] కాని విశ్వమును ఏతాత్త్వికవిధానముననైన విచారణముసల్పు సంకల్పము జైమినికి లేదని మనము విస్మరించరాదు. సమాధానముల నిర్ణయింప వ్యాకరణన్యాయములకంటె నధికమవసరములేని అసంఖ్యాక ప్రశ్నాపరంపరలతో నిండియున్న అసాధారణ కర్మకాండాభారమును విచారింపవలసియున్న జైమిన్యాచార్యుడు, తత్త్వవిచారణముసేయ నవకాశముగూడ కానుపింపదు అని శ్రీనివాస అయ్యంగారు చక్కగా సమాధానమొసంగిరి.



## మీమాంసా - ధర్మశాస్త్రము

తత్త్వదృష్టికి మీమాంసాశాస్త్రము అసంపూర్ణమై యున్నను, కర్మాచరణ మీమాంసతోసహా అది అనేక సాంఘిక సమస్యల చర్చించి నిర్ణయించియున్నది. అందుచే మనుధర్మశాస్త్ర భాష్యకర్తయైన మేధాతిథికాలముననే

104. V. T. Srinivasa Iyangar: Out lines of Indian Philosophy p. 233

మీమాంసాశాస్త్రము ప్రశస్త ధర్మశాస్త్రమై విరాజిల్లి మానవప్రవర్తనమునుగూడ సంస్కరించుటయందు అసమాన ముగ నుపయుక్తమైయుండెను. ఈవిషయమును ప్రస్తావించుచు From Medhatithi onwards use is made of Mimamsa principles in deciding legal difficulties[105] మేధాతిథి కాలమునుండి మీమాంసాసిద్ధాంతములు వ్యావహారిక సమస్యలను నిర్ణయించుటకు నుపయోగింపబడుచుండెను అని Keith కీత్ అభిప్రాయము. అంతియగాక, The obligation of law to the Mimamsa extends to every department of the topic, and it not merely in matters of interpretation that the legal writers borrow matters from the Mimamsa, but they show repeatedly traces of influence by the positive doctrines of that school in their bearing on religious aspect of property and family rights[106] ధర్మశాస్త్రమునకు మీమాంసాశాస్త్రసంబంధము సర్వవిష యముల విస్తరించియున్నది. విషయనిర్వచన వివరణముల మాత్రమే ధర్మశాస్త్రజ్ఞులు మీమాంసాసహాయమును అపే క్షించుచుండుటగాక, మతవిషయికముగ ఆస్తి కుటుంబ అధికారములగూర్చి విషయముల నిర్ణయముల గూడ మీమాంసాశాస్త్రస్పర్శ ధర్మశాస్త్రజ్ఞులకు గలదనియు నాతడు స్పష్టపరచెను. అందుచేతనే 'ఆర్షం ధర్మోపదేశం చ వేదశాస్త్రావిరోధినా । యస్తర్కేణానుసంధత్తే స ధర్మం వేద నేతరః॥' (12.106) ధర్మపరిశీలన గావించునప్పుడు వేద

105. Dr. A. B. Keith. A History of Sanskrit Literature p. 473

106. Dr. A. B Keith Karma Mimamsa

శాస్త్రమునకు అవిరోధమైన తర్కమునే యుపయోగింప వలయుననియు, అట్లుకానిచో అది ధర్మము కాదనియు మనువు శాసించియున్నాడు. అనగా వేదవిహిత ధర్మప్రతిపాదనమునకు ఆనాటి సభలలో మీమాంసికవేత్త యొకడుండవలయుననియు నీమముగలదు.

మీమాంసాశాస్త్రముయొక్క పరిశీలనావిధానము గూడ మిగుల సంస్తవనీయము. Such an examination of the authority of human knowledge (ప్రమాణ) ought, of course, to form the introduction to every system of philosophy, and to have clearly seem, this is, as it seems to be, a very high distinction of Indian Philosophy[107] ప్రమాణాదులతో గూడిన పరిశీలనావిధానము ప్రతిదర్శనమునకు ప్రథమభాగమగుచుండుటచే, భారతీయతత్త్వశాస్త్రముయొక్క మహోన్నతవిశిష్టతను తెలుపుచున్నదని Max Muller మాక్సుముల్లరు నుతించియున్నాడు. అన్ని దర్శనములకంటె విశిష్టముగ నీపూర్వమీమాంసాదర్శనము వైదిక ధర్మముల విచారించుచుండుటచే నన్నింటికంటె నిది ప్రాచీనమయి యుండును. అట్టిశాస్త్రములో చర్చింపబడియున్న ప్రమాణాదిక విచారణాపద్ధతిదీనినుండియే యితరదర్శనములు స్వీకరించియుండనోపు. అందుచే నీ విధానమును భారతీయ సంస్కృతికి ప్రసాదించిన మీమాంసాశాస్త్రము దానికర్త జైమినియు వందనీయులు. ఆకారణమున అది ఒకభారతా

107. Prof. F. Max Muller: The Six Systems of Indian Philosophy xiii

వనిగల సర్వశాస్త్రముల నావరించి తన ప్రభావమును విజ్ఞానమును ధార్మికవ్యవస్థను అనుగ్రహించియుండుటయేగాక, The Greek Philosophy of Plato is included within the philosophy of the Mimamsakas, and a doctrine of sounds merely emperic on the lips of Europe finds reason and necessity, on those of India[108] ప్లేటోయొక్క గ్రీసుదేశపు తత్త్వజ్ఞానము మీమాంసికుల తత్త్వములో నంతర్గతము. యూరోపియనుల పెదవులగల శబ్దసిద్ధాంతము భారతీయ సిద్ధాంతముపై యుండుట సహేతుకము, ఆవశ్యకము అని వివేకానందస్వామి ఉచ్చరించియుండిరి.

---

## ప్రాభాకర - భాట్టవాదములు

ఈవిధమున సర్వతోముఖాభివృద్ధి గాంచియున్న మీమాంసాశాస్త్రమునకు ప్రథమ దర్శనకర్తయయిన జైమిన్యాచార్యుని తర్వాత విజ్ఞానవైభవసంపన్నుడగు ఉపవర్షాచార్యుని వృత్తియున్నను, దాని నాధారముగగొని రచితమై ప్రజ్ఞాశాలి శబరస్వామియొక్క భాష్యమున్నను, అంతవరకు సిద్ధాంతమున ఏవిధమైన భిన్నభావములు లేక వెలుగొందెను. గాని With Prabhakara and Kumarila there comes a sharp divergence in the unity of the teaching of the school, whose followers hence forth are divided [109]

---

108. Swami Vivekananda· The Life of Swami Vivekananda Vol.3 p.377

109. Dr. A. B. Keith : Karma Mimamsa p. 9

ప్రభాకర, కుమారిలులలో సిద్ధాంతమునగల ఏకత్వమునకు భంగమేర్పడి, వారి అనుయాయులతో విభజింపబడి పోయినది. ప్రభాకరమిశ్రుని భాష్యము సులభమై స్పష్టమై శబర భాష్యమువలె సందర్భము ననుసరించియుండ, In all these aspects Kumarila shows a richer, more vivid, and elaborated style, which is reminiscent of the Sariraka Bhashya of Sankara [109] వీని యన్నింటిలో కుమారిలుడు ఉత్కృష్టమును, సుస్పష్టమును, జటిలశైలియును గలిగి శంకరుని శారీరకభాష్యమును స్మరింపజేయునని Keith కీత్ అభిప్రాయము. Kumarilas' commentary is full of hair-splitting learning and acuteness [110] కుమారిలుని వ్యాఖ్యానము సునిశిత విద్యాపటిమము, సూక్ష్మత్వములతో నిండియున్నదని Mecdonell మాక్డొనెల్ ఉద్దేశించెను. ప్రభాకరమిశ్రులు 'బృహతి' యను భాష్యమును విరచింప, కుమారిలభట్టాచార్యులు శ్లోకవార్తిక (1.1. సూత్రము) తంత్రవార్తిక (1.2–3.0) టుప్టీక (4.0–12.0) లను రచించి మీమాంసాశాస్త్రమును మహాశాస్త్రముగ బరిణమింపజేసెను. ఇట్లు విభజింపబడిన యీరెండు మీమాంసా శాఖలకు వారికర్తల నామమున ప్రభాకరసిద్ధాంతమనియు, భాట్టమతమనియు ప్రతీతి ఏర్పడినది. ఈరెంటికిగల సిద్ధాంత వ్యత్యాసము సుసూక్ష్మము సునిశితముగనుండును. అయినను యించుక చూచెదముగాక.

---

109. Dr. A. B. Keith · Karma Mimamsa

110. Dr. A. A. Macdonell · India's Past

న్యాయదర్శనప్రోక్తమగు ప్రత్యక్షానుమానోపమాన శబ్దముల స్వీకరించి అందు అర్థాపత్తినిగూడ జేర్చి ప్రభాకరమిశ్రుడు స్వీకరింప, వానికి అనుపలబ్ధినిగూడ సంయుక్తమొనర్చి ప్రమాణషట్కముల కుమారిలుడు గైకొనెను.

మరియు వీరిరువురి భావభేదములు శబ్దప్రమాణమున గూడ ప్రసరించినవి. అస్పష్టమగు ధ్వని యనునదే లేదనియు సర్వశబ్దములు అక్షరరూపముననే యుండునని ప్రభాకరుడు విశ్వసించెను. అట్లే అక్షరపదములకుగూడ భేదము లేదనియు ననగా, పదము అక్షరములకు అన్యముగానుండదు గాన రెండు నొక్కటేయనియు నీతనివాదము. అక్షరసంపుటీ విధానమే పదముయొక్క రూపకల్పనము జేసి అర్థస్ఫురణము గావించును. పదమునగల అక్షరములు ప్రత్యేక ప్రత్యేకముగా మనస్సునకు దోచుచుండునుగాని, అవి వెంటవెంటనే స్ఫురించుచుండుటచేతను, ప్రతి అక్షరము తన సంస్కారమును కలిగించి అదృశ్యమగుచుండుటచేతను, పదమంతయు నొకేస్ఫురణముగా గోచరించును. అట్టి క్రమస్ఫురణము స్మృతిసహాయమున ఏకముగ గోచరించి పరమై అర్థమును గలుగజేయును. అట్లు అక్షరశక్తివలననే పదమునకు అర్థస్ఫురణశక్తి గలుగుటచే నాశక్తి యథార్థముగ బదములకు జెందినదిగాక అక్షరముల కన్వయమగుచున్నది. అక్షరములే ఇంద్రియసన్నికర్షను పొంది పదార్థగ్రహణము గావింప శక్తిగలిగియుండును. అందుచే ప్రభాకరు సిద్ధాంతము ప్రకారము శబ్దప్రమాణమునకు అక్షరము లాధారములు.

పదములు కేవలము అర్థమునుమాత్రము సూచించును అని తాత్పర్యము. మరియు నీపదములైనను స్వయంవ్యక్తములై అర్థస్ఫురణమును కల్పింపనేరక వాక్యసహాయమున నే గావించుననియు ప్రాభాకరము. అనగా వాక్యమున అను సంధింపబడియున్నప్పుడే పదములకు అర్థస్ఫురణశక్తి గలదు గాని వ్యక్తిగతముగ లేదు అని ప్రభాకరుల తాత్పర్యము. ఈ సిద్ధాంతమునే అన్వితాభిధానవాదము అని యందురు.

ఈ వాదమును కుమారిలుడు వ్యతిరేకించెను. ఇతడు ఎక్కువ నైయాయికము ననుసరించెను. ఇతని వాదము ప్రకారము పదములే స్వతఃసిద్ధములై అర్థస్ఫురణము గావించును. అట్లు అర్థస్ఫురణము గావించుటనే 'అభిధా' యందురు. పదముల అర్థము స్మృతిరూపమున గలుగక వాని అభిధా శక్తిచేతనే కలుగునని ఆ సిద్ధాంతభావము. అట్టి అభిధా యుతమైన పదములు వ్యాకరణసహాయమున వాక్యమై వాక్యార్థమును కలుగజేయుచున్నవి. అనగ పదములు వాక్యములనున్న కాలముల వాక్యార్థమును తెలుపుటయే గాక, తాము ప్రత్యేకముగగూడ అర్థయుక్తములని సిద్ధాంతము. ఈ కుమారిల సిద్ధాంతమునకు అభిహితాన్వయ వాదము అని యందురు.

పై విధానమున ప్రభాకర కుమారిలులు సుప్రశస్తముగ మీమాంసాదర్శన మీమాంస గావించి తత్ శాస్త్రమును అత్యంత విస్తరమొనర్చి సర్వతోముఖోపయుక్తము గావించి పండితలోకమున కాదర్శప్రాయులై యొప్పారిరి.

# మీమాంసాదర్శన విషయము

'ధర్మో ద్వాదశలక్షణ్యా వ్యుత్పాద్య స్తత్ర లక్షణైః। ప్రమాణభేదశేషత్వప్రయుక్తి క్రమసంజ్ఞకాః॥ అధికారోఽతిదేశశ్చ సామాన్యేన విశేషతః। ఊహో బాధశ్చ తంత్రం చ ప్రసంగశ్చోదితాః క్రమాత్॥'(న్యాయమాల 1.11,12) అనువిధాన ధర్మము ప్రమాణాది ద్వాదశలక్షణములు గలిగియున్నదని మాధవాచార్యుని నిర్వచనము. అందుచేత 'లక్షణాన్యధ్యాయాః ద్వాదశానాం లక్షణానాం సమాహారో ద్వాదశలక్షణే। తాదృశస్య ద్వాదశలక్షణోపేతస్య శాస్త్రస్య ధర్మో విషయాః' అనియు 'ప్రమాణాదయః ప్రసంగాంతా ద్వాదశపదార్థాః క్రమాద్ద్వాదశానామధ్యాయానాం విషయాః' ప్రమాణాది ప్రసంగాంతమువరకుగల ద్వాదశపదార్థములే క్రమముగా అధ్యాయవిషయములని మాధవాచార్యులు తెలిపియున్నాడు. 'ప్రథమాధ్యాయే - విధ్యర్థవాదాదిరూపం ప్రమాణం నిరూపితం' ప్రథమాధ్యాయమున విధి అర్థవాద మంత్ర స్మృతి నామధేయములు నిరూపింపబడినవి. 'ద్వితీయే-యాగదానాది కర్మభేదః' యాగ దానాది కర్మభేదములును, అపూర్వమును ద్వితీయాధ్యాయమున చర్చింపబడినవి. 'తృతీయే-ప్రయాజాదీనాం దర్శపూర్ణమాసాద్యర్థత్వేన తచ్ఛేషత్వం' తృతీయమున శ్రుతి, లింగ, వాక్య, ప్రతిపత్తి, కర్మ, అనారభ్యాధత, ప్రయాగములు పరిశీలింపబడియున్నవి. 'చతుర్థే - క్రమనియతి విధేయత్వాదయః' చతుర్థమున గుహూ రాజసూయములు ముచ్చటింప

బడినవి. 'పంచమే - వాజపేయః' పంచమాధ్యాయమున వాజపేయము మీమాంసింపబడియున్నది. 'షష్ఠే - కర్తురధికారో, నాంధాతేః ఇత్యాదయః' షష్ఠమమున అధికారి సామగ్రి సత్రములు చర్చింపబడినవి. 'సప్తమే-సమానీమతరచ్ఛ్యేనేన ఇత్యాది ప్రత్యక్షవచనేన, అగ్నిహోత్రాది నామ్నా ఽనుమితవచనేన చ సామాన్యతో ఽతిదేశః' సప్తమమున సామాన్యాఽతిదేశవిధానము ప్రస్తావింపబడినది. 'అష్టమే-సౌర్యం చరుం నిర్వపేత్ ఇత్యత్ర నిర్వాపస్తద్వితేన దేవతా నిర్దేశ ఏకదేవతాత్వమాషధద్రవ్యకత్వమితి లింగేనాగ్నేయపురోడాశేతి కర్తవ్యతైవ, నాన్యస్య ఇత్యేవమాదిర్విశేషతో ఽతిదేశః' ఎనిమిదవ అధ్యాయమున విశేషతోఽతిదేశము వివరింపబడియున్నది. 'నవమే-ప్రకృతౌ-'అగ్నయేజుష్టం నిర్వపామి' ఇతి పఠితే మంత్ర వికృతౌ సౌర్యచరావగ్నిపదపరిత్యాగేన సూర్యపదప్రక్షేపణే 'సూర్యాయ జుష్టం నిర్వపామి' ఇత్యేవ మాద్యూహః' నవమాధ్యాయము ఊహానుగూర్చి ప్రసంగించినది. 'దశమే-కృష్ణలేషు చోదకప్రాప్తస్యావఘాతస్య వితుషీకరణాసంభవేన లోప ఇత్యేవ మాదిర్బాధః' దశమమున గ్రహ సామబాధలు నిర్వచింపబడినవి. 'ఏకాదశే-బహూనామాగ్నేయాదీనాం ప్రధానానాం సకృదనుష్ఠా తేన ప్రయాజాద్యంగేనోపకార ఇతి తంత్రం' ఏకాదశమమున తంత్ర ఆవాపములు చర్చింపబడినవి. 'ద్వాదశే-ప్రధానస్య పశోరుపకారాయానుష్ఠా తేన ప్రయాజాద్యంగేన పశ్వంగ పురోడాశేఽ

ప్త్యుపకార ఇత్యాది ప్రసంగః' ప్రసంగ తంత్ర సముచ్చయములు ద్వాదశాధ్యాయమున వివరింపబడినవి. ఈ విషయముల దిలకించిన అంతయు యజ్ఞయాగాదికార్యముల నుపయుక్తమగు పారిభాషిక పదములతో సంయుక్తమై యున్నదని గ్రాహ్యము.



## మీమాంసా సూత్ర సంఖ్య

పైనుదాహరింపబడిన ద్వాదశాధ్యాయములు పునర్విభజన విషయానుక్రమణిక ననుసరించి పాదములుగా విభజింపబడియున్నవి. ప్రథమాధ్యాయము నాలుగు పాదములుగను, ద్వితీయము పాదచతుష్టయముగను, తృతీయము అష్టపాదములుగను, చతుర్థము నాలుగు పాదములుగను, పంచమాధ్యాయము నాలుగు పాదములుగను, షష్టము ఎనిమిది పాదములుగను, సప్తమాధ్యాయము నాలుగుపాదములుగను, అష్టమాధ్యాయము పాదచతుష్టయముగను, నవమాధ్యాయముగూడ నాలుగు పాదములుగను, దశమము అష్టపాదములుగను, ఏకాదశాధ్యాయము నాలుగుపాదములుగను, అటులే ద్వాదశముగూడ పాదచతుష్టయముగ విభజింపబడి మొత్తమునకు 60 పాదములు గలిగి అలరారుచున్నది.

'విషయో విషయశ్చైవ పూర్వపక్షస్తథోత్తరం।
నిర్ణయశ్చేతి పంచాంగం శాస్త్రేఽధికరణం విదుః॥' విషయ, సంశయ, పూర్వపక్ష, సమాధాన, నిర్ణయములను పంచాంగ సంశోభితమైనదే అధికరణమని శాస్త్రాభిప్రాయమన్నటుల మరల నీ అరువది పాదములు విషయము ననుసరించి అధికరణములుగా విభజ్యము. అందు ప్రథమాధ్యాయమున 42, ద్వితీయమున 47, తృతీయమున 157, చతుర్థమున 62, పంచమమున 54, షష్టమమున 109, సప్తమమున 23, అష్టమమున 35, నవమమున 67, దశమమున 179, ఏకాదశమమున 64, ద్వాదశమమున 68 అధికరణములుండి మొత్తమునకు 907 అధికరణములు ద్వాదశాధ్యాయముల గలవు.

'సంజ్ఞా చ పరిభాషా చ విధిర్నియమ ఏవ చ । అతిదేశోఽధికారశ్చ షడ్విధం సూత్రలక్షణం॥' (పాణిని) సంజ్ఞ, పరిభాష, విధి, నియమ, అతిదేశ, అధికారములను షడ్విధరూపమునగల సూత్రములు ద్వాదశాధ్యాయముల నొక పరిగణనము ననుసరించి 2644 గలవు. అవి మొదటి అధ్యాయమున 150, రెండవదాన 139, మూడవదానిలో 368, నాలుగవఅధ్యాయమున 159, అయిదవదానిలో 128, ఆరవదానియందు 348, ఏడవదానిలో 100, ఎనిమిదవ అధ్యాయమున 139, తొమ్మిదవదానిలో 122, పదియవదాన 645, పదునొకండవదానియందు 177, పండ్రెండవ అధ్యాయమున 168 గ ప్రసరించియున్నవి రామేశ్వరసూరి సుబోధినీ పరిగణనము ననుసరించి సూత్రసంఖ్య 2727 యగుచున్నది.

అతని లెక్కలో 1–148, 2–129, 3–360, 4–156, 5–131, 6–362. 7–99, 8–140, 9–228, 10–570, 11–246, 12–168 సూత్రములుగ తేలుచున్నవి. న్యాయమాలా భూమికా కర్త శివదత్తశర్మకు 2745 సూత్రములు లెక్కకు వచ్చుచున్నవి. కర్మమీమాంసాగ్రంథకర్తయగు A. B. Keith కీత్ పండితుని పరిగణనము వీనికి వ్యత్యస్తముగనున్నది. అందు 915 అధికరణములు, 2652 సూత్రములు గోచరము. మరొక లెక్క ప్రకారము 2742కూడ గలవని అతడే వచించి యున్నాడు.

---

## నామ తాత్పర్యము

కౌషీతకమున మీమాంసాశబ్దము గోచరించును. The term Mimamsa occurs as the designation of a discussion on some points of ritual practice[111] యాజ్ఞికానుష్ఠానవిషయమున చర్చను సూచించుచు యిచట మీమాంసాపద ముపయుక్తము అని A. B. Keith కీత్ యొక్క అర్థము. Etymologically, the word Mimamsa means solution of some problem by critical examination of grounds[112] వ్యుత్పత్త్యర్థము ననుసరించి మీమాంస యనగ, ఒక సమస్యను సాధారణముగ పరీక్షించి తీర్మానిం

---

111. Dr. A. B. Keith: Karma Mimamsa

112. Prof. Satish Chandra Chatterjee· An Introduction to Indian Philosophy. p. 362

చుటయని సతీశచంద్ర చటర్జీ యభిప్రాయము. మీమాంస యనుటయేగాక దీనికి పూర్వమీమాంసయనియు వ్యవహారము. వేదమున పూర్వభాగమైన కర్మకు సంబంధించి అందుగల అసంఖ్యాక సమస్యల నివారించు శాస్త్రమగుటచే దీనికి పూర్వమీమాంసయనియు ప్రాచీమీమాంసయనియు నామము. అనగా జ్ఞానకాండకు పూర్వమని యర్థము. The Purva Mimamsa is so called because it is earlier (Purva) than Uttara Mimamsa, not so much in chronological as in the logical sense. Its central problem is ritual, even as that of Uttara Mimamsa is knowledge of the truth of things[113] కాలమానమునకాక, యౌక్తిక దృష్టికి అది ఉత్తరమీమాంసకంటె బూర్వమగుటచే అది పూర్వమీమాంస యనబడినది. విషయముల యథార్థ జ్ఞానము ఉత్తరమీమాంసకెటుల ముఖ్యవిషయమో అటులే పూర్వమీమాంసకు కర్మకాండసమస్యలు ముఖ్యము. కర్మకాండయే దాని ప్రధాన విమర్శనాంశమగుటచే దీనిని కర్మమీమాంసయు ననిగూడ పిలుతురు.

పూర్వదర్శనములనువలెనే దీనిగూడ దర్శనమనియు, తంత్రమనియు, శాస్త్రమనియు వ్యవహరించెదరు. ఈపదము లన్నియు జైమినీమహర్షిప్రోక్త దర్శనమునకే అన్వయమని గ్రాహ్యము.



113. Prof. S. Radhakrishnan. Indian Philosophy Vol 2 p. 375

# మీమాంసా తాత్పర్య సంగ్రహము

## ధర్మ నిర్వచన

'అథాతో ధర్మజిజ్ఞాసా' (పూ. మీ. సూ. 1.1.1) సాంగోధ్యయనానంతరము అధ్యయనము గావింపబడి వేదము యొక్క ధర్మజిజ్ఞాస కలుగుటచేత, ధర్మజ్ఞానేచ్ఛాప్రయుక్త విచార ముపయుక్తము అనుచు జైమిన్యాచార్యుడు, 'ధరతీతి ధర్మః' ధరించునది ధర్మము అనియు, 'ధరతి విశ్వం ధర్మః' విశ్వమును ధరించునది ధర్మము అనియు, 'ధ్రియతే జనైరితి ధర్మః' జనులచే ధరింపబడునది ధర్మమనియు నిర్వచింపబడినదియని ధర్మపరీక్షా ప్రారంభమును ప్రథమసూత్రముననే గావించియున్నాడు. అనగా 'చోదనాలక్షణోఽర్థో ధర్మః' (పూ. మీ. సూ. 1.1.2) అని ఆచార్యుడే ద్వితీయ సూత్రమున ధర్మనిర్వచన గావించిన చందము. విధివాక్యమును దానివలన ప్రతిపాదింపబడుచు తెలియబడుచున్న స్వర్గాది సంతృప్తియు, దానికి సాధన భూతమగు అగ్నిహోత్రాది అనుష్ఠేయ మార్గముల విచారించుటయే ధర్మమనియు నిర్వచనచేయుచు, తనచే నిర్మింపబడుచున్న మీమాంసా దర్శనోద్దేశ్యమును ఆచార్యుడు సుస్పష్టము గావించియున్నాడు. అనగా సంపూర్తి వేదాధ్యయనము గావించి, తదనుగుణ విధివిహిత యజ్ఞయాగాదిక కర్మప్రవృత్తి నొందుచున్న కర్మనిరతుని అసంఖ్యాక సంశయ విచ్ఛేదనమునకై యీ శాస్త్రము ప్రవృత్తము అని తేట

తెల్లము. అందుచే ఈ శాస్త్రమునకు పూర్వాపరముల నిరువైపుల వేదమే ఆధారముగనున్నది. అందుచేతనే 'తస్య నిమిత్తపరీష్టిః' (పూ. మీ. సూ. 1.1.3) అట్టి ధర్మముయొక్క ప్రమాణపరీక్ష గావింపబడునని ప్రస్తావించి, 'సత్సంప్రయోగే పురుషస్యేంద్రియాణాం బుద్ధిజన్మ తత్ప్రత్యక్ష మనిమిత్తం విద్యమానోపలంబనత్వాత్' (పూ. మీ. సూ. 1.1.4) సూత్రార్థమున చక్షురాదీంద్రియములద్వారా రూపరసాదిక అర్థములచే సన్నికర్షమేర్పడగా పురుషునకు జ్ఞానమేర్పడుచున్నది. అట్టి ప్రత్యక్షజ్ఞానము ధర్మనిరూపణమున అప్రమాణము. ఎందుచేనన, ప్రత్యక్షాదులు వర్తమాన విషయముల యుపయుక్తములేగాని, ధర్మమువలె భవిష్యద్విషయముల ప్రసరింపనేరవు అనుచు, ధర్మసంస్థాపనా కార్యమున, ప్రత్యక్షాది ప్రమాణముల ననుపయుక్తముగా దీర్మానించి, అయిదవ సూత్రమున శబ్దార్థ సంబంధము నిత్యమనియు, అగ్నిహోత్రాది ధర్మములు కారకములుగాక జ్ఞాపకములై విధివిహితములనియు, అనగా ఆదేశములనియు వాకొనుచు, అది అవ్యభిచారమనియు, కాన 'తత్ప్రమాణం బాదరాయణస్యానపేక్షత్వాత్' (పూ. మీ. సూ. 1.1.5) అదియే ప్రమాణమని బాదరాయణుని భావమనియు, అది అనపేక్షితమనియు బాదరాయణ సహాయమున జైమిన్యాచార్యుడు శ్రుతిప్రామాణ్య ప్రాధాన్యతను నిర్ణయించెను. అట్లగుచో వేదమనబడు దాని ప్రాముఖ్యతను గూర్చియు నొకింత చూచెదముగాక.

## శ్రుతి

'ధర్మ బ్రహ్మ ప్రతిపాదకం అపౌరుషేయం స్వతః ప్రమాణవాక్యం వేదః। ఇష్టప్రాప్తి అనిష్టపరిహారయోః అలౌకికం ఉపాయం యో గ్రంథో వేదయతి స వేదః। స హి అజ్ఞాతార్థ జ్ఞాపకః' ధర్మమును బ్రహ్మమును ప్రతిపాదించు నదియు, అపౌరుషేయమై స్వతఃప్రమాణమైనదే వేదము. ఇష్టప్రాప్తిని అనిష్టపరిహారముల అలౌకికోపాయములద్వారా ఏగ్రంథము తెలుపునో అది వేదము. అది అజ్ఞాతార్థముల స్ఫురింపజేయును అని వేదమన సక్రమ నిర్వచనము. అట్టి అసామాన్య పావనత్వము గలిగి ఇష్టార్థసిద్ధిని గలుగజేయుచు అనిష్టముల పారద్రోలుచు, లౌకికజీవనమున కుపయుక్తమగు ధర్మమును, మోక్షప్రాప్తి కుపయుక్తమగు బ్రహ్మజ్ఞానమును ప్రసాదించు వేదమాత నర్చింపనివాడు అజ్ఞుడగును. అట్టి యిహపరార్థ ప్రదాత్రియగు వేదము నెవడు గ్రహించునో వాడు అదృష్టవంతుడు. అందుచేతనే, 'వేదశాస్త్రార్థ తత్త్వజ్ఞో యత్ర తత్రాశ్రమే వసన్। ఇహైవలోకే తిష్ఠన్ స బ్రహ్మభూయాయ కల్పతే॥' (12-102) వేదార్థజ్ఞాని ఏ యాశ్రమంబున నున్నను, యీ లోకముననే యుండుచు మోక్షమును బొందుచున్నాడు అనుచు మనువు వేదజ్ఞానమును తద్విజ్ఞానిని స్తుతించుచున్నాడు.



## వేదప్రశస్తి

The Vedas are the scriptures of the Hindus, to whatever sect or denomination they may belong. They are the earliest extent religious literature to-day, and form the corner stone of the Indo-Aryan cultural edifice[114] ఏసిద్ధాంతము ఏశాఖకు చెందియున్నను, భారతీయులందరికి వేదమే ప్రమాణగ్రంథము. ఆవేదములు సర్వ మతగ్రంథ ములకంటె అతి ప్రాచీనములు. అవి ఆర్యుల వైజ్ఞానిక సౌధమునకు పునాదులు అని వీరేశ్వరానందస్వామి తెలిపి యున్నాడు. వేదప్రశస్తిని గొనియాడుచు, Whatever the Vedas may be called, they are to us unique and priceless guides in opening our eyes to tombs of thought richer in relics than the royal tombs of Egypt[115] వేదముల నెట్లు పచించినను, అవి ఈజిప్టుదేశమునగల చక్రవర్తుల సమాధులకంటె అమూల్యములైన వైజ్ఞానిక చిహ్నములుగ రూపొందుటచే మనకు కనువిప్పు గలుగజేయ నమూల్యము లును, అద్భుతమును అగు ఆదర్శములని Max Muller మాక్సుముల్లరు తన షడ్దర్శనగ్రంథమున వర్ణించియున్నాడు. అట్లే ఋగ్వేదమంత్రముల గవేషణము సల్పిన Ralph T. H. Griffith రాల్ఫ్ టి. హెచ్. గ్రిఫిత్ తన ఋగ్వేదగ్రంథమున What can be more tedious than the Veda, and yet what can be more interesting, if once we know that it is the first word spoken by the Aryan Man[116] వేదముకంటె

114. Swami Veereswarananda : Brahma Sutras I

115. Prof. F. Max Muller: The Six Systems of Indian Philosophy P. 34

116. Ralph T. H. Griffith : The Hymns of Rig Veda

ఎక్కువ విసుగు గలుగజేయునదెద్ది! అయినను, ఆర్యునిచేత ప్రథమతః వచింపబడిన దానినిగా మనము గ్రహించినచో నది ఎంత ఉత్సాహకరము! అని వచించియున్నాడు. వేదము కేవలమాశ్చర్యమును ఉత్సాహకరము మాత్రమే గాక దానికి మానవలోకమున ఆధ్యాత్మిక స్థానముగూడ కలదని వక్కాణించుచు Such Monuments as Rig-Veda, the Upanishads and the teachings of the philosophers of the way, are by far the highest spiritual achievements of humanity[117] ఋగ్వేదము ఉపనిషత్తులు తర్వాతి తత్త్వవేత్తలయొక్క యుపదేశములు, మానవలోకమునకే అత్యున్నత ఆధ్యాత్మిక మహత్కార్యములని A. Labanov Roslovsky ఎ. లెబనావ్ రోస్లోవస్కీ అను రష్యా పండితుడు The Revolt of Asia 'ఆసియా విప్లవము' అను గ్రంథమున వేదముల నుతించి యున్నాడు. ప్రపంచమునగల ప్రాచీన విజ్ఞానచిహ్నముల సేకరించి, వరుసగా జేర్చినచో The first place in that long row of books which contain the records of the Aryan branch of mankind, will belong for ever to Rig-Veda[118] మానవులలో ఆర్యశాఖకు జెందిన ఆగ్రంథపంక్తిలో ఋగ్వేదమునకు ప్రథమస్థానము శాశ్వతము అని Griffith గ్రిఫిత్ పండితుని వాక్యము. రచనాప్రాచీనత్వమేగాక, The Rig-Veda is not a book, but rather a library and literature the collected remains of many

117. A Labanov Roslovsky · The Revolt of Asia

118. Dr. Ralph, T, H, Griffith · The Hymns of Rig-Veda

centuries[119] ఋగ్వేదము గ్రంథముకాదు. కాని అది అనేక శతాబ్దముల వైజ్ఞానిక విషయసంపుటీ రూపమున ఒక గ్రంథాలయము, ఒక సాహిత్యము అని దాని సర్వ విజ్ఞానస్వరూపమును E. Vernor Arnold ఇ. వెర్నర్ ఆర్నాల్డు వర్ణించియున్నాడు. సర్వతోముఖ రూపమైన యీవేదము కేవలము భారతీయ వైజ్ఞానిక వాహినినే ప్రదర్శించుటలో దృష్టిగాంచక, సర్వప్రాపంచిక వ్యావహారికాధ్యాత్మిక సాహితీ సంస్కృతి యొక్క నిగూఢ రహస్యములను వ్యక్తముచేయుచు నన్నింటికి తానే ఆధారమనుచు ప్రస్ఫుటపరచుచున్నది. ఆ విషయమును విశదీకరించుచు, The great interest of the Rig-Veda is in fact, historical rather than poetical. As in its original language we see the roots and shoots of the languages of Greek and Latin, of Kelt, Teuton, and Solovomian, so the deities, the myths and the religious beliefs and practices of the Veda throw a flood of light upon the religions of all European countries before the introduction of Christianity[120] ఋగ్వేదముయొక్క అద్భుతము కేవలము కథనమునగాక చారిత్రకము. దానియొక్క సహజభాషలో గ్రీకు, లాటిన్, కెల్టు, ట్యూటన్ సోలోవోమియభాషల వ్యుత్పత్తులు రూపములును అందు మనము గాంచగలము. అందుచే క్రైస్తవము ప్రవేశపరుపబడకపూర్వము యూరపు ఖండపు దేశముల మతములగూర్చి వేదముయొక్క దేవతలు,

---

119. E. Vernor Arnold · Popular Studies in Mythology and Folk-lore
120. Dr. Ralph. T. H Griffith The Hymns of the Rig Veda

త్మిక ప్రభావమును వివరించుచు, నుతించుచు ఆనందించి యున్నాడు.

---

## వేదము – వ్యాసుడు

అట్టి సుప్రశస్తమును సర్వవైజ్ఞానికఘనియు, సర్వతోముఖమును అగు వేదము అమానుషమై మానవులకు అధ్యయనాతీతముగ నుండ గమనించి, 'వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్రమకల్మషం । పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిం॥' అని సాంప్రదాయికముగ స్తుతింపబడు సాత్యవతేయుడు వ్యాసభగవానుడు మానవకోటిపై గరుణజనింప 'ద్వాపరే ద్వాపరే విష్ణుర్వ్యాసరూపే మహామునే। వేదమేకం బహుధా కురుతే జగతో హితః॥' (విష్ణుపురాణ) అను నార్షోక్తి ననుసరించి జగత్తుయొక్క హితమునాశించి ఏకరూపమునున్న వేదమును బహుధాకృత మొనరించెను. ఏకరూపముననుండిన వేదమును 'ఋగ్వేదాదిభేదేన చతుర్ధా వ్యస్తా వేదాః' (విష్ణుసహస్రనామభాష్య) అనురీతి ఋగ్యజుస్సామాథర్వణముగ నాలుగువిధముల విభజించి వానిని పైల వైశంపాయన జైమిని సుమంతులకు క్రమముగా వ్యాసభగవాను డధ్యయనంబు గావింపంజేసెను. మరల యజుర్వేదము శుక్ల, కృష్ణభేదమున ద్వివిధము. శుక్లయజుర్వేదము కాణ్వ, మాధ్యందినశాఖలమూలమున ముఖ్యముగ రెండుభాగములు గలిగియున్నది. శుక్ల యజుర్వేదమును

యాజ్ఞవల్క్యమహర్షి అశ్వరూపమున నరుదెంచిన భాస్కరు నుండి గ్రహించియుండుటచే వాజసనేయసంహిత యనియు నందురు.



## వేదము-అపౌరుషేయము

వేదము, పూర్వోక్తవిధముగ మీమాంసాద్వయము నకు మూలాధారమైయున్నది. బృహదారణ్యక వాక్యము ననుసరించి, యీ వేదాదులు ప్రథమతః ఈశ్వరునుండి ఆవిర్భవించినవని ప్రమాణము. అందుచేత 'నియతరచనావతో విద్యమానస్యైవ వేదస్యాభివ్యక్తిః పురుషనిశ్వాసవన్న చ పురుషబుద్ధిప్రయత్నపూర్వకః, అతః ప్రమాణం నిరపేక్షస్వార్థే। తస్మాద్యత్తేనోక్తం తత్తథైవ ప్రతిపత్తవ్యం ఆత్మనః శ్రేయఇచ్ఛాదిభిర్జ్ఞానం వా కర్మవేతి' (బృ.భా. 2.4.10) అతనియొక్క పురుషబుద్ధిప్రయత్నాపేక్ష లేకయే నిశ్వాసముచందము నిత్యమై నియతరచనముగల వేదము అవతరించెను. అందుచే నవి పరప్రమాణాపేక్ష లేని స్వతః ప్రమాణములై అర్థము నొసంగుచున్నవి. అందుచే ఆత్మ శ్రేయస్సు నభిలషించువారు కర్మ జ్ఞానముల వేదప్రామాణ్యము ను యథాతథముగా స్వీకరింపవలయునని శ్రీశంకరులు స్పష్టపరచిరి. మరియు 'తస్మాత్ వేదప్రామాణ్యస్యావ్యభిచారాత్తాదర్థ్యే సతి వాక్యస్య తథాత్వం స్యాత్ న తు

పురుషమతికౌశలం' (బృ. భా. 3.3.1) అందుచే వేద ప్రామాణ్యము అకుంఠితము. పురుషుని బుద్ధికౌశలము ననుస రించికాక వేదవాక్యముల యర్థమును అట్లే గ్రైకొనవలె ననియు శంకరుల వాదము. 'శ్రుతే తు తాదర్థే వాక్యస్య ప్రమాణాంతరస్య ఆభాసత్వం' (బృ. భా. 3.3.1) శ్రుత్య ర్థముగల వాక్యార్థమునకు ప్రమాణాంతరములు ఆభాసలే యగును. అనగ శ్రుతియర్థమును వ్యక్తపరచు వాక్యముల ప్రత్యక్షాదిప్రమాణముల బరిశీలించుట వ్యర్థము అని తాత్ప ర్యము. వేదమునకు అట్టి ప్రాధాన్యతకలుగుటకు గారణ మును వివరించుచు, 'సర్వోవాయం వేదః ప్రత్యక్షాను మానాభ్యాం అనవగతేషా నిష్టప్రాప్తి పరిహారోపాయ ప్రకాశనపరః సర్వపురుషాణాం నిసర్గత ఏవ తత్ప్రాప్తిపరిహా రయోరిష్టత్వాత్' (బృ. భా ......1.) ప్రత్యక్షాదిప్రమా ణములకు అవగతముకాని ఇష్టప్రాప్తి అనిష్టాపరిహారముల సర్వమానవులు ఆశించుటచే వానిని వివరించుటకు వేదము ప్రవృత్తమగుచున్నదనియు శంకరులు సమాధాన మొసంగి యుండిరి.

అట్టి వేదప్రామాణ్యమును వేదాంతులవలె మీమాం సకులు శిరసావహించియున్నను యిసుమంత తారతమ్యము గలదు, అది చాల ప్రధానమైనది. కర్మకాండయం దుప యుక్త మంత్రార్థముల సమన్వయపరచి యొక్క సమరస విధానమును సూచింప మీమాంసాదర్శన తాత్పర్యమగు టచే, గర్మమార్గమునకే ప్రాధాన్యతనొసంగి ఆయాకర్మల

వలన గలుగు ఫలితములకుగూడ విశేష ప్రాధాన్యతను జైమిని ప్రాపిలజేసెను. అందుచే వేదమున అధికభాగము కర్మకే విశిష్టత నొసంగుచుండుటచేత వేదముయొక్క స్వతః ప్రామాణ్యాన్ను ప్రతిపాదింప మీమాంసికులకు ముఖ్య మయ్యెను. అట్లగుటచే The Mimamsa even holds that as the sole use of the Vedas lies in directing rituals, any part of them which does not contain such direction, but gives information about the existence of anything is useless unless it can be shown atleast to serve the purpose of persuading persons to follow the injunctions for performing rituals[121] కర్మల నియమించుటయందే వేదముయొక్క ముఖ్య ప్రయోజనమనియు, అట్టి నియమము లేక కేవల మొకవిషయముయొక్క యునికినిమాత్రము తెలుపు వేదభాగము నిరర్థకమనియు, అట్లుకాక, ఆవాక్యము పురుషులందు గర్మనిరతి గలుగజేయుటకై యుద్దేశింపబడి నట్లు వ్యక్తపరుపబడవలయుననియు మీమాంసాశాస్త్రము భావించును. అందుచే బ్రహ్మప్రతిపాదక వాక్యములు మీమాంసికదృష్టిలో నిష్ప్రయోజకము లగుటయేగాక, వేదము ఈశ్వరవాక్యమని సర్వేతర సిద్ధాంతులు సమ్మతించి యుండ, But the Mimamsa which does not believe in any Creator or Destroyer of the world, believes that the Vedas, like the world, are eternal. They are not the work of any person human or divine[121] విశ్వమునకు

121 Prof Satish Chandra Chaterjee. An Introduction to Indian Philosophy p. 399

సృష్టి ప్రళయకర్తను స్వీకరింపని మీమాంసాశాస్త్రము ప్రపంచమువలెనే వేదముగూడ నిత్యము అని విశ్వసించును. వేదము మానవునిచేగాని దేవునిచేగాని నిర్మితముకాదని నమ్మును. అందుచే వేదము పురుషకల్పితముగాక శాశ్వతము అని మీమాంసాతాత్పర్యము. According to the Mimamsa the Vedas are eternal, being only revealed to certain rishis or seers. As such they are free from human defects and their authority is unquestionable[122] ఋషీశ్వరులకు శ్రుతమగుటచే వేదములు శాశ్వతములు. వానిలో మానవసంబంధ దోషములు అభావముగాన అవి స్వప్రమాణములు. అంతియగాక, The Mimamsa goes so far as to say that even words are eternal and their meaning fixed [122] పదములు నిత్యములు దాని అర్థములు స్థిరము లని యనునంతవరకు మీమాంసము వెనుదీయలేదు అని మాధవానందస్వామి వక్కాణించెను.

## శబ్దనిత్యత్వము

శబ్దనిత్యత్వవాదము ప్రతిపాదన యథార్థమున సాహసకార్యమే. ప్రాగభావ ప్రధ్వంసాభావములతో గూడి యున్న శబ్ద మెట్లు నిత్యమగునను సంశయము ఎల్లరకు బొడ గట్టుట సామాన్యమే. కాని శబ్దనిత్యత్వవాదములోనే

122. Swami Madhavananda: Mimamsa Paribhsha

మీమాంసాశాస్త్ర ప్రాశస్త్యముగూడ స్పష్టము. ఈశబ్ద నిత్యత్వ ప్రతిపాదనమునకు జైమిన్యాచార్యులు 1.1.6 నుండి 11 వరకు పూర్వపక్షసూత్రముల సూచించి 1.1.12 నుండి 23 వరకు సిద్ధాంతసూత్రముల నిర్మించెను. వాని తాత్పర్యము నొకించుక చూచెదముగాక.

'కర్మైకే తత్ర దర్శనాత్' (1.1.6) శబ్దము కృతకము గాన అనిత్యమని కణాదవాదము. శబ్దోచ్చారణమున ప్రయత్నాదులు గోచరముగదా అని అర్థము. అంతియగాక 'అస్థానాత్' (1.1.7) ఉచ్చరింపబడిన శబ్దము ముహూర్త మాత్రము ఉపలబ్ధము. పిమ్మట అదృశ్యముగాన అనిత్యమే గదా. 'కరోతిది శబ్దాత్' (1.1.8) శబ్దముచేయుము, శబ్దము చేయకుము అను వ్యవహారముండుటచే గర్మాపేక్షికమైన ఘటాదికమువోలె శబ్దము అనిత్యము. 'సత్త్వాంతరే చ యౌగపద్యాత్' (1.1.9) ఏకకాలమున, అనేక వక్త్రములచే నుచ్చరింపబడు శబ్దము, స్థానాంతరములనున్న యనేకులకు గోచరించుటవలన నది అనిత్యము. అనగా ఉచ్చరింపబడిన శబ్దము ఏకకాలమున ననేకులకు శ్రుతమగుటచే నది ఏకముగాక సావయవి యగుచున్నది. అందుచే నది అనిత్యమని భావము. మరియు 'ప్రకృతివికృత్యోశ్చ' (1.1.10) శబ్దము ప్రకృతివికృతి బద్ధము. సంధి సంబంధమున శబ్దములు మార్పుచెందుచుండును. 'దధి యత్ర' యను శబ్దము దధ్యత్రగా మారుచున్నదిగదా యని పూర్వపక్షము. కాన శబ్దము అనిత్యమే. మరియు 'వృద్ధిశ్చ కర్తృభూ

మ్నాస్య' (1.1.11) ఉచ్చరించువారు బహుళముకాగా శబ్దముయొక్క మహత్త్వము దర్శింపబడుచున్నది. మృత్పిండ రూప కారణము లెక్కువగుచో ఘటాదులు బహుళమైనటుల శబ్దము న్యూనాధిక భావబద్ధ మగుటచే అనిత్యమే యని పలు విధ సందేహములు శబ్దనిత్యత్వప్రతిపాదనమున ఎదుర్కొనును.

పైన ఉదాహరింపబడిన శబ్దనిత్యత్వ సిద్ధాంత వ్యతిరేక వాదముల దర్శనకారుడు కొన్ని సూత్రముల ఖండించి స్వీయసిద్ధాంతసమర్థనము గావించెను. 'సమంతు తత్ర దర్శనం' (1.1.12) ప్రయత్నమువలన శబ్దోత్పత్తియనునది అనుచితము. శబ్దము ప్రయత్నానంతరమున అభివ్యక్త మగునేగాని ఉత్పత్తి కానేరదు. ఉత్పత్తి అభివ్యక్తత్వము లను రెండింటికి యత్నము సామాన్యమే యగుచున్నది. అనగా శబ్దము పూర్వమేయుండి ప్రయత్నమున రూపాంతరము నొందుచున్నదని భావము. మరియు 'సతః పరమ దర్శనం విషయానాగమాత్' (1.1.13) ఉచ్చారణానంతరమున ముహూర్తముమాత్రముండి పిమ్మట నశించుననుటయు దోషము. సదాయుండుచు, ఉచ్చారణమున అనుపలంభన మేర్పడుచున్నది. ఎట్లన ఉపలబ్ధిస్థానమైన శ్రోత్రమునకు అది అప్రాప్తమగుచున్నది. అనగా ఉచ్చారణకాలమున వర్తమానకాల విషయగ్రహణశక్తి మాత్రముగలిగి శబ్దేంద్రియము తత్కాలమునమాత్రము గ్రహించి, పూర్వశబ్దగ్రహణ సామర్థ్యలోపమున ఉచ్చారణానంతర శబ్దమును గ్రహింప జాలదేకాని శబ్దలోపముకాదని తాత్పర్యము. ఇంక

'ప్రయోగస్య పరం' (1.1.14) శబ్దముచేయుము మొదలగు ప్రయోగములు లాక్షణికముగ శబ్దప్రయోగములుగా జ్ఞేయములు. అనగా ముఖ్యార్థకములుగావని భావము. 'ఆదిత్యవద్యౌగపద్యం' (1.1.15) ఒక్కటియై నానాస్థానముల నేక కాలమున నుపలంభనమును గూడ, ఆదిత్యునివలె జరుగును. అన ఒకసూర్యుడు ఏక కాలమున అనేకస్థానముల గోచరించునట్లు శబ్దముగూడ నానాస్థానముల నానాపురుషులచే నుచ్చరింపబడుచుండునని గ్రాహ్యము. అనగా శబ్దము సర్వవ్యాపకముగాన నానాస్థానముల నానాపురుషులచే నుచ్చరింపబడుటయు సముచితమే యని తాత్పర్యము. అదేవిధముగా 'వర్ణాంతర మవికారః' (1.1.16) ప్రకృతివికృతుల వలన శబ్దవికారమునగూడ యకారము ఇకారమునకు శబ్దాంతరమే యగుచున్నది. అనగా ఇకారమునకు యకారము వికారమే యగుచున్నది. శబ్దబహుళత్వము శబ్దవృద్ధి యనునదిగూడ 'నాదవృద్ధిపరా' (1.1.17) నాదముయొక్క అభివ్యంజకమున పరంతరమైన సంయోగవిభాగములవలన వృద్ధి గోచరించుచుండును. దానివలన వాక్యశబ్దమునకు ఏదోషము వాటిల్లదను సిద్ధాంతమును జైమినిమహర్షి సత్తముడు నిపుణతతో నిర్వర్తించెను.

ఈ విధానముగ పూర్వపక్షములకు సమాధానముగ శబ్దనిత్యత్వమును సిద్ధాంతపరచుటయేగాక దర్శనకారుడు ఇంకను ఆరుసూత్రముల తనసిద్ధాంతమును బలపరచుకొనెను. 'నిత్యస్తు స్యాద్దర్శనస్య పరార్థత్వాత్' (1.1.18) శబ్దము

నిత్యమే, ఎందువల్లనన, పదార్థస్ఫురణమును శబ్దమే గావించును పదార్థము ఎల్లప్పుడు శబ్దము లేక నామముపైన ఆధారపడియుండును. పదార్థము నిత్యమగుటచే దాని స్ఫురింపజేయు అభివ్యంజనముగాంచు శబ్దముగూడ నిత్యమే యగును. వ్యక్తిలక్షణమునగాక జాతిపరముగ పదార్థము నిత్యమగుచుండునని తాత్పర్యము. మరియు 'సర్వత్ర యౌగపద్యాత్' (1.1.19) గోశబ్దోచ్చారణముచే సకల గో వ్యక్తులును గోశబ్దము నిత్యాకృతివచనమగుటచే, నేక కాలమున స్ఫురించును. ఆ గోశబ్దము నిత్యమే యగుచున్నది. నిత్యానిత్యములకు సంబంధ మసంభవము. పద అర్థములకు సంబంధము నిత్యము. అందుచే శబ్దము నిత్యమగుచున్నది. 'సంఖ్యాభావాత్' (1.1.20) గోశబ్దమును రెండు పర్యాయములు ఉచ్చరించినంత మాత్రమున గోద్వయమును నుచ్చరించినట్లు కాదుగదా. అది ఏకత్వమునే సూచించును. అనిత్యములవలె శబ్దమున సంఖ్య లేకుండుటచే శబ్దము నిత్యము. 'అనపేక్షత్వాత్' (1.1.21) ఎట్లు లోకమున ఘటపటాదుల నాశనమో అట్లు శబ్దముయొక్క నాశము అగోచరము. అట్లు వినాశహేతువులు లేకుండుటచే అది నిత్యము. అదియునుగాక శబ్దము పరద్రవ్యవికారమే యగుచో శ్రోత్రేంద్రియమునకు అనుగుణ విషయాభావ మేర్పడును. ఒక్కొక్క ధీంద్రియము ఒక్కొక్క మహాభూతమును విషయము గావించుకొనుచున్నది అందుచే శబ్దము పదార్థముయొక్క వికారముగాక ప్రత్యేక ద్రవ్యమై నిత్యమై

యగునని 'ప్రఖ్యాభావాచ్చ యోగస్య' (1.1.22) సూత్రమున వివరించెను. వాయువికారము శబ్దము కానేరదు గాన నిత్యమని గ్రాహ్యము. అంతియగాక స్వతఃప్రామాణ్యకమైన వేదము తెలుపుచున్నది గాన శబ్దము నిత్యము అని 'లింగదర్శనాచ్చ' (1.1.23) ధ్వంసప్రాగభావ వ్యతిరిక్తమైన దే నిత్యము. అట్టి ప్రాగభావాదులులేనిదే శబ్దమని 'వాచా విరూపనిత్యతా'. అని ఋగ్వేదవాక్యము గలదు గాన శబ్దము నిత్యము

పూర్వోక్త విధానమున శబ్దనిత్యత్వ స్థాపనము గావించి, వేదముయొక్క అపౌరుషేయత్వమును దర్శనకారుడు సిద్ధాంతముసేయ సంసిద్ధుడాయెను. 'వేదాంశ్చైకే సన్నికర్షం పురుషాఖ్యాః' (1.1.27) వేదభాగముల కాఠకము, కౌథుమము, పైప్పలాదమనురీతి పురుషునివలన నాయాభాగములు ఏర్పడినట్లు సంబంధించి యుండుట గోచరము. అందుచే వేదము పౌరుషేయమట్లు భావింపనగునని సంశయము గల్గుచున్నది. అటులే 'బబరః ప్రావాహణిరకామయత'అను అనిత్యప్రసంగములునుగూడ వేదములందు గలవు. అయినను 'ఉక్తం తు శబ్దపూర్వత్వం' (1.1.29) అధ్యేతలకు పూర్వమైన నిత్యశబ్దమైన వచనమే యది యని గ్రాహ్యము. అటులే కాఠకాది శబ్దములును 'ఆఖ్యాప్రవచనాత్' (1 1.30) అనుసూత్రప్రకారము, వేదములోని నామములు నిత్యములై అధ్యయన సౌకర్యార్థ ప్రయుక్తములగును. మరియు 'పరం తు శ్రుతిసామాన్యమాత్రం'

(1.1 31) అనిత్యపదార్థములు అప్రసిద్ధమగుటయు, బబర ప్రావాహణిరిత్యాది శ్రుతులు నిత్యార్థకములని సాధారణ ముగను బోధ్యము. అనగా నాయా శబ్దములు నిత్యార్థము లనే బోధించును గాన నవి నిత్యములే యగుచున్నవి. మరియు, 'కృతే వా వినియోగః స్యాత్ కర్మణః సంబం ధాత్' (1 1.32) కర్మసంబంధమైన వాక్యములగూడ ప్రాశస్త్య తాత్పర్యదృష్టితో అన్వయింపవలయును. అనగ 'య ఏవం విద్వాన్ సంవత్సర ముపయంతి' అను కర్మప్రతిపాదక వాక్యమున, తత్కర్మ ప్రాశస్త్యబోధ నార్థమై 'జడా అప్యేతే ఇదం కర్మానుష్ఠానాయ ఫల మల భంత కిముత విద్వాంసః' ఈ కర్మానుష్ఠానమున జడు డైనను ఫలమును పొందుచుండ, నిక విద్వాంసునకు కొరవయా? అను వాక్యము కర్మప్రాశస్త్య తాత్పర్యబోధ కొరకు కల్పితమగుచున్నది. అట్టి వాక్యములగూడ 'చోదన లక్షణార్థో ధర్మః' అనునట్లు వేదార్థమునే తెలుపుచుండుటచే నిత్యములై యొప్పారుచున్నవి. అందుచే వేదము అపౌరు షేయమై స్వతఃప్రమాణమై నిత్యమై విరాజిల్లుచున్నదని మీమాంసాశాస్త్ర తాత్పర్యము. వేదముయొక్క అపౌరు షేయత్వమునుగూర్చి యీసూత్రములకు వ్యాఖ్యవ్రాయుచు 'అధ్యయన సంప్రదాయ ప్రవర్తకత్వేన సమాఖ్యోపపద్యతే కాళిదాసాది గ్రంథేషు తత్తత్సర్గావసానే కర్తార ఉప లభ్యతే। తథా వేదస్యాపి పౌరుషేయత్వే తత్కర్త్రోప లభ్యేత న చోపలభ్యతే। అతో వాక్యత్వహేతుః ప్రతికూల

తర్కపరాహతః। తస్మాదపౌరుషేయో వేదః' (న్యాయమాలా) అధ్యయన సంప్రదాయమును ప్రోత్సహించుటకు స్తుతివాక్యము లుపయుక్తములు. కాళిదాసాది గ్రంథముల ప్రతిసర్గాంతమున కర్తయొక్క నామము గోచరించును. అటులే వేదము పౌరుషేయమగుచో దాని కర్త నామము గోచరముగదా. అందుచే వేదము పౌరుషేయమను వాదము ఖండితము. కాన వేదము అపౌరుషేయము అని మాధవాచార్య వివరణము. 'తథా సతి పురుషబుద్ధిదోష కృతస్యా ప్రామాణ్యస్యా నాశంకనీయత్వా ద్విధివాక్యస్య ధర్మే ప్రామాణ్యం సుస్థితం' అట్లగుటచే పురుషబుద్ధిదోష కృతమైన ప్రామాణ్యమువలె శంకనీయము కాదు. కాన విధివాక్యధర్మ ప్రామాణ్యము సుస్థితమైనదనియు ఆతడు వక్కాణించెను.



## మంత్ర బ్రాహ్మణములు

ఇట్లు నిత్యమైన వేదము 'వేదో ద్వివిధః మంత్రరూపో బ్రాహ్మణరూపశ్చేతి' మంత్ర బ్రాహ్మణరూపమున ద్వివిధము. 'మంత్రబ్రాహ్మణయోర్వేద నామధేయం' అనియు శ్రుతి. అందు 'తచ్చోదకేషు మంత్రాఖ్యా' (2.1.32) అని మంత్రనిర్వచనము గావింపబడియున్నది. అనగా విహిత యజ్ఞాది అనుష్ఠాన సంబంధమగు అర్థమును ప్రకాశింపజేయు

నది మంత్రమని మంత్రలక్షణము. ప్రయోగకాలీనమగు అర్థసంస్మరణ కారణమున మంత్రముల యుపయోగమని తెలుపబడుచున్నది. అనగా యజ్ఞకాలమున సందర్భోచిత ద్రవ్య దేవతావిషయముల సంస్మరింప నుపయుక్తవాక్యములు మంత్రములని గ్రాహ్యము. 'శేషే బ్రాహ్మణశబ్దః' (2.1 33) మంత్రభిన్న వేదభాగము బ్రాహ్మణ శబ్దముచే వర్తించును. మంత్రాతిరిక్త వేదమే బ్రాహ్మణమనియు గ్రాహ్యము.

ఈ మంత్ర బ్రాహ్మణములలో బలముననుసరించి తరతమ భావముపపన్నము. 'మంత్రతస్తు విరోధే స్యాత్ ప్రయోగరూపసామర్థ్యాత్ తస్మాదుత్పత్తిదేశః సః।' (5.1.16) మంత్రపాఠమునకు బ్రాహ్మణపాఠమునకు విరోధము కలుగుచో, 'మంత్రపాఠ ఏవ ప్రబలః' మంత్రపాఠమే ప్రబలము. బ్రాహ్మణపాఠము కాదు. 'మననహేతుర్మంత్రః' అనియు, 'అసిపదాంతో మంత్రః' అనియు 'ఉత్తమపురుషాంతో మంత్రః' అని మాధవాచార్యుని నిర్వచనము. దానికే బ్రాహ్మణవాక్యముకంటె శక్తియున్నదని అదియే ప్రామాణ్యమని గ్రాహ్యము.

ఇట్లు వేదము మంత్ర బ్రాహ్మణరూపమున నేగాక సంహిత బ్రాహ్మణ ఆరణ్యకములను మూడు భాగములుగ ఒక విభాగమును గలదు. ఆరణ్యకభాగమే ఉపనిషతుల భాగము.

## ఋగ్సామ యజుస్సులు

వేదమంత్రములు 'యం ఋషయస్త్రయీవిధా విదుః ఋచః సామాని యజూంషీతి' అను శ్రుతివాక్యమురీతి ఋక్సామయజుస్సురూపమున మూడు విధములు. అందు 'తేషామృగ్యత్రార్థవశేన పాదవ్యవస్థా' (2.1.35) మంత్రముల మధ్య గాయత్ర్యాది ఛందోవిశేషమున్నచో అది ఋక్శబ్దమున వ్యవహార్యము. అనగా ఛందోబద్ధమైన వృత్తానుసారతః పాదవ్యవస్థగల మంత్రములు ఋక్కులనబడును. అటులే 'గీతీషు సమాఖ్యా' (2.1.36) 'గీతి విశిష్ట మంత్రత్వం సామత్వం' అన్నటుల గాన సాపేక్షికములైనవి సామములు. 'శేషే యజుః శబ్దః' (2.1.37) మిగిలినవి అనగా 'ఋగ్సామభిన్నే వేదభాగే యజుః శబ్దో వ్యవహ్రియతే' అనురీతి ఋగ్సామభిన్న వేదభాగము యజుఃశబ్దమున వ్యవహార్యము. ఇవి గద్యాత్మకములు. వీటియందు వృత్తములందువలె పాద విభజనముగాని, గీతములందువలె గాన విశిష్టతగాని యుండవు. ఋక్కులు ఛందోబద్ధ మంత్రములును, గానపూర్వక స్తవాదులు సామములును, యజ్ఞయాగాదుల నుపయుక్తములై యుండు వచనభాగ మంత్రములు యజుస్సులు.

---

## వేదము పంచవిధము

పైనుదాహరింపబడియున్న మంత్రభాగమునుగూడ చేర్చి, విధి, మంత్ర, నామధేయ, నిషేధ, అర్థవాద రూప

ముగ పంచవిధములుగ వాక్రొందురు. 'పునర్విధినామధేయ నిషేధార్థ వాద భేదైశ్చతుర్విధః - ఏవం సకలోఽపి వేదః పంచవిధః' (భావబోధినీ - 7) విధి నామధేయ నిషేధార్థ వాదములుగ చతుర్విధముగ విభజ్యమై, యీవిధముగా సకలవేదము పంచవిధముగ నున్నదని ఆర్యసూక్తి. మంత్ర లక్షణముల దిలకించియుంటిమిగాన విధ్యాద్యర్థాపత్తి పర్యంతము ఒకించుక పర్యాలోకనము గావించెదముగాక.

---

## మంత్రవిధి - ఉత్పత్తివిధి

'స చ విధిశ్చతుర్విధః' (భావబోధినీ-9) ఆవిధి నాలుగువిధములు. అవి ఉత్పత్తి, వినియోగ, ప్రయోగ అధికారవిధులను నామములుగలవి. అందు కర్మస్వరూప మాత్రబోధ గావించునట్టి విధి ఉత్పత్తివిధి నాబడును. దాని కుదాహరణవాక్యము 'అగ్నిహోత్రం జుహుయాత్'.

---

## వినియోగవిధి

అంగప్రధానసంబంధమైనది బోధగావించునది వినియోగవిధి యందురు. 'దధ్నా జుహోతి' అనునది ఉదాహరణవాక్యము. ఈ వినియోగవిధికి సహకారులుగా శ్రుతి,

లింగ, వాక్య, ప్రకరణ, స్థాన, సమాఖ్యలను షట్ప్రమాణ ములు గలవు. ప్రమాణాంతర నిరపేక్షిక శబ్దము శ్రుతి నాబడును. శ్రుతిప్రాబల్యమున పైశ్రుతివాక్యమున దధి కర్మాంగమగుచున్నదని తాత్పర్యము. శబ్దసామర్థ్యమే లింగము. సామర్థ్యమనగా రూఢియేయగును. ఆలింగము మరల అర్థగత శబ్దగతములని ద్వివిధము. 'స్రువేణ వధ్యతి' స్రువముతో చీల్చుము అనువాక్యమున స్రువము ద్రవపదార్థ ముల విభజించుటకే యుపయుక్తముగాని కఠినపదార్థముల కనుపయుక్తము. అందుచే, నిచ్చటి 'వధ్యతి' అనుప్రయోగము స్రువమునననుసరించి యర్థగత మగుచున్నది. శబ్దగత లింగ మనగా 'అగ్నయే జుష్టం నిర్వపామి' అగ్నికొరకు తండుల ముల ప్రత్యేకించెదను అను వాక్యమున ప్రత్యేకించుట యజ్ఞమున ప్రధానవిషయముగాక అప్రధానమని తాత్ప ర్యము. అనగా లింగమున యౌగికశబ్దమునకు రూఢ్యాత్మక లింగశబ్దము భిన్నమైనదిగా యుండును. వాక్యమనగా పదాంతర సమభివ్యవహారముగా నిర్వచనము. సమభివ్యవ హారమనగా శేష శేషిపదముల సహోచ్చారణమని యర్థము. అందుచే వాక్యమనగా ఆకాంక్షా యోగ్యతగల పద సము దాయమే యగుచున్నది. 'అగ్నయే జుష్టం' అనువాక్య మున 'నిర్వాపయామి' అను మూలపదములకు 'అగ్నయే' 'జుష్టం' అను పదములు ఆకాంక్షా యోగ్యత్వమున జేర్పబడి యున్నవి. ప్రకరణ యనగా పరస్పరాకాంక్షా అని అర్థము.

'దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత' అను వాక్యమున స్వర్గకాముడు దర్శపూర్ణమాసాది యజ్ఞముల నాచరింపవలయుననియు, 'సమిధో యజతి' అను వాక్యమున ఫలాభావమున స్వర్గఫలదములగు దర్శపూర్ణమాసాదులు ప్రధానములనియు ఫలదములుకానివి అప్రధానములనియు తీర్మానించుట ప్రకరణ యని యర్థము. స్థానమన సన్నిధి అని యర్థము. సమాఖ్యా యన యౌగిక శబ్దము, లేక సంజ్ఞావాచకము. అనగా వినియోగవిధి వాక్యనిరూపణమున శ్రుత్యాది సమాఖ్యపర్యంత షట్ప్రమాణ సాహాయ్యము గావింపవలసి యుండును. ఆ షట్ప్రమాణములగూడ 'శ్రుతి లింగ వాక్య ప్రకరణ స్థాన సమాఖ్యానాం సమవాయే పార దౌర్బల్యమర్థవిప్రకర్షాత్' (పూ. మీ. సూ. 3.3.14) అను సూత్రార్థము ననుసరించి, 'ఉత్తరోత్తరం పూర్వపూర్వాత్ పారదౌర్బల్యం' అనియు 'శ్రుత్యాదీనామేకత్ర సమావేశే పూర్వపూర్వస్య ప్రాబల్యం ఉత్తరోత్తరస్య దౌర్బల్యం' (మీమాంసాపరిభాషా) శ్రుత్యాదికము ఒకేవిషయమును సూచించుచో, వెనుకవానికంటె ముందుగలవి దుర్బలములు. అనగా అన్నింట శ్రుతి బలవత్తమమును, సమాఖ్య దుర్బలమును అని గ్రాహ్యము.

వినియోగవిధి సిద్ధరూప సాధ్యరూపమున ద్వివిధము. సిద్ధరూపము జాతిద్రవ్యసంఖ్యాదుల కన్వయము. అనగా కర్మాంగద్రవ్యాదుల కన్వయమని గ్రాహ్యము. సాధ్యరూప వినియోగవిధి క్రియారూపముగా మరల రెండువిధములు,

వానినే గుణకర్మలు, ప్రధానకర్మ లేక అర్థకర్మలని 'తాని ద్వైధం గుణప్రధానభూతాని' (2.1.6) అను సూత్రము ననుసరించి వ్యవహరింతురు. 'జుహోతి, యజతి, దదాతి' మొదలగునవి యన్నియు క్రియారూప వినియోగవిధులు. అందు 'యైర్ద్రవ్యం న చికీర్ష్యతే తాని ప్రధానభూతాని ద్రవ్యస్య గుణభూతత్వాత్' (2.1.7) ఏకర్మలచే ద్రవ్యమును కలుగజేయుటకు ఆప్తుం, సంస్కర్తుం, అనగా పొందుటకు, సంస్కరించుటకుగా జేయుకర్మలు ప్రధానభూతములు లేక అర్థభూతములు. ద్రవ్యముయొక్క గుణభూతములు ద్వితీయము. ఆత్మగతమగు అపూర్వ జనకకర్మ అర్థకర్మ అని యర్థము. గుణకర్మ సంస్కార జనకమైనది. అర్థకర్మలో గర్మప్రాధాన్యమును గుణకర్మలో ద్రవ్యప్రాధాన్యతయు నుండును. మరల గుణకర్మ ఉపయుక్త సంస్కారకం, ఉపయోక్ష్యమాణసంస్కారకం, అని ద్వివిధము. అందు ఉపయుక్తసంస్కారక కర్మను ప్రతిపత్తికర్మ యందురు. అనగా నిర్ణయస్థానమునకు ఉపయుక్తమై యాటంకమైన ద్రవ్యమును తరలించుటయే ప్రతిపత్తికర్మ నా యర్థము. మరల నీ ప్రతిపత్తి త్రివిధము. ప్రధానోత్తరకాల, ప్రధానసమకాల, ప్రధానపూర్వకాల యని అందురు. గుణకర్మలో ద్వితీయ భాగమైన ఉపయోక్ష్యమాణ సంస్కారకము అనేకవిధములు. ఉపయోగింపబడువాని సంస్కారము వినియుక్తమైన ద్రవ్యసంస్కారము, వానికి సంబంధించినవాని సంస్కా

రము, వినియుక్తము కాబోవువాని సంస్కారము అని అది ముఖ్యముగ మూడువిధములుగ నున్నది.

పూర్వోక్తమగు గుణకర్మ దృష్టార్థము, అదృష్టార్థము, దృష్టాదృష్టార్థము అనియుగూడ విభజ్యము. గుణకర్మయే మరల ఉత్పత్తి, ఆప్తి, వికృతి, సంస్కృతిభేదమున చతుర్విధము. 'అగ్నీనాదధీత' అను వాక్యమున అగ్నినుంచుట యన ఆహవనీయాగ్నిలో సమిధల నుంచుటచే అగ్ని యుద్భవించును. కాన అది ఉత్పత్తికర్మ యగును. అట్లే 'స్వాధ్యాయోఽధ్యేతవ్యః' (తై. ఆ. 15.7) అను వాక్యమున అధ్యయనమున వేదము ప్రాప్తముగాన నది ఆప్తికర్మ యగుచున్నది. వికృతి యనగ, 'వ్రీహీనవహంతి' ధాన్యమును దంచుము అనువాక్యమున ధాన్యమును దంపగ తండులములుగ మారునని తాత్పర్యము. కాన అది వికృతికర్మ. 'వ్రీహీన్ ప్రోక్షతి' ధాన్యమును చల్లవలెను అను చోట నది సంస్కృతికర్మ నాబరగును.

వినియోగ కర్మలో క్రియారూప విధియందు గుణకర్మవిషయమును చూచితిమి. క్రియారూపవిధిలోని ద్వితీయ భాగమైన అర్థకర్మ నిత్య,నైమిత్తిక కామ్యవిధముగ త్రివిధము. అందు 'యావజ్జీవమగ్నిహోత్రం జుహోతి' (తై. బ్రా. 2. 1. 9. 2) 'సాయం జుహోతి' (తై. బ్రా. 2. 1. 2. 7. 8) మొదలగు వాక్యములు పురుషుని నియమమును కర్తవ్యముల అవగత మొనర్చుచున్నవి. అట్టి కర్మలు యావజ్జీవము ప్రాతఃసంధ్యల పురుషు డాచరింపక తప్పదు

కాన నవి నిత్యకర్మ నాబడును. శౌచ స్నాన సంధ్యా వందనాది క్రియలును, అగ్నిహోత్రాది కర్మలును నిత్య కర్మ యగుచున్నవి. 'అగ్నయే పథికృతే పురోడాశమిష్టా కపాలం నిర్వపేత్' (తై. సం. 2. 2. 2 1) పథికృతము నాబడు అగ్నికొరకు అష్టకపాలములలో తయారయిన పిండము నుంచవలెను అనువాక్యమున సూచింపబడిన కర్మ దర్శపూర్ణమాసాది కర్మలోపమున గావింపవలసి యుండుటచే నది నైమిత్తికకర్మ యనబడును. అనగా నిత్యజీవితమున నియమింపబడక, ఇతర కారణముల విధింప బడిన కర్మ నైమిత్తికమని గ్రాహ్యము. కామ్యకర్మ కేవల మైహిక ఫలకము, ఆముష్మిక ఫలకము, ఐహికాముష్మిక ఫలకముగా మూడువిధములు. వర్షము నపేక్షించి చేయు కారీరాదిక కర్మలు ఐహికములును, స్వర్గకామమున నాచ రించు అగ్నిష్టోమాది కర్మలు ఆముష్మికములును, సంపదను గోరిచేయుకర్మలు ఉభయార్థ సాధకములుగ నుండును. పైనుదాహరింపబడిన నిత్యనైమిత్తిక కర్మల 'అకరణే ప్రత్య వాయ ఏవ, కృతే ఫల నాస్తీతి కేచిత్' (మీమాంసాపరి భాషా) నాచరింపనిచో పాపము గలుగును గాని చేసినచో పుణ్యము కలుగదు అని ప్రాభాకరుల అభిప్రాయము. కాని 'అన్యేతు దురితనివృత్తిః, ఫలమస్తి' అకర్మాచరణము దురిత క్షయమను ఫలమును గలిగించును అని భాట్టులు భావించిరి. కాని కామ్యాపేక్షారహిత కర్మయగుటచే నది కామ్యకర్మ యనరాదు అని వాదము.

## ప్రయోగవిధి

ఇంతవరకు విధిరూపములో వినియోగవిధిని ప్రస్తావించి చూచితిమి. తర్వాతదియగు ప్రయోగవిధి నొకించుక చూచెదముగాక. ప్రధానవిధిని అంగవిధులతోసహా విధించుచున్న విధి ప్రయోగవిధి యందురు. 'అగ్నిహోత్రం జుహూయాత్ స్వర్గకామః' అను వాక్యములో అగ్నిహోత్రకార్యమును తదంగములతోగూడ నాచరింప విధించువాక్యము ప్రయోగవిధియని అర్థము. దీనిని సక్రమముగా నవగాహన మొనరించుకొనుటకు శ్రుతి, అర్థక్రమ, పాఠక్రమ, స్థానము, ముఖ్యక్రమ, ప్రవృత్తిక్రమములని షట్ప్రమాణములు గలవు. క్రమపరవచనము శ్రుతియనియు, ప్రయోజనవశమున క్రమనిర్ణయము అర్థక్రమమనియు, పదార్థబోధక వాక్యముల క్రమము పాఠక్రమమనియు, సామోపస్థితి స్థానమనియు, ప్రధానక్రమమున అంగములక్రమము ముఖ్యక్రమమనియు, పదార్థక్రమము ప్రవృత్తిక్రమమనియు అర్థము.

---

## అధికారవిధి

విధియందుగల చతుర్థవిధి అధికారవిధి, యనగా కర్మఫలాధికారిని తెలుపునదియని అర్థము. 'దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత' అను వాక్యమున స్వర

కాముడైనవాడే దర్శపూర్ణమాసాదుల కధికారి అని అన్వయము. అట్లు అధికారినిర్ణయము గావించు విధి అధికారవిధి అని భావము.



## అపూర్వ నియమ పరిసంఖ్యా విధులు

పూర్వోక్తవిధానమున విధిచతుర్విధమేగాక అపూర్వ, నియమ, పరిసంఖ్యారూపమున త్రివిధమనియు గొందరి వాదము. పూర్వవిభజనము శబ్దప్రధానముగ జరిగినదనియు ప్రస్తుత విభజనము అర్థానుకూలమని కొందరి భావము. 'యో విధిరత్యంతాప్రాప్తమర్థం ప్రాపయతి సోఽపూర్వ విధిః' అనురీతి సంపూర్తిగా తెలియనిదానిగూర్చి తెలుపునది అపూర్వవిధి యందురు. దర్శపూర్ణమాసాదికమున 'వ్రీహీన్ ప్రోక్షతి' అను విధి అత్యవసరము, పూర్వము అగ్రాహ్యముగాన అట్టి విషయముల దెలుపునది అపూర్వ విధి యగును. 'యశ్చ పక్షేఽప్రాప్తమర్థం నియమయతి స నియమవిధిః' మార్గాంతరముండ నొకదానినే నియమించునది నియమవిధి యని గ్రాహ్యము. అనగా 'వ్రీహీనవహంతి' ధాన్యమును దంచవలెను అను వాక్యమున దంచుటగాక ధాన్యము మార్గాంతరముల తండులములుగ జేయ సాధ్యమై యున్నను, దంచుటయే ముఖ్యముగా నియమించుట నియమ విధియందురు. 'ద్వయోః సముచ్చిత్య ప్రాప్తావితర నివృత్తి ఫలకో విధిః పరిసంఖ్యావిధిః' ఏకకాలమున రెండుమార్గములు గోచరింప నందు ఒకదాని నిషేధించుట పరిసంఖ్యా

విధి నాబరగును. ఇది శ్రౌతీ, లాక్షిణికీ యని ద్వివిధము. 'శ్రౌతీ యథా–అత్ర హ్యేవావపంతీతి। అస్యాం ప్రాప్తబాధ ఇత్యేక ఏవ దోషః', 'లాక్షిణికీ యథా – పంచపంచనఖా భక్ష్యా ఇతి'। పంచనఖములుగల శశాదులమాంసమే స్వీకరించి యితరపంచనఖమృగ మాంసభక్షణము నిషిద్ధమనుట లాక్షిణికీ పరిసంఖ్యావిధి అని తాత్పర్యము.



## మంత్రము – నామధేయము

ఇట్లు మంత్రభాగములలో ప్రథమమైన విధిని గ్రహించియుంటిమి. ఇక అందు నామధేయమను ద్వితీయమును గ్రహింప యత్నింతము. స్థూలముగ యాగనామమును సూచించునది నామధేయమనబడును. యాగాదులకు నామములు చతుర్విధములుగా నేర్పడుచున్నవి. 'తత్ప్రఖ్య, తద్వ్యపదేశ, యాగిక, వాక్యభేదైః' అనగా ఒక ప్రత్యేకవిషయ ప్రకటనార్థము, ఒక ప్రత్యేకతవలన, లక్షణావిధానమున, వాక్య విభజనపూర్వకముగ నామములు యజ్ఞాదులకు ఏర్పడును. ఉద్భిదా, చిత్ర అగ్నిహోత్ర, శ్యేన, వాజపేయ, ఆగ్నేయ, బర్హి, ప్రోక్షణి, వైశ్యదేవ, వైశ్వానర, యజమాన, మొదలగు యజ్ఞముల కాయానామములు అట్లే ఏర్పడియున్నవి. (1.4.1–30)

## మంత్రము – నిషేధము

'పురుషస్య నివర్తకం వాక్యం నిషేధః' అనురీతి నిషేధము' నిషేధవాక్యములద్వారా అనర్థహేతువగు క్రియానివృత్తి కలుగజేయుటయే తాత్పర్యము. 'న కలంజం భక్షయేత్' అనువాక్యము విషగ్రస్థ మృగమాంసము భుజింపరాదు అని బోధించుచు అనర్థమును నివారించు చున్నది.

---

## మంత్రము – అర్థవాదము

ఇక వేద వచనములలో పంచమమైన అర్థవాదము ప్రాశస్త్య నిందాన్యతర లక్షణము గలది అగుచున్నది. 'విధినా త్వేకవాక్యత్వాత్ స్తుత్యర్థేన విధినాం స్యుః' (పూ. మీ. సూ. 1.2.7) విధించబడిన అర్థములు, స్తుతి రూప ప్రతిపాదనముద్వారా ఏకమగుటచే అర్థవాదము ప్రమాణ మగుచున్నది. అనగా నిందాస్తుతులు ఏకమై స్తుతిరూపమున నింద గావించుచుండును. ఈ అర్థవాద వాక్యములు, గుణవాద, అనువాద, భూతార్థవాదములని త్రివిధము. 'గుణవాదస్తు' (పూ. మీ. సూ. 1.2.10) గుణ వాదమనగ ప్రమాణాంతర విరోధమగు అర్థవాదము అని గ్రాహ్యము. 'ఆదిత్యో యూపః' అనువాక్యమున సూర్యుడు కాష్ఠము కాకున్నను, కాష్ఠ మహాత్మ్య సూచికముగ లోక

విరుద్ధమైనను చెప్పబడుటచే గుణార్థవాదము నాబడుచున్నది. 'దేవాః పితర ఇతి బ్రూయాత్' దేవతలు తండ్రులని చెప్ప బడును అనుచో స్తుత్యర్థము అజ్ఞాన వచనముగ నున్న యీప్రయోగము, గుణవాదమని తాత్పర్యము. అందు చేతనే 'ప్రమాణాంతరవిరుద్ధార్థబోధకో గుణవాదః' అను నిర్వచనము దానికి ఏర్పడినది. అనగా ప్రత్యక్షాది ప్రమాణాంతరముల విరుద్ధమైన అర్థమును బోధించునది గుణ వాదమని అనంబడియున్నది. 'ప్రమాణాంతరావగతార్థ బోధకో ఽనువాదః' అనుచందము ప్రమాణేతరములచే తెలుపబడు అర్థమును తెలుపునది అనువాదము. 'అగ్నిర్హి మస్యభేషజం' అను వాక్యమున అగ్నిమంచుకు విరోధముగా చెప్పబడియున్నది. ఆ విషయము ప్రత్యక్షాది ప్రమాణ గోచరమే యగుచున్నది. ఇక 'ప్రమాణాంతర విరోధత త్ప్రాప్తిరహితార్థ బోధకో భూతార్థవాదః' అనునట్లు ప్రమా ణాంతరములకు అవిరోధమైనది భూతార్థవాదము. 'వజ్ర హస్తః పురంధరః' అనువాక్యమున ఇంద్రునకుగల హస్తంగత వజ్రమును ప్రత్యక్షాదిప్రమాణముల గాంచకున్నను, దర్శింప జాలకుండుటచే సమ్మతించుట భూతార్థవాక్యము.

ఈ అర్థవాదమునే 'నిందా, ప్రశంసా, పరకృతి, పురాకల్ప, (మీమాంసాపరిభాషా) భేదమున చతుర్విధమని యందురు. అందు 'అశ్రుజం హి రజతం యో బర్హిషి దదాతి పురాఽస్యసంవత్సరాత్ గృహే రుదంతి' (తై. సం. 1.5.1.2) అను వాక్యమున అగ్నియొక్క అశ్రువులగు

రజతదానమును బర్హియాగమున గావించువాడు సంవత్సర ములో దుఃఖమును పొందును అని నిందగలదు. ఇది నిందా పర అర్థవాదము. 'శోభతేఽస్య ముఖం య ఏవం వేద' (తాండ్య బ్రాహ్మణ. 20.16.6) గ్రహించినవాని ముఖము శోభించును అను వాక్యము ప్రశంసాపరము. 'అగ్నిర్వా అకామయత' (తై. బ్రా. 3.1.4.1) అగ్ని కాంక్షించెను అను వచనమున ఆకార్యము ఒక మహాపురుషునిచే చేయ బడెను అనుట పరకృత అర్థవాదము. 'తమసపద్ధియా ధియా త్వావధ్యాసుః' (తై. సం. 2.6.6.1) ఇచ్ఛగలిగినప్పుడు జనులు నిన్ను వధింతురుగాక అను వచనమున అగ్ని మత్స్య ముల శపించెనని పూర్వవిషయము తెలుపబడుటచే నది పురాకల్పము అనబడినది.

ఇంతవరకు చర్చింపబడిన విధానమున వేదము మంత్ర బ్రాహ్మణరూపమున ద్వివిధమై, అందు మంత్రభాగము విధి, నామధేయ, నిషేధ, అర్థవాదరూపముగ చతుర్విధమని కొంద రును, వేదమే మంత్రముతోగూడ పంచవిధములని కొంద రును ఉద్దేశించిరి.

---

## బ్రాహ్మణము

ప్రథమ విభజనమున వేదము మంత్ర బ్రాహ్మణము లలో బ్రాహ్మణము 'బ్రాహ్మణవాక్యం చానేకవిధం' అను రీతి బహుళరూపములు గలదిగానున్నది. అది కర్మో

త్పత్తివాక్యము, గుణవాక్యము, ఫలవాక్యము, ఫలాయగుణ వాక్యము, సగుణకర్మోత్పత్తివాక్యమని ప్రధానముగా విభజ్యము. ఈకర్మకర్తవ్యమని బోధించువాక్యము కర్మోత్పత్తి వాక్యముగా నుండును. ఉదాహరణము 'అగ్నిహోత్రం జుహోతి' అనువాక్యము. విహితమైన కర్మయొక్క అంగములను, ద్రవ్య దేవతాదిక విధాయకముల తెలుపునది గుణవాక్యము నాబడును. 'దధ్నా జుహోతి' అను వాక్యము ఉదాహరణము. కర్మతోగూడ ఫలనిర్దేశ్యము చేయు వాక్యము ఫలవాక్యము. 'అగ్నిహోత్రం జుహుయాత్ స్వర్గ కామః' ఉదాహరణ వాక్యము. పూర్వమే తెలిసియున్న కర్మ నాశ్రయించి, ఒక ప్రత్యేక ఫలముకొరకు ప్రత్యేక అంగద్రవ్యమును సూచించువాక్యము ఫలాయగుణవాక్యము. 'దధ్నేంద్రియకామస్య జుహుయాత్' అనువాక్యమున ఇంద్రియకామునకు దధితో హోమకర్మ నియమితము. అనగా ఇంద్రియకామమునకు దధ్యాహుతులు అవసరమని భావము. ద్రవ్యదేవతాది గుణవిశిష్ట కర్మ విధాయక వాక్యము సగుణకర్మోత్పత్తి వాక్యము అగును. 'సోమేన యజేత' అను వాక్యమున, సోమయాగమున సోమలత విధించబడియున్నది. అట్లే 'ఉద్భిదా యజేత పశుకామః' అను వాక్యమునగూడ ఉద్భిద్యాగమున పశుకాముడు ఉద్భిద నుపయోగింపవలెను అని గలదు. అందు యాగము, ద్రవ్యము, ఫలము నిర్దేశింపబడి యున్నవి. ఈవాక్యమునకు సగుణకర్మోత్పత్తి వాక్యమని నామము.

## ద్వాదశ ధర్మములు

ఇట్లు మీమాంసాశాస్త్రము యజ్ఞయాగాది కర్మల గల యనేక ద్రవ్యములను, అంగములను, నామములను, మంత్రములను పరిశీలించి, విభజించి నిశ్చయించి శాస్త్రమును బహుళము గావించుటయేగాక కర్మోపాసనాపరుల యనేక క్లిష్టసమస్యల మాపు చేయగలిగినది. పూర్వము తెలుపబడిన విషయసూచికలో సూచింపబడినరీతి యీ శాస్త్రము కర్మ ధర్మ నిరూపణము గావించుటకు 'ధర్మో ద్వాదశలక్షణ్యా' అనుచు ఆద్వాదశ లక్షణోపేత ధర్మమును ద్వాదశాధ్యాయముల జర్చించియున్నట్లు విదితము. ఆద్వాదశ లక్షణములే 'ప్రమాణభేద శేషత్వ ప్రయుక్తిక్రమ సంజ్ఞకాః।అధికారోఽతిదేశశ్చ సామాన్యేన విశేషతః। ఊహో బాధశ్చ తంత్రం చ ప్రసంగో శ్చోదితాః క్రమాత్' అనురీతిగ నున్నవి.



## ప్రమాణము

వానిలో 'సత్సంప్రయోగే పురుషస్యేంద్రియాణాం బుద్ధిజన్మ తత్ప్రత్యక్షం' (పూ. మీ. సూ. 1.1.4) అను సూత్రమున చక్షురాదీంద్రియములకును, వాని రూపరసాది అర్థములకును సన్నికర్ష మేర్పడగా, ప్రమాతకు ఆసంబంధమైన జ్ఞానము కలుగును. అది ప్రత్యక్షమని నిర్వచింపబడెను.

కాని యివి ధర్మవిషయమున ప్రమాణములు గావని ఆసూత్ర మున నే 'అనిమిత్తం విద్యమానోపలంభనత్వాత్' (పూ.మీ. సూ. 1.1.4) వర్తమానములగు విషయగ్రహణమును మాత్రమే చేయును గాన ప్రమాణములుగావని ఖండించి 'అనుపలబ్ధే తత్ప్రమాణం' (1.1.5) ప్రత్యక్షాదులకు అవ గతముకాని స్వర్గాదికమును తెలుపునది విధివాక్యముగాన అదియే ప్రమాణమని జైమిన్యాచార్యుని నిర్ణయము. అట్లే 'అపి వా కర్తృసామాన్యాత్ ప్రమాణమనుమానం స్యాత్' (1.3.2) స్మృతి అనుష్ఠానములకు కర్త యొక్కడగుటచే వేదమూలకమైన అనుమానము లేక స్మరణము ప్రమా ణమే యనియు నదేవిధముగ 'విధినా త్వేకవాక్యత్వాత్ స్తుత్యర్థేన విధీనాం స్యుః' (పూ. మీ. సూ. 1.2.7) విధే యార్థముల స్తుతిరూపమైన అర్థమును ప్రతిపాదించుటచే విధి వాక్యములతో నేకమే యగుటవలన, అర్థవాదవాక్యముగూడ ధర్మాధర్మముల ప్రమాణభూతమే యనుచు, అయినను ప్రత్యక్షానుమాన అర్థవాదములు శ్రుతి ననుసరించి నపుడే ప్రమాణములని మీమాంసకుల నిర్ణయము, అందుచేతనే 1. 1. 4 సూత్రములో శ్రుతియే పరమప్రమాణముగా నిర్వచింపబడియున్నది.



## శేషము

'అథాతః శేషలక్షణం' (3. 1. 1) అని ప్రారంభించి 'శేషః పరార్థత్వాత్' (3. 1. 2) ఏది పరార్థమో అది శేషస్వరూపము. వ్రీహ్యాదికము స్వభిన్నయాగార్థముగాన వ్రీహ్యాదికము శేషభూత మగుచున్నది. 'ద్రవ్యగుణ సంస్కారేషు బాదరిః' (3.1.3) వ్రీహ్యాదికద్రవ్యము, అరుణాది గుణములు, ప్రోక్షణాది సంస్కారములు పరార్థములు గాన అవి శేషత్వములని బాదరిమహర్షి అభిప్రాయము. 'కర్మాణ్యపి జైమినిః ఫలార్థత్వాత్' (3. 1. 4) ఫలార్థత్వమువలన కర్మలుగూడ శేషభూతములే యని జైమిని మహర్షి సిద్ధాంతము.



## అధికారము – స్త్రీ, శూద్రులు

అధికారి నిర్ణయమునకు జైమిని మహర్షి అష్టపాదములుగల షష్ఠాధ్యాయమును నిర్మించి సాకల్యముగ చర్చించెను. 'జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత' అను మొదలగు వాక్యములలో కర్తృత్వ ముపపన్నము. తజ్జన్య ఫల భోక్తృత్వమునే అధికార మందురు. అందుచే 'దర్శ పూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత' మొదలగు యజ్ఞముల 'ఫలార్థత్వాత్ కర్మణః శాస్త్రం సర్వాధికారం స్యాత్' (6. 1. 4) యాగాది కర్మలందు ఫలేచ్ఛాదులు

గల ఎల్లరును అధికారులే యగుదురని సందేహము రాగా 'కర్తుర్వా శ్రుతిసంయోగాత్ విధిః కార్త్స్న్యేన గమ్యతే' (6. 1. 5) సూత్రమున, పూర్వోత్తర అంగవిశిష్టమైనది అధికారవిధియొక్క లక్షణముగాన, అంధ పంగ్వాదికము నకు ఆజ్యపరిరక్షణము ప్రదక్షిణాదు లసంభవముగాన ఎల్ల రధికారులు కారని నిర్ణయింపబడినది. 'స్వర్గకామః' అనుచోట పుల్లింగనిర్దేశముగలదు గానపురుషులే అధికారులు అని ఐతిశాయన మహర్షి తలంచెను. పురుషులేగాక స్త్రీలు గూడ అధికారులేయనియు కొందరివాదము. 'జాతిం తు బాదరాయణః అవిశేషాత్ తస్మాత్ స్త్ర్యపి ప్రతీయేత జాత్యర్థస్య విశిష్టత్వాత్' (6.1.8) స్వర్గకామాది పదము లందు ఫలాపేక్షత్వమునే సూచించి, పుంస్త్వము తెలుపబడ లేదుగాన స్వర్గకామ విషయము సామాన్యమగుటచే, అది జాతిని సూచించునని బాదరాయణుడు అన్వయించుచు ఇచ్ఛ యనునది స్త్రీ పురుషులకు సామాన్యమగుటచే స్త్రీ గూడ అధికారి అని ఆమహర్షి భావించెను. 'పశునా యజేత్' అనుచోట పుంస్త్వముగూడ అగోచరమనియు నాముసీంద్రు డుదాహరించెను. కాని 'వ్రీహిభి ర్యజేత' 'పశునా యజేత' అను వాక్యగత యాగము ద్రవ్యసంయుక్తములై ద్రవ్యసాధ్య ములుగా నున్నవి. పురుషుడు యాజన అధ్యాపన ప్రతి గ్రహ ప్రజాపాలన జయ కృషి వాణిజ్యాదులవలన ద్రవ్యవంతు డగునుగాన అతడే అధికారి యగుననియు, స్త్రీలు క్రయ విక్రయాదిక ద్రవ్యములతో సమానమగుటచేతను, స్వస్వత్వ

మైన ద్రవ్య మభావమగుటచేతను, స్త్రీలు అధికారులు కారనియు వాదము. అయినను 'ఫలోత్సాహావిశేషాత్' (6.1.14) ఫలప్రాప్తికై యుత్సాహము స్త్రీలకుగూడ నుండుటచే వారికి అధికారముకలదు అని తీర్మానము. అటులే 'స్వవతోస్తు వచనాదైకకర్మ్యం స్యాత్' (6.1.17) మొదలగు వచనములద్వారా దంపతు లిరువురునుగూడ నధికారులు అని సిద్ధాంతము సేయబడినది. ఈ సందర్భమున స్త్రీలకు చెప్పబడిన ఆశీర్మంత్ర బ్రహ్మచర్యఫల సంస్కారాదిక సర్వము పురుషునితో సమానాధికారము గలదనియు చెప్పబడినది.

అట్లగుచో యజ్ఞాధికారము చాతుర్వర్ణములకు గలదా యన, యాగాదులలో శూద్రులకు అధికారము లేదని తీర్మానించెను. 'వసంతే బ్రాహ్మణోఽగ్నీనాదధీత, గ్రీష్మే రాజన్యః, శరది వైశ్యః' (పూ. మీ. సూ. 6.1.26 వృ) అను మంత్రముల మూడు వర్ణములకే అధికారము గలదుగాని తురీయ వర్ణమునకు లేదని వ్యక్తము. కాని 'నిమిత్తార్థే చ బాదరిః. తస్మాత్ సర్వాధికారః స్యాత్' (6.1 27) ఆయావర్ణములకు యాగాది కర్మ నిర్వహణమునకు కాలనిర్ణయము గావింపబడి శూద్రులకు కాలనియమము మాత్రమే లేదనియు, అధికార నిషేధము కాదని బాదర్యాచార్యుని భావము. 'అపి వా వేదనిర్దేశాదపశూద్రాణాం ప్రతీయేత' (6.1.33) ఉపనయనము వేదగ్రహణార్థముగాన ఉపనయనములేని శూద్రులకు వేదాభావముగాన

శూద్రులు కాని వర్ణత్రయమునకే యజ్ఞాధికారము అని చెప్ప బడును. 'అవిద్యత్వాదభావః కర్మణి స్యాత్' (6.1.37) విద్యలేనివాడు కర్మకు అధికారి కాడు అని తాత్పర్యము. మరల 'ఉత్పత్తే నిత్యసంయోగాత్' (6.1.42) పుట్టుకతో అంగవైకల్యము గలవారు కూడ యాగాధికారులు కారు అని నిర్ణయము.

---

## అతి దేశము

ధర్మనిర్వచనగల ద్వాదశలక్షణములలో అతిదేశము ముఖ్యము. 'అన్యత్రైవ ప్రణీతాయాః కృత్స్నాయా ధర్మ సహితేః అన్యత్ర కార్యతః ప్రాప్తిరతిదేశః స ఉచ్యతే' అనియు 'అతిదేశోనామాన్యత్ర శ్రుతీనామంగానామన్యత్ర ప్రాపకం శాస్త్రం' అను నిర్వచనముల ననుసరించి అతిదేశ మనగ అతివ్యాప్తి యగుచున్నది. ఈ అతిదేశ ప్రయోగ విధానము మిగుల బహుళమగుటచే జైమిన్యాచార్యుడు సప్తమాష్టమాధ్యాయముల రెండింటిని యుపయోగించి దీని ప్రాధాన్యతను ప్రస్ఫుటపరచియుండిరి.

---

# ఊహా బాధా తంత్ర ప్రసంగములు

నవమాధ్యాయమున ఊహాప్రయోజనము వివరింపబడియున్నది. యాజ్ఞికవచనార్థముల నవసర మేర్పడినప్పుడు ఊహ నుపయోగించియు భావమును గ్రహింపవలెనని మీమాంసా తాత్పర్యము. అట్లే దశమాధ్యాయమున బాధాలక్షణము వివరింపబడియున్నది. అనగా ఒక వాక్య ప్రాధాన్యతచేత మరొక వాక్యము అప్రాధాన్యత నొంది నివారింపబడుటయని గ్రాహ్యము. అటులే ఏకాదశాధ్యాయమున తంత్రముగూడ వర్ణింపబడియున్నది. 'యత్ సకృదనుష్ఠితం బహూనాముపకారకం భవతి తత్తంత్రం' (11.1.1 సుబోధిని) సకృత్తుగా అనుష్ఠింపబడుచు ఎక్కువ ఉపకారకముగ నుండునది తంత్రమని నిర్వచనము. ద్వాదశాధ్యాయమున ప్రసంగవివరణము గావింపబడియున్నది. 'అనేకోద్దేశేన సకృదనుష్ఠానం తంత్రం' అనేకోద్దేశములచే దరచు అనుష్ఠింపబడునది తంత్రమగుచుండ 'ఏకోద్దేశేన అనుష్ఠితమప్యంగం దేశకాలకర్తృణామేకత్వే అనుద్దేశ్యమప్యన్యం ఉపకారో తత్యన్యత్ర ప్రసక్త్యాత్మకః ప్రసంగః' అనురీతి ఏక ఉద్దేశ్యముచే అనుష్ఠితమై దేశకాల కర్తల ఏకత్వముకలిగి అనుద్దేశ్యమైనను ఇతరమగు ఉపకారాపేక్షితమై యితరత్ర ప్రసక్తించునది ప్రసంగమని నిర్వచింపబడియున్నది. పై విధానముగ మీమాంసాశాస్త్రము ద్వాదశలక్షణోపేత ధర్మనిర్వచనము గావించి, ద్వాదశాధ్యాయములమీమాంసా శాస్త్రమును సమాప్తిగావించుచున్నది.

## యజ్ఞము

పూర్వమీమాంసాశాస్త్రము ధర్మలక్షణ నిర్వచనము ద్వారా యింత ప్రాధాన్యత యిచ్చి పరిశీలించి, విమర్శించి నిర్ణయించియున్న యజ్ఞయాగాది కర్మలనుగూర్చియు కొంత గ్రహింపవలయునుగదా. 'యజతి చోదనా ద్రవ్య దేవతా క్రియం సముదాయే కృతార్థత్వాత్' (4.2.27) ద్రవ్య దేవతలయొక్క సంబంధముల విధివాక్యములద్వారా యజించుట యాగమనబడును. అది 'తదుక్తే శ్రవణాజ్జుహోతి రాసేచనాధికః స్యాత్' (4.2.28) ద్రవ్యమునకు విరుద్ధమైన అగ్నితో సంయోగమను వ్యవహారమున, అగ్నిలో నట్టి ద్రవ్యము నుంచుట యనబడు హోమక్రియను, 'దదాతి రుత్సర్గపూర్వకః పరస్వత్వేన సంబంధః' (4.2.29) స్వంత ద్రవ్యముల స్వత్వము వర్జించి యితరుల కొసంగుటయను దానమును, ముఖ్యాంగములుగా గలిగియుండును.

'వసంతే బ్రాహ్మణోఽగ్నీనాదధీత, గ్రీష్మే రాజన్యః, శరది వైశ్యః' (6.1.26 వృ) అన్నటుల ఆయావర్ణములకు యాగనిర్వహణమునకు కాలనిర్ణయము గావింపబడియున్నది. అంతియగాక 'పయోవ్రతం బ్రాహ్మణస్య, యవాగూ రాజన్యస్య, ఆమిక్షా వైశ్యస్య' (పూ. మీ. సూ. వృ 6.1.28) క్షీర పానమాత్రమున గావించు వ్రతము బ్రాహ్మణులకును, యవల భుజించి చేయునవి రాజులకును, దధ్యాదిక ఆహారమున వైశ్యులును యజింపవలెననియు నియమముగలదు, మరియు 'దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత'

'జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత,' 'సౌర్యం చరు నిర్వపేత్ బ్రహ్మవర్చసకామః' 'బుద్ధికామాః సత్రమాసీరన్' 'చాతుర్మాస్యేన యజేత స్వర్గకామః' మొదలగు యజ్ఞములు ముఖ్యముగా బ్రాహ్మణపరములు. 'వాజపేయేన స్వారాజ్యకామో యజేత' 'రాజా రాజసూయేన స్వారాజ్యకామో యజేత' 'పౌండరీకేణైకాదశరాత్రేణ స్వారాజ్యకామో యజేత' మొదలగు క్రతువులు క్షత్రియుల కుపయుక్తము. 'చిత్రయా యజేత పశుకామః' 'కారీర్యా వృష్టికామో యజేత' 'శ్యేనేన నాభిచరన్ యజేత' 'ప్రజాకామో యజేత' 'గ్రామకామో యజేత' మొదలగు యాగములు వైశ్యప్రయుక్తములు. సర్వకామఫలముల నొసంగు విశ్వజిద్యజ్ఞమును, ఆయుర్వృద్ధినొసంగు ప్రాజాపత్యాదిక యాగములును, సర్వవర్ణోపయుక్తములుగా నున్నవి.

---

## అపూర్వము

ఈ యజ్ఞాదులలో గొన్నింటి ఫలితములు స్వర్గాదులగుటయు, ఆస్వర్గాదిఫలములు మరణానంతరమే కలుగుటయు, యజ్ఞములన్నవో తాత్కాలికములై చేయబడిన వెంటనే అంతమొందుటయు జరుగుచున్నవి. అట్టిచో యీయజ్ఞకర్మ స్వర్గాదుల నెట్లు కలుగజేయునను సందియము పొడగటును (2.1.1–4). అటి యాగముయొక్క—

స్వర్గసాధనత్వమునకై 'చోదనా పునరారంభః' (2.1.5) అపూర్వమను శక్తి యొకటి గలదని నిరూపించిరి. యజ్ఞకాలమున నది యుద్భవమై యజ్ఞకర్త ననుసరించియుండి మరణానంతరమున స్వర్గాది ఫలముల నన్నింటి నిది కర్తకు సంప్రాప్తింపజేయును. 'తతశ్చ యాగాదేరపూర్వద్వారా స్వర్గసాధనత్వం, న సాక్షాత్' అను మీమాంసాపరిభాషా వాక్యరీతి యాగములయొక్క స్వర్గసాధనత్వము అపూర్వము ద్వారముననే జరుగునుగాని సాక్షాత్తుగ జరుగదని నిర్ధారణము. అట్టి ఫలితముల నొసంగు సామర్థ్యములు గలదియే 'తదేవ ఫలాపూర్వం' అదియే పర్యవసాన అపూర్వమని గ్రాహ్యము. 'ఫలాపూర్వ'మను యీ పర్యవసాన అపూర్వమునకు సహకారులుగా దీనిచే నిర్మింపబడిన ఉత్పత్త్యపూర్వములు కొన్నియుండును. ఈయుత్పత్త్యపూర్వములు ముఖ్యయజ్ఞమునకు అంగములుగనున్న చిన్నకర్మల ముఖ్యయాగమున కనుసంధించుట కుపయుక్తములు. అనగా ప్రధాన యజ్ఞఫలితముగనున్న అపూర్వమహిమచే, ఆయజ్ఞగత అప్రధానకర్మల నొక్కొక్కదాని కొక్కొక్క ఉత్పత్త్యపూర్వము జనించి పరస్పర సంధానమొనరించి, ఫలాపూర్వ కార్యమునకు తోడ్పడుచుండునని తాత్పర్యము. 'దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత' అనుచోట, పూర్ణిమ అమావాస్య కాలముల నాచరింపబడు యీ రెండు యాగములద్వారా, స్వర్గప్రాప్తిహేతువగు ఫలాపూర్వము గలిగింపవలెను. ... పూర్ణిమ అమావాస్యాదిక కర్మలు

ఏకకాలికములు గాదు. అందుచే యీరెంటిని ఉత్పత్త్యపూర్వములు సమ్మేళనపరచును. అనగా నాఙ్గాకర్మ కొఙ్గాఉత్పత్త్యపూర్వము జనించి, అవి ఏకమై మహాపూర్వమై ఫలాపూర్వనామమున ఫలప్రాప్తియగు స్వర్గమును కలుగజేయును.

---

## స్వర్గము

పూర్వగ్రంథమున చూచినప్రకారము యజ్ఞయాగాది కర్మజన్యమగు ఫలాపూర్వమహిమచే 'జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత' అను మొదలగు వాక్యములద్వారమున స్వర్గప్రాప్తి గలుగునని తెలియుచున్నది. కాని ప్రత్యక్షముగ స్వర్గ నిర్వచనముగాని వివరమునుగాని జైమిన్యాచార్యుడు గావించియుండలేదు. యాగాది కర్మముల స్వర్గాది ఫలసాధనత్వాధికరణమున నిసుమంత చర్చించియున్నాడు. సుఖమే స్వర్గశబ్దార్థమని ద్యోతకమగును. (6. 1. 2). అటులే క్రత్వర్థపురుషార్థమోక్షణాధికరణమున శాస్త్రజన్య జ్ఞానమువలన గలుగు యిచ్ఛావిషయ సాధనత్వమే పురుషార్థలక్షణమనియు అదియే యాగాదిక ఫలరూప స్వర్గమనియు తెలుపుచున్నాడు. మరల విశ్వజిదాది స్వర్గఫలకార్యాధికరణమున 'సః స్వర్గః స్యాత్సర్వాన్ ప్రత్యవిశిష్టత్వాత్' (4. 3. 15) అను సూత్రమున నిరతి

శయ సుఖరూపమును శాస్త్రలోకప్రసిద్ధమును స్వర్గమని వాకొనుచు, అది సర్వాభిలషణీయ సాధారణ విషయమని తెలిపియున్నాడు. అందుచే మీమాంసాశాస్త్ర గమ్యము ముక్తినాబడు కైవల్యాదికముగాక, సర్వభోగాయుక్తమగు స్వర్గమే యగుచున్నది.

---

## ఈశ్వరుడు

పూర్వమీమాంసాదర్శనము నంతయు గాలించినను, ఉపనిషత్ప్రతిపాదిత బ్రహ్మప్రశంసగాని పురాణప్రోక్త ఈశ్వరాది నామములుగాని అగోచరము. కాని దేవతాశబ్దము ఎల్లచోట్ల ప్రత్యక్షమే. 'దేవతాయాం చ తదర్థత్వాత్' (6. 3. 19) 'న దేవతాగ్నిశబ్దక్రియమన్యార్థసంయోగాత్' (6. 3. 18) 'దేవతా వా ప్రయోజనాత్ ...' (9. 1. 6) మొదలగు సూత్రముల నాశబ్దము వ్యక్తము. అటులే 'ధర్మాద్వా స్యాత్ప్రజాపతిః' (10. 8. 50), విష్ణుర్వా స్యాత్ ...' (10. 8. 52) 'సుబ్రహ్మణ్యా తు తంత్రం...' (11. 3. 20) మొదలగు సూత్రముల కొన్ని దేవతా నామములును గోచరము. కాని మీమాంసాశాస్త్రమున వేదము వోలె జగత్తుగూడ నిత్యమగుటచే వేదనిర్మాణమునకుగాని విశ్వసృష్టిప్రళయములకుగాని ఒక ప్రత్యేకమగు ఈశ్వరుడు అనావశ్యక మయ్యెను. అందుచే యీశాస్త్రమున సర్వా

కర్మ ఫలదాయుడై సర్వశక్తుడై, సర్వజ్ఞుడైన ఈశ్వరుడు లేడు. అటులే మరణానంతరమున స్వర్గాదిభోగములగాని జన్మరాహిత్యాదిక మోక్షముగాని ప్రసాదింప ఈశ్వరుడును అవసరము లేక, ఆశాస్త్రము వేదప్రోక్త యజ్ఞాదుల, సర్వసమర్థములై అపూర్వ ప్రాభవమున స్వర్గాది నిరతిశయానందముల గలుగజేయుచుండుటచే శాస్త్రమున సూచితమైన అగ్ని, వసు, సోమ, రుద్ర, ఇంద్ర, మరుత్, వరుణ, ఆదిత్య, విశ్వదేవ, విష్ణు మొదలగు దేవతాగణమంతయు పూర్తిగ అప్రధానమై యజ్ఞయాగాది కార్యముల నుపయుక్తములగు ద్రవ్యాదులవలె నుపకరణములుమాత్రముగనే యలరారుచున్నారు. వారు ఒక్కొక్కరు ఒక్కొక్క యజ్ఞమునకు అధిష్ఠాన దైవతములై, ఆయా యజ్ఞముల నర్పించు హవిర్ద్రవ్యముల మాత్రము స్వీకరింప సమర్థులుమాత్రముగనే రూపొందింపబడి యుండిరని గ్రాహ్యము. వీరిలో ఇతర దేవతాగణము అప్రత్యక్షమై యుండుటచేత, ప్రత్యక్షదైవమగు అగ్నినే వారిలో ప్రథమముగా 'అగ్నిరగ్రే ప్రథమో దేవతానాం' అను శ్రుతివాక్యమురీతి దేవతలు ఏర్పాటుచేసికొని. అతని ద్వారా హవిస్సుల స్వీకరింతురని తాత్పర్యము. అందుచేతనే అతడు ప్రత్యక్షదైవమై ఆరాధింపబడుచుండును.

## సమాప్తి

ఇంతవరకు మీమాంసాదర్శనమును సాకల్యముగ పరిశీలించి చూచితిమి. ప్రాపంచిక జీవితపాశముల నిరికి దుఃఖ నిమగ్నుడై యున్న అజ్ఞ మానవుని యీ శాస్త్రము, కామ్య, నైమిత్తికాది కర్మలద్వారా ప్రాపంచిక విషయములనుండి మరలించి, నిష్కామ్యముతో గూడిన నిత్యకర్మల ననుష్ఠింప జేసి దాన నతనికి 'కర్మణా చిత్తశుద్ధిః' అనురీతి చిత్తశుద్ధిని ప్రసాదింపజేయుచున్నది. అట్టి మానవునకు వెంటనే ఈశ్వరప్రస్తావన మసముచితము భయానక మగుట చేత నీశాస్త్రము ఈశ్వరునే విస్మరించినదని గ్రహింప వలెను. అట్లు కర్మల సేయగా 'తద్యథేహ కర్మచితో లోకక్షీయతే ఏవమేవాముత్ర పుణ్యచితో లోకక్షీయతే' (ఛాం. 8. 1. 6) 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి' (గీ. 9. 21) 'పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేద మాయాత్ నాస్త్యకృతః కృతేన' (ముం. 1.2.12) అను శ్రుతివాక్యములరీతి కర్మసంపాదిత ఫలములన్నియు నశ్వరములుగా ప్రత్యక్షానుభవముగా గ్రహించియుండుటచే నిక్లో పూర్వార్జిత స్వర్గాదులుగూడ క్షణికములే యని గ్రహించి శాశ్వతానంద సంప్రాప్తియన నేదో నెఱుంగ నిర్వేదమును పొంది విరాగమున శ్రోత్రియత్వ బ్రహ్మనిష్ఠత్వములుగల సద్గురువు నాశ్రయించి, తరణోపాయము నర్థించి, సాధన సంపన్న సంయుక్తుడై తపించి సాధ్యమును పొంది కైవల్యమున జన్మరహితుడై ఆనందస్వరూపుడై యుండజేయుచున్నది.

అనగా నీశాస్త్రము అట్టి అవకాశములకు ప్రథమముగా నగుచుండుటచే ఆధ్యాత్మికపథమున దీని యునికి అత్యంత ప్రాబల్యమని పండితోద్దేశము. అందుచేతనే యిందు తాత్త్వికవిషయములు పూర్తిగ లోపించియున్నను మహర్షులు షడ్దర్శనములలో జేర్చి గౌరవించియుండిరి. అజ్ఞానిని సంస్కరించుకార్యమును ధరించిన దగుటచేతనే మీమాంసాదర్శనము, యితర దర్శనములవలె లౌకికవిషయము పరిశీలింప మౌనముధరింపక, పామరునకు ప్రాపంచిక జీవనావిధానమున అనేక నియమముల నిర్మించి, శాసించి, వాని నిత్యజీవనమునుగూడ నియమించి క్రమమొనర్ప నిత్యకర్మవిధానమును ప్రసాదించి, అనుక్షణము వాని యండయై తోడునీడయై పాపమునుండి నివృత్తునిగజేయుచు, పుణ్యరతిని అభివృద్ధిగావించుచు, వాని యంగరక్షకస్థానము నలంకరించి యుండుట మహోత్కృష్టము. అందుచేతనే అది అతని వ్యవహారములగూడ ప్రవేశించి, ప్రవర్తనావిధానమును నేర్పి శిక్షణమొనరించి, దుర్నడతకు పాల్పడినవారి శిక్షించు ధర్మశాస్త్రమైగూడ యలరారుచున్నది. కాన నిందు తాత్త్విక విషయలోపమునే గాంచి, నిష్ప్రయోజనముగ దలంపక నాతాత్త్విక సంపన్నతకు ప్రాతిపదికయగుట నెరింగి దీని విశ్వసించి, అనుష్ఠించి, పరమగమ్యమగు అపవర్గమునొంద యత్నింప నుద్యుక్తు లగుదురుగాక!

హరిః ఓం తత్ సత్

# సర్వ సిద్ధాంత సౌరభము

## దర్శనఖండము

## వేదాంత దర్శనము

ఓం

# వేదాంతదర్శనము

## ఉపోద్ఘాతము

### ప్రాచీన భారత ప్రశస్తి

వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషం
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిం॥
బ్రహ్మసూత్రకృతే తస్మై వ్యాసాయా పరవేధసే
జ్ఞానశక్త్యావతారాయ నమో భగవతో హరేః॥ వాచస్పతి-భామతి

In the whole world there is no religion or philosophy so sublime and elevating as the Vedanta[1] మొత్తము ప్రపంచములో వేదాంతమునుబోలు దివ్యమును ఉత్తేజకరమును అగు మతముగాని తత్త్వశాస్త్రముగాని లేదని జర్మను తత్త్వవేత్తయగు Schopenhaur షొపెన్హారు పండితునిచే నుతింపబడిన వేదాంతశాస్త్రము, The Upanishads - the dawn of the religious consciousness of man - one of the most inspiring and hallowing sights in the whole history of the world[2] మానవాధ్యాత్మిక

1. Schopenhaur Swami Rama Tirtha, vol. 7. p 112.
2. Prof. F. Max Muller : Sacred books of the East.

జ్ఞానోదయస్వరూపమైన యుపనిషత్తులు సంపూర్ణ ప్రపంచ చరిత్రలో పరమపవిత్రమును, సర్వోత్తమమును ఉత్సాహ కరమునగు దృశ్యములని మాక్సుముల్లరు మహాశయునిచే పూజింపబడిన వేదాంతనామక యుపనిషజ్జనితమై 'కృష్ణ ద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం ప్రభుం'[3] అని శ్రీ శంకరులచేతను There has been no other man greater than Vyasa in this world[4] వ్యాసభగవానునికి మించిన గొప్పవాడు యీప్రపంచములో లేడని జి. కె. శాస్త్రిచేతను, Badarayana is to us an intellectual power[5] బాదరాయ ణుడు మనకొక జ్ఞానశక్తి యని మాక్సుముల్లరుచేతను స్తుతింప బడిన వ్యాసభగవానునిచే నుల్లేఖింపబడి, Sankara, the greatest mind that ever dwelt in mortal body[6] మర్త్యదేహమున నెప్పుడును వసించని మహోన్నత ధీస్వరూ పమైన శ్రీ శంకరులచేతను, విశాలహృదయ సంశోభితు డగు రామానుజునిచేతను నింక యనేక భాష్యకారులచే భాషింపబడి, There can be no denying that ancient Hindus possess the knowledge of true God. Their philosophy, their thought is so elevating so sublime, so accurate and true, that any comparison with the writings of the Europeans like a Promethean fire stolen from heaven

3. శ్రీ శంకరభగవత్పాదులు : విష్ణుసహస్రనామ భాష్యము. 72.

4. G. K. Shastri · Sri Bhagavadgita. p. 11

5. Prof. F Max Muller The six systems of Indian Philosophy. p. 116

6. Duglas Grant Duff Ainslie . 'The Science of Religion' of Swami Yogananda

as in the presence of the full glow of the noon-day-Sun[7] ప్రాచీనభారతీయులు యథార్థమైన భగవంతునివిజ్ఞానము కలిగియుండిరనుట కెట్టి నిరాకృతియు లేదు. వారి తత్వ శాస్త్రము, వారి విజ్ఞానము చాల పవిత్రము, ఉన్నతము, నిర్దుష్టము, సత్యమునై ప్రకాశించును. వానితో యూరోపు పండితుల రచనల పోల్చినచో జ్వాజ్వల్యమానముగు మాధ్యందినమార్తాండునిఎదుట స్వర్గమునుండి యపహరింప బడిన ప్రొమిథియాగ్ని కణమువలె నుండునని పరాసు తత్వ శాస్త్ర చరిత్రాకథకుడైన విక్టరు కజిన్ చేతను, It cannot be denied that the early Indians possessed a knowledge of the true God; all their writings are replete with sentiments and expressions, noble, clear, and severely grand, and deeply conceived and reverentially expressed as in any human language in which man have spoken of their God[7] యథార్థమైన భగవంతునిగూర్చినజ్ఞానము ప్రాచీనభారతీయులకు గలదనుట కాదనజాలము. వారి రచనలు దివ్యమై, స్పష్టమై, అత్యంతాద్భుత భావ సంపూర్ణమైయుండి, నిగూఢముగ భావింపబడి, ఏమానవభాషలో నైనను తమతమ భగవంతుని ఎట్లు వచించినట్లుగలదో అట్లే నుచ్చరింపబడియున్నవని షెగెల్ పండితునిచేతను సంస్తుతింపబడిన భారతీయ ప్రాచీనసంస్కృత స్వరూపమునకు ముఖ్యకారణమై వేదాంతశాస్త్రము వెలుగొందియున్నది.

---

7. Swami Rama Tirtha. The complete works Vol 7. p. 113

ఆకాలమున India was once the head of the world[8] ప్రపంచమునకే మేధాస్వరూపముగ భారత ముండెనను రామతీర్థుని వాక్యసరణి విజృంభించి, Your Grecian philosophers like Plato, Socrates, Pythogoras, your Plotinus owe their inspiration to East India[8] మీ గ్రీకుతత్త్వవేత్తలైన ప్లేటో, సోక్రటీసు, పైథాగొరస్ మీ ప్లాటినసులు ప్రాగ్భూమియగు భారతమునుండియే వారి భావముల గ్రహించిరనియు రామతీర్థు డుపన్యసించినట్లు సర్వప్రపంచమునకు విజ్ఞానప్రదాత్రియై తేజోస్వరూపమై భారతావని రాణించియున్నది.

అట్టి పరమపావనశక్తి. భారతశక్తి More than five thousand years ago, while the fore-fathers of Briton and Gaul, Greek and Latin, were roaming the vast forests of Europe in search of food, true barbarians, the Hindu was already engaged in pondering the mystery of life and death[9] ఐదువేల సంవత్సరములకు పూర్వము బ్రిటను, గాల్, గ్రీకు, లాటినుదేశ ప్రాచీనులు యూరోపుదేశ యరణ్యముల నాహారార్థమై ఆటవికులవలె గ్రుమ్మరుచుండ భారతీయులు జననమరణ రహస్యముల గూర్చి యోచనానిమగ్నులై యుండిరను డగ్లస్ వాక్యములరీతి యుండి, గ్రీసు పుట్టకపూర్వమే, రోము భావన కందనినాడే, యూరోపు దేశస్థులు మేన రంగు

8. Swami Rama Tirtha : The complete works vol 7 p. 122
9. Duglas Grant Duff Ainslie . 'The Science of Religion' of Swami Yogananda

ధరించి యరణ్యము లగ్రుమ్మరు కాలముననే Even earlier, when history had no record and traditions dare not peer into the gloom of that intense past, even from them until now [10] ఇంక పూర్వము చరిత్రకు ప్రమాణము లభావమై సంప్రదాయములు తొంగిచూడ భయమొందు నా గాఢాంధకార భూతకాలమునుండి నేటివరకు like the gentle dew that falls unseen and unheard and brings into blossom the fairest roses, [11] అగోచరముగ అశ్రుతముగ వర్షించి అత్యంత సుందరమగు గులాబిని వికసింపజేయు మృదు తుషార బిందువువలె Ideas after ideas have marched out from her [11] ఆమెనుండి భావపరంపరలు ప్రవహించి, Silent imperceived, yet omnipotent in its effects, it has revolutionised the thought of the world [11] మెల్లగా అదృశ్యముగా, నయినను తన ఫలితములచే నతి శక్తియుక్తమై అది ప్రపంచ విజ్ఞానమునే తలక్రిందులు చేసినదని వివేకానందుని గంభీర వచనములు. The Philosophy of India percolates through out the whole civilized world, modifying and permeating as it goes [12] భారతీయ తత్త్వశాస్త్రము నాగరిక ప్రపంచము నంతటిని చుట్టిముట్టుచు పోనుపోను సంస్కరించుచు, అనుస్యూతమగుచు పోయినదనియు వివేకానందులు వచించియున్నారు.

10. Swami Vivekananda : The complete works vol. 3. p. 106
11. Swami Vivekananda : The complete works vol. 3. p. 253
12. Swami Vivekananda . The complete works vol. 2. p. 382

'జ్ఞానస్య పారగమాత్ ఋషిః' జ్ఞానముయొక్క పారమును గాంచినవాడే ఋషియను అమర నిర్వచనము ప్రకారము జ్ఞానసంపన్నులై యుపనిషత్కాలమునాడే ఆధ్యాత్మిక విద్యావిషయ ప్రాపకమునకై, ప్రోత్సాహమునకై మహారాజు ఆస్థానములందు గొప్పగొప్ప సభల నేర్పాటు గావించుచు, విషయముల జర్చించుచు, విద్యానిధుల సత్కరించుచు నాటి భారతావని ఆధ్యాత్మికవిద్యాపోషణ గావించియున్నది ఆ సభల కచ్ప్రరు వందుచు Do we know any other country where at that early time such religious congresses would have been thought of... [13] నిట్టి పారమార్థిక సమ్మేళనముల నట్టి యతి ప్రాచీనకాలమున నేయితరదేశమైనను భావించుటయైనను మనము గాంచితిమా యని మాక్సుముల్లరు పండితుడు వాకొనియున్నాడు. అట్టి మహాదవకాశములు నాటి భారతమున లభించియుండుటచేతనే The Six Systems in which the philosophical thought of India has found its full realisation [14] భారతీయ తత్త్వశాస్త్రము సంపూర్ణతను షడ్దర్శనములలో గాంచియున్నదని మాక్సుముల్లరు వచించినట్లు సర్వాకర్షణీయ భారత విజ్ఞాన మసాధారణలీల పరిణమించి సర్వప్రపంచ విద్వాంసుల నద్భుతాశ్చర్యచకితుల గావించివేసినది. ప్రపంచ శాశ్వత సమస్యల గూర్చి the most highly gifted races of mankind [15] మానవ

13. Prof. F. Max Muller ; The six systems of Indian Philosophy 2
14. Prof. F. Max Muller : The six systems of Indian Philosophy vi
15. Prof. Garbė : Sankhya Sutra

లోకమున నత్యధిక ప్రజ్ఞా ధురీణులైన జాతిచే ప్రసాదింప బడిన నిర్ణయముల ప్రాక్పశ్చిమ పండితాగ్రేసరులెల్లరు గ్రహింప నాతురతబడుచున్నారని ఆచార్య గార్బ యనునట్లు The eyes of the whole world are now turned towards this land of India for spiritual food, and India has to provide it for all the races. Here alone is the best ideal for mankind [16] ఆధ్యాత్మికా హారముకొరకు సర్వప్రపంచముయొక్క నేత్రములు భారత భూమి దిక్కునకు మరలినవి. సర్వజాతులకు భారతమాత దాని ప్రసాదింపవలయును. మానవలోకమున కుత్తమాద ర్శము యిచ్చటనే యున్నదని వివేకానందస్వామియు ఘంటా పథముగ వక్కాణించియున్నాడు.

లుప్తమైయున్న మన ప్రాచీన వాఙ్మయసాగరమును నన్వేషించి ప్రపంచమును గాలించి సేకరించుచున్న భారత ప్రభుత్వము యిటీవల ఏబదివేల గ్రంథముల సేకరింపగలగగా హృదయ ముప్పొంగి, Shows how extra-ordinarily abundant must have been the literary, dramatic philosophical and other productions of old times [17] సాహిత్య నాటక, తాత్త్వికాది ప్రాచీనకాల రచనలు అద్భుతముగ అనంతముగ నెట్లుండియున్నది దీనివలన గోచరమని జవహారిలాల్ నెహ్రూ పండితుడు సగర్వముగ పలికెను. అట్టి భారతీయ ప్రాచీనాధ్యాత్మిక విజ్ఞానప్రభావమును దిల

16. Swami Vivekananda : The complete works vol. 3. p. 138
17. Pandit Jawaharlal Nehru : Discovery of India p. 70

కించి ఆనందించి, గర్వించి, యుప్పొంగనివాడు భారతీయుడన జెల్లడు. కాని ఆధునిక ప్రపంచము ఆధ్యాత్మిక భిక్షకై పూర్వముకంటె నెక్కువగ భారతావనిపై నాధారపడి యుండుటచే, There is stillness and everlastingness about the past ...... and one may even sense a spiritual quality [18] భూతకాలమున ప్రశాంతతయు నిత్యమును గలవు. దానిలో నాధ్యాత్మికస్థితియు గోచరము. We have come from the past, we are its products and we live immersed in it [18] మనము ఆభూతకాలము నుండియే జనించితిమి. మనము దాని కార్యరూపులమై దానియందే మగ్నులమై యున్నాము. But it is not life unless we can find the vital link between it and the present [18] కాని ప్రస్తుతకాలమునకు దానికి యనుసంధానమును గాంచకున్నచో అది జీవనమే కాక పోవునను జవహర్లాల్ నెహ్రూ వాక్యముల బాటించి, మన ప్రాచీనాధ్యాత్మిక సంస్కృతిని ఆధునాతనమున మరల నుజ్జీవింపజేసి సర్వప్రపంచ గురుస్థానమున భారతిని పునః ప్రతిష్ఠగావింప బద్ధకంకణ హస్తుల మగుదుముగాక!

---

18. Pandit Jawaharlal Nehru: Discovery of India p. 5

'సర్వ దృగ్వ్యాసో వాచస్పతి రయోనిజః'[19] సర్వజ్ఞాన ములను విస్తారపరచుటచేతను, సర్వాకార జ్ఞానము గలిగి యుండుటచేత సర్వదృక్కనబడుచు, విద్యాపతియని ప్రఖ్యాతి బొంది 'వీతశోకభయః శాంత నిర్వాణో గతకల్మషః। జీవ న్ముక్తో జితమనా వ్యాసోయమితి వర్ణితః॥' శోక భయ రహితుడై శాంతుడై నిర్మోహుడును, జితేంద్రియు డును జీవన్ముక్తుడును అని వ్యాసుడు ప్రఖ్యాతుడు అని యోగవాసిష్ఠముచే నుతింపబడిన శ్రీ వేదవ్యాసుడును, దర్శన షట్కమున భౌతికవిషయముల జర్చించు న్యాయ వైశేషిక ములకంటె, మానసికచర్చ గావించు సాంఖ్య యోగముల కంటె, ఆధ్యాత్మిక పథమున ప్రాథమికమగు కర్మానుష్ఠాన నియతిని మీమాంసించు జైమినీయ దర్శనముకంటె నుత్కృ ష్టమై సర్వసృష్టి కాధారభూతమగు జీవ బ్రహ్మముల శోధించి తీర్మానించు ఉత్తరమీమాంసా దర్శనమును నిర్మించి సర్వ ప్రపంచాధ్యాత్మిక విజ్ఞానమునకు అమోఘ భూషణరాజమై వెలుగొందిన శ్రీ బాదరాయణు డెవరో యొకించుక యోచించి గ్రహించెదముగాక!

As to Badarayana, the reputed author of the Vedanta Sutras, we had to confess before that we know nothing about him. He is to us a name and an intelle-

19. శ్రీ శంకర భగవత్పాదులు : విష్ణుసహస్రనామభాష్యము

ctual power but nothing else[20] వేదాంత సూత్రములకు ప్రఖ్యాత కర్తయగు బాదరాయణునిగూర్చి మనకేమియు తెలియదని మనము ఒప్పుకొనవలెను. అతడు మనకొక ప్రజ్ఞాశక్తియై నామమాత్రముగ నున్నాడు అని మాక్సు ముల్లరు మహాశయుడును, ఆమహాపురుషుని గురించి మనకు దెలియదు కాని, Tradition identifies him with Vyasa, the author of the Gita and the Mahabharata[21] ఆతడే గీతా మహాభారత కర్తయైన వ్యాసుడని ఆచారము తెలుపుచున్నదని వీరేశ్వరానందులును వచించియున్నారు. ఈవిషయమునే పరిశీలించి, 4. 3. 110 సూత్రమున పాణిన్యాచార్యుడు భిక్షుసూత్ర ప్రశంస గావించి, దానికర్త పారాశర్యునిగా వివరించియుండుటచే వాచస్పతి మిశ్రుడు భిక్షుసూత్రములే వేదాంతసూత్రములనియు, పరాశర సత్యవతీ సూనుడే పారాశర్యుడనియు నాశాస్త్రావలంబకులు పారాశర్యులనియు దీర్మానించుట గమనింపదగినదని హెచ్చరించుచు, Parasarya, the son of Parasara i. e., the Vedavysa who was also called Badarayana as he had his Asrama at Badari in the Himalayas[21] పారాశర్యుడు పరాశరు పుత్రుడైన వేదవ్యాసుడే యనియు హిమగిరిగల బదరీ నారాయణమున ఆశ్రమమున నుండుటచే బాదరాయణుడుగా వ్యవహారము గలదనియు వీరేశ్వరానందులు నిర్ణయించిరి. ఈ అభిప్రాయమునే మాక్సుముల్లరుగూడ వెలి

20. Prof. F. Max Muller The six systems of Indian Philosophy p.116
21. Swami Veereswarananda · Brahma Sutras p. 6

బుచ్చెను.[22] అందుచేత Badarayana called also Vyasa Dwaipayana or Krishna Dwaipayana, the reputed author of the Brahma Sutras called also Uttara Mimamsa or Vyasa Sutras[23] ఉత్తరమీమాంస, వ్యాస సూత్రములనియు ప్రశస్తమైన బ్రహ్మసూత్రములకు ప్రముఖ కర్తయైన బాదరాయణుడు వ్యాసద్వైపాయనుడనియు కృష్ణ ద్వైపాయనుడనియు వ్యవహరింపబడును అని మాక్సుముల్లరు తీర్మానించియున్నాడు. అందుచే నీబాదరాయణ వ్యాసుని జీవితవిశేషముల క్లుప్తముగ జూచెదముగాక!

'వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్రమకల్మషం। పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిం॥' అను స్తుతి గీతము వ్యాసభగవానుడు శక్తిమహర్షికి పౌత్రుడనియు వసిష్ఠ మహర్షికి మనుమడనియు (పుత్రిపుత్రుడు) పరాశరుని పుత్రుడును శుకబ్రహ్మ జనకుడనియు దెలుపుచున్నది. బృహదా రణ్యకోపనిషత్తులో మధుకాండకు సంబంధించియున్న గురు పరంపరలో జతుర్ముఖునినుండి ముప్పదియైదవ పారాశర్యుడు జాతుకర్ణ్యుని శిష్యుడుగా నుండెను. ఆ పారాశర్యునుండి పారాశర్యాయణుడు సూచింపబడియున్నాడు. మరియు, నలువదినాలుగవ గురువగు పారాశర్యుడొకడు భారద్వాజునకు శిష్యుడుగను, ప్రాచీనయోగ్యునకు గురువుగను నొప్పుచున్నాడు. ఆవిధముగ మధుకాండయందు, పారాశర్యులు యిరువురును, పారాశర్యాయణుడొకడును గోచ

22. Prof. F. Max Muller . The six systems of Indian Philosophy p. 117
23. Prof. F. Ma Muller : The six systems of Indian Philosophy p.83

రము. మరల నదే యుపనిషత్తులో చతుర్థాధ్యాయాంతర్గత గురుపరంపరలలో జాతుకర్ణ్యుని శిష్యుడు పరాశర్యుడును, ఆతని శిష్యుడు పారాశరాయణుడును అదేస్థానమున గోచరించుచున్నారు. ఆపరంపరలోనే నలువదియూరవ స్థానమున మరియొక పారాశర్యాయణుడు సూచింపబడియున్నాడు. ఆయుపనిషత్తు ఆరవయధ్యాయాంత పరంపరలో ముప్పది ఏడవ స్థానమున నొక పారాశరి పుత్రుడును, ముప్పది తొమ్మిదవ స్థానమున నొక పారాశరి సూనుడును. నలువది ఏడవ గురువుగ నొక పారాశరిసుతుడును, నలువదితొమ్మిదవ స్థానమున మరియొక పారాశరిపుత్రుడును గోచరము. కాని మన వ్యాసులు 'శక్తేః పౌత్రః' యనబడుటచే శక్తి సూనుడగు పరాశరుడే మనకు అవసరము. పూర్వోక్త చందము పరాశరులు బహుళముగ నుండుట వ్యక్తము. కాని శక్తిమహర్షి పుత్రుడగు పరాశరుని ప్రస్తావన ఋగ్వేదమున 1.5.8.65 సూత్రమున కానుపించుచున్నది. కూర్మపురాణవాక్యము ననుసరించి చూచినచో నిరువదిఏడవ వ్యాసుడని ప్రఖ్యాతి గనియున్న జాతుకర్ణ్యవ్యాసుని శిష్యుడే పరాశరసూనుడగు కృష్ణద్వైపాయన వ్యాసుడని తెలియు చున్నది. విష్ణు వాయుపురాణ వాక్యములును పైవాక్యమున కనుగుణముగ నుండుటచేతను, బృహదారణ్యక వచనమునగూడ జాతుకర్ణ్యుని శిష్యుడై ముప్పదియైదవ గురువుగ సూచింపబడియు నుండుటచే నతడే శక్తిపుత్రుడైన బాదరాయణుడని కృష్ణద్వైపాయనుడని వేదవ్యాసుడని

ప్రతీతిగాంచిన పారాశర్యుడని గ్రహింప నవకాశ మేర్పడు చున్నది.

---

## వ్యాస చరిత్రము

'పితా శుకస్య సర్వజ్ఞో గురుర్వ్యాసో మహామతిః' (2.3.3) అని యోగవాసిష్ఠముచేతను, 'కృష్ణద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం ప్రభుం' (విష్ణుసహస్రనామభాష్య. 72) అని శ్రీ శంకరులచేత సంస్తుతింపబడిన వేదవ్యాసభగవానులు 'ద్వాపరే సమనుప్రాప్తే తృతీయే యుగపర్యయే। జాతః పరాశరాద్యోగీ వాసవ్యాం కళయా హరేః॥' (శ్రీమద్భాగవత. 1.4.74) ద్వాపర త్రేతాయుగ సంగమకాలమున వాసవకన్య గర్భవాసమున హరికళవలన పరాశరునికి విజ్ఞానియైన వ్యాసుం డవతరించెను. ఆకన్య ఉపరిచర వసువు యొక్క పుత్రిక యగుటంజేసి వాసవియై వ్యావహారిక నామంబున సత్యవతి యగుటచే వ్యాసునకు వాసవేయుడనియు, సాత్యవతేయుడనియు నామాంతరంబులు గలవు. ఉపరిచరవసువను మహారాజు ఛేదిదేశాధిపతియై గిరికాదేవిని అర్ధాంగిగా గలిగియుండెను. యమునలో మత్స్యరూపమున నున్న అద్రిక యను అప్సరసకు నాతని కళాతిక సంపర్కమున మత్స్యరాజు మత్స్యగంధి యను ఇరువురు సంతాన మేర్పడెను. మత్స్యరాజు మత్స్యదేశాధినాథుడై వెలుగొంద

సత్యవతి నాబడు నామత్స్యగంధి దాశరాజుచే బెంపబడుచు యమునానదిలో పడవనడుపుచు కాలము గడుపుచుండెను. వసిష్ఠపౌత్రుడును, శక్తిపుత్రుడును అగు పరాశరమహర్షి సత్యవతిని గాంచి యోగప్రభావమున నాయమగర్భమున శ్రీహరి జన్మింపనుండుట గ్రహించి, యామె ననుగ్రహింప సద్యోగర్భమున నామెకు వెంటనే హరికళతో వేదవ్యాసు లుద్భవించిరి. ఆద్వీపమున శ్రీకృష్ణుడు వసించియుండుటచే నది కృష్ణద్వీపమని యనబడుచుండుట నాతనికి కృష్ణద్వైపా యను డనియు నామము గలిగెను. అట్లుగాక పగలే నా ముహూర్తమున పరాశరమహర్షి మహిమచే నాద్వీపమం తయు గాఢాంధకారమయ మగుటచే నాతడు కృష్ణద్వైపా యనుడని పిలువబడెనని కొందరి భావము. జన్మతోడనే బాలుండు జటాకమండలుధారియై మేరుపర్వతప్రాంత కర్ణి కారవనమునకు తపోదీక్షకై వెడలిపోయెనని పురాణపాఠము గలదు.

అట్లు హిమగిరి యరణ్యముల తీవ్రతపంబుననున్న కాలమున హోమార్థియై అరణులనబడు రెండు కర్రలను ఆతడు చిలుకుచుండ శివవరప్రసాదమున నాయరణులనుండి శుకు డుద్భవించెను. అట్లు శుకోత్పత్తికి ఘృతాచియను చిలుకరూపమున నాప్రాంతములగల అప్సరస కారణముగ నా బాలునకు శుకుడనియు ప్రతీతి యేర్పడెను. శుకుడైనను జన్మతః సిద్ధుడై బ్రహ్మజ్ఞానియై కాలగతమున పాండవపౌత్రు

డగు పరీక్షిత్తునకు భాగవతోపదేశికుడై అత్యంత ప్రఖ్యాతి నార్జించి శుకబ్రహ్మ యనియే వ్యవహరింపబడెను.

---

## వ్యాసుడు-భారతయుద్ధము

వ్యాసమహర్షియు మహాభారత యుద్ధకాలమునకు 214 సంవత్సరముల ప్రాయమువాడై యుద్ధానంతరము తన యసమాన తపోశక్తిచే దివంగతులైన యుద్ధవీరుల నందరిని దుఃఖసాగరమున మునింగియున్న ధృతరాష్ట్రాది యుద్ధశ్రేష్ఠులకు గోచరింపజేసి యానందింపజేసెను. అనగా వ్యాస భగవానుడు మానవునికి నిర్ణయమైన శతవర్ష కాలమే జీవింపక కొన్ని శతాబ్దముల కాలము జీవించి యనేక విధముల తన శక్తిసామర్థ్యములను తపోమహిమను ప్రదర్శించియుండెనని రాజవైద్య జి. కె. శాస్త్రి విశ్వాసము.[24]

---

## వ్యాస విన్యాసము

ఆ మహానుభావుడు తపోధనుడగుటయు, 'భగవాన్ వ్యాసః కరుణవత్సలః' (1.4.24) యని భాగవతపురాణముచే సంస్తుతింపబడినట్లు కృపావత్సలుడై అజ్ఞలోక త్రాణకార్య

---

24 G. K. Shastri: Sri Bhagavadgita p. o

దురంధరుడగు అధికారి యగుటచే 'ద్వాపరే ద్వాపరే విష్ణుర్వ్యాసరూపే మహామునే। వేదమేకం బహుధా కురుతే జగతో హితః॥' ద్వాపర ద్వాపర యుగమునను శ్రీమహా విష్ణువు మహామునియగు వ్యాసరూపమును దాల్చి ఏకముగా నున్న వేదమును జగత్తుయొక్క హితముగోరి విభజించుననను విష్ణుపురాణ ప్రమాణము ననుసరించి, వేదవిభజన కార్య ముండుట గ్రహించి, 'అక్కమూరుసి శ్రుతులన్నియును దృ। ఢావధానుండవై విని నీవు లెస్స। వ్యాసమొందింపుమనియె భీతి।' యనియు 'కాలమున గీడుకతమున గలగబడిన। వేద ముల నీవు నాడును విమలబుద్ధి నంచిత వ్యాసమొనరించి యఖిల దివిజ మునిగణముల కొనర్తు సమ్మోద మనఘ' (శాంతి. 6.—) యను మహాభారత వచనమురీతి శ్రుత్యా దులచే బ్రార్థింపబడి 'ఋగ్యజుః సామాథర్వాఖ్యా వేదాశ్చ త్వార ఉద్ధృతాః' (1.4.20) అను భాగవత వాక్యరూపమున నా శ్రుతుల ఋగ్సామ యజురథర్వణములుగ నాలుగుభాగముల విభజించెను. హిమపర్వత పంక్తిగల మేరుశిఖర ప్రాంతమున గల యావ్యాస భగవానుని 'ధారుణి పారాశర్యుని, కార్యులు పైలుడు సుమంతు జైమిని మునులున్। ధీరుడు వైశంపా యను డారయ నలువురును శిష్యులై యుండిరొగిన్' (11.29) ఆంధ్రభాగవతము తెలుపురీతి పైల సుమంత జైమిని వైశం పాయన ప్రముఖులు శిష్యులై విద్యనర్థించుచు నాశ్రయింప 'తత్ర ర్గ్వేదధరః పైలః సామగో జైమినిః కవిః। వైశంపాయన ఏవైకో నిష్ణాతో యజుషాంగణే॥' (1.4.21) 'అథర్వాంగిర

సామాసీత్ సుమన్తుర్దారుణో మునిః' (1.4.22) అను భాగవత వచనమురీతి పైలునకు ఋగ్వేదమును, జైమినికి సామవేదమును, వైశంపాయనునకు యజుర్వేదమును అథర్వాంగిరసమును సుమంతునకును ద్వైపాయనవ్యాసు లుపదేశించిరి. వారును ఆయావేదభాగముల శిష్య పరంపరద్వారా బహుళప్రచార మొనరించిరి.



## వ్యాసుడు - బ్రహ్మసూత్రము

అంతటితో నూరకుండక వ్యాసభగవానులు, ఆయా వేదశాఖలగల యుపనిషత్తులు విస్పష్టముగ తాత్త్వికవిషయ నిర్ధారణము గావించి జిజ్ఞాసువుల సందేహనివృత్తి గావింపక, ననేకార్థ సంభావ్యుష్టములై యొప్పారుటగాంచి 'కిమత్ర బహునోక్తేన వసిష్ఠమునిసత్తమ। వేదమార్గప్రతిష్ఠార్థం కృపయాహం మహామతే॥ మన్నియోద్ధరి సాక్షాదతీవ శ్రద్ధయా సహ। కృష్ణద్వైపాయనో భూత్వా మునే సూత్రం కరిష్యతి॥ జైమినిర్వ్యాసశిష్యస్తు మమాజ్ఞావశమాగతః। కర్మకాండ ప్రతిష్ఠార్థం గృహస్థో నియతేంద్రియః॥ యజ్ఞదానతపోయుక్తస్స్వయం సూత్రం కరిష్యతి। ఉభాభ్యాం సుస్థితో లోకే వేదమార్గో భవిష్యతి॥' (9. అ) అను పరాశర పురాణమురీతి వేదమార్గ ప్రతిష్ఠ సంకల్పించి, కృపతో మిక్కిలి శ్రద్ధతో శివాజ్ఞచే ముని కృష్ణద్వైపాయను డవతరించి వేదాంత

సూత్రముల నిర్మించెననియు, వ్యాసశిష్యుడైన జైమిన్యాచార్యుడు కర్మకాండ ప్రతిష్ఠార్థము మీమాంసాసూత్రముల నెలకొల్పినట్లును, ఈ రెండును లోకమున వేదమార్గ ప్రతిష్ఠాపనార్థము సంకల్పింపబడినవనియు ననురీతి, వ్యాసులు బ్రహ్మసూత్రముల నిర్మించిరి.



## వ్యాసుడు – మహాభారతము

మరియును, 'త్రిభిర్వర్షై రిదం పూర్ణం కృష్ణద్వైపాయనః ప్రభుః। అఖిలం భారతం చేదం చకార భగవానృషిః॥' (స్వ. 28.5.48) ప్రభువైన కృష్ణద్వైపాయనవ్యాసుడు సంవత్సరత్రయమున మహాభారతము నంతటిని లిఖించెనని మహాభారతమును, 'భారతమాఖ్యానం కృపయా మునినా కృతం' (1.4.25) కృపతో మునిచే భారతము చేయబడెనని భాగవతము వచించినట్లును, 'కృష్ణద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం ప్రభుం। కోహ్యన్యః పుండరీకాక్షాన్మహాభారత కృత్ భవేత్॥' (విష్ణుసహస్రనామభాష్య. 72) ప్రభువైన నారాయణునిగా కృష్ణద్వైపాయనుని గ్రహింపుము. మహాభారత కర్త ఆపుండరీకాక్షుడుగాక మరెవ్వరు అని నిర్ణయించు శ్రీశంకర వచనము ననుసరించియు శ్రీకృష్ణద్వైపాయనవ్యాసుడే మహాభారత పురాణ రచయిత యనియు గ్రాహ్యము. అంత 'నారదోఽశ్రావయత్ దేవాన్ అసితో

దేవలః పితౄన్ । రక్షోయక్షాన్ శుకో, మర్త్యాన్ వైశంపాయన ఏవ తు॥' (స్వా. 28.5.46) 'య ఇమాం సంహితాం పుణ్యాం పుత్రమధ్యాపయత్ శుకం' (28.5.59) నీమహాభారతమును దేవతలకు నారదమహర్షి యుపదేశించెను. పితృలోకమున అసిత, దేవల మహర్షులు బోధించిరి. యక్షరాక్షసులకు శుకబ్రహ్మ ప్రకటించెను. వైశంపాయనుడు దానిని మానవుల కుపదేశించెను. ఈ పవిత్ర మహాభారత సంహితను శుకునకు వ్యాసభగవానుడే అధ్యయనము చేయించెను. ఆవిధముగ మహాభారతము దశదిశల ప్రసరించి లోకోపకారియైనది.



## వ్యాసుడు – పురాణములు

శ్రీమద్భాగవత ప్రథమస్కంధముననే తెలుపబడి యున్నటుల నారదు పనుపున శ్రీవ్యాసుడు భాగవతగ్రంథము రచించుటయేగాక అష్టాదశ మహాపురాణములను ఉపపురాణములను రచించెనని ప్రతీతి. బ్రహ్మ, పద్మ, విష్ణు, శివ, భాగవత, బృహన్నారదీయ, మార్కండేయ, అగ్ని, భవిష్యత్, బ్రహ్మవైవర్త, లింగ, వరాహ, స్కంద, వామన, కూర్మ, మత్స్య, గరుడ, బ్రహ్మాండములు మహాపురాణములు. (1) నందికేశ్వర (2) శుక్ర (3) వసిష్ఠ (4) దేవీభాగవత (5) మను (6) వాయు (7) మహేశ (8) కల్కి

(9) శైవ (10) ఆదిత్య (11) ఆది (12) శంభు (13) వసిష్ఠ లింగ (14) బృహద్ధర్మ (15) ధర్మ (16) గారీ (17) గణేశ (18) నీల (19) కాళీ (20) దీవి యనునవి ఉపపురాణములు. ఈ పురాణేతిహాసముల నన్నింటిని 'ఇతిహాసపురాణానాం పితా మే రోమహర్షణః' (1.4.22) అను భాగవత ప్రమాణమురీతి సూతమహర్షి తండ్రియగు రోమహర్షణునకు వ్యాసుడుపదేశించెను.

ఇన్ని యుద్గ్రంథముల రచనముగావించిన శ్రీ వేదవ్యాసులు యథార్థముగ ఒక ప్రజ్ఞాశక్తిస్వరూప మనుటకును, వేదస్వరూపుడనుటకును, జ్ఞానశక్తి యనుటకును, ఆసరస్వత్యవతారమే యనుటకు నెట్టి సంశయమును లేదు. కాని ఒకేపురుషుడు ఇన్ని అసంఖ్యాకములు బృహత్వములును అగు గ్రంథరాజముల రచియించియుండుట సాధ్యమా యను సందేహము పండితబృందమున కలుగకపోలేదు. మానవమాత్రుల దృష్టికి వ్యాసశక్తి అమానుషమై మానవమాత్రున కతీతముగ దోచుటయు నుచితమే యగుచున్నది. ఈ విషయమున బండితాభిప్రాయములగూడ గ్రహించెదముగాక.

the personages were distinct. Wherever Sankara quotes Vyasa, he does so without implying the Vyasa is the author of the Sutra[25] విండిష్మన్, తర్వాత తెలాంగులు, శంకరుదృష్టికి బాదరాయణ వ్యాసులు యిద్దరు వ్యక్తులుగా దీర్మానించిరనియు, వ్యాసుని ఎక్కడ ప్రమాణముగ గైకొనినను, శంకరులు సూత్రకర్తృత్వమును వ్యాసున కన్వయింప లేదనియు రాధాకృష్ణుని యుద్దేశము. దీనినే చర్చించుచు, శంకరాభిప్రాయమున వ్యాసుడు ద్వాపర కలిసంధిలో నుండెననియు, అతనికి దేవతలకు సన్నిహిత పరిచయము గలదని వ్రాసెననియు, కాని అతని మహాభారతమునకు కర్తగా రూపించుచు, బ్రహ్మసూత్రకర్తృత్వము నొసంగ లేదని మాక్సుముల్లరుకూడ అభిప్రాయపడెను.[26]

ఈ విధముగ శ్రీశంకరులు బాదరాయణుని వేదాంత సూత్రకర్తగను, కృష్ణద్వైపాయనవ్యాసుని మహాభారత కర్తగను భావించియుండినట్లు గోచరించుటచే నదే భిన్న భావము తరువాతి భాష్యకారులలో వ్యక్తమయ్యెను. శ్రీశంకరాచార్యుల అనుచరులైన వాచస్పతిమిశ్రులు 'బ్రహ్మసూత్రకృతే తస్మై వ్యాసాయాపర వేధసే' (భామతి) అని తన ప్రార్థన శ్లోకమునను, 'శ్రీశంకరం భాష్యకృతం ప్రణమ్య వ్యాసం హరిం సూత్రకృతం కుర్వే' (రత్నప్రభా) అని శ్రీగోవిందానందులుచు, మరియు టీకాకారుడగు నానంద

25. Prof. S. Radhakrishnan · Indian Philosophy Vol. 2. p 431
26. Prof. F. Max Muller : The Six Systems of Indian Philosophy p 112

గిరియు, వ్యాస బాదరాయణుల ఏకభేదమునే గాంచిరి. కాని వైష్ణవాచార్యులగు శ్రీరామానుజ, మధ్వ, వల్లభ, బలదేవాదులు వ్యాసభగవానునే వేదాంతసూత్రకర్తగ యుద్దేశించిరని రాధాకృష్ణులు వచించిరి.[27] భారత భాగవత విష్ణు పురాణముల విశ్వసించుచో, పూర్వమీమాంసాసూత్రముల బాదరాయణుని యనేకపర్యాయములు ప్రమాణముగ గైకొనియున్న జైమినిమహర్షి వ్యాసుని శిష్యుడుగా రూపించబడి యున్నాడు. అట్టిచో బాదరాయణుడు జైమినిని, జైమిని బాదరాయణుని తమ గ్రంథముల ప్రమాణములుగ గైకొనుట యసంభవమని తోచుననియు, కాని శబరస్వామి గోవిందానంద ఆనందగిరులు అట్టివ్యవహారము సంభవమని తెలిపి యున్నారనియు, కాని శంకరులవారి అభిప్రాయముమాత్రము అవిస్పష్టమనియు రాధాకృష్ణుని భావము.[27]



## వ్యాస బాదరాయణ ద్వైపాయనులు ఒక్కరే

Indian tradition called Badarayana, Vyasa, Vedavyasa, Dwaipayana, Krishna Dwaipayana. Here we are once more in a labyrinth from which it is difficult to find an exit. Vyasa or Krishna Dwaipayana is a name given to the author of the Mahabharata, and no two styles can well be more different than that of

27. Prof. S. Radhakrishnan : Indian Philosophy vol 2. p431

Vyasa, the supposed author of the so-called Vyasa Sutras[28] భారతీయ సాంప్రదాయము బాదరాయణునే వ్యాస, వేదవ్యాస, ద్వైపాయన, కృష్ణద్వైపాయన నామ ములు వ్యవహరించును. బయల్పడ నలవిగాని వ్యూహ ములో మరల మనము పడిపోతిమి. మహాభారత కర్తగా కృష్ణద్వైపాయనుడు లేక వ్యాసుడు నామమాత్రముగ సూచింపబడియున్నాడు. వ్యాససూత్రము లనబడువానికిని మహాభారతమునకును శైలిలో అత్యంత విభిన్నత్వము గోచ రించుచున్నదనియు, వ్యాస బాదరాయణుల ఏకత్వము తగు ప్రమాణరహితముగ జేయబడుచున్నదనియు, Nor should we gain much by that identification, as Vyasa of the Mahabharata also is hardly more a name to us[29] మహాభారతకర్త వ్యాసుడైనను నామమాత్రముగనే మన కుండుటచే నట్టి అభిన్నత్వము మనకు ప్రయోజనము నెక్కువ గలుగ జేయదనియును మాక్సుముల్లరు చింతించెను.

మీమాంసాద్వయము పూర్వము ఒకే గ్రంథముగ నుండెడిదనియు This combined work might well have been arranged by Vyasa, the author of Mahabharata. Or it may be that he had written them himself according to the views that were traditionally handed down as Badarayana's[30] ఈసమష్టిగ్రంథమును మహాభారత కర్తయగు వ్యాసుడు, పునర్నిర్మాణము జేసియుండును. లేక, బాద

28 Prof F Max Muller The Six Systems of Indian Philosophy p.116
29 Prof. F. Max Muller . The Six Systems of Indian Philosophy p.113
30. Swami Veereswarananda . Brahma Sutras p.7

రాయణుని భావములుగా పరంపరగా వచ్చుచున్న భావములననుసరించి యాతడే ప్రత్యేక గ్రంథమును నిర్మించి యుండవచ్చునని వీరేశ్వరానందుల సమన్వయ యత్నము. ఈసమన్వయము సముచితమనియు, దీనివలన వేదాంత సూత్రములగల బాదరాయణ నామదర్శనము అన్వయించుననియు, నాతడు సంతసించెను. కాని యట్లు తలంప నవసరము లేదనియు (The fact that the name of the latter (Badarayana) is mentioned in several places in the third person (1. 3. 26, 1. 3. 33, 3. 2. 41, 3. 4. 1, 3. 4. 8, 3. 4. 19, 4. 3. 15, 4. 4. 7, 4. 4. 12) inclines one to think that Badarayana is not its author. Such a use of the third person is not, however, an uncommon practice in ancient India, and it need not imply a different authorship[31] వేదాంతసూత్రములలో బాదరాయణనామము ప్రథమపురుషవాచకమున గోచరించుటచే బాదరాయణుడు కర్తగాదని భావింపవచ్చును. కాని, ప్రాచీన భారతావనిలో అట్టి అభ్యాసము అసాధారణము కాకుండుటచే అన్యకర్తృత్వమును గ్రహింప ననావశ్యకమని రాధాకృష్ణ పండితుని నిశ్చయము.



Prof. S. Radhakrishnan, Indian Philosophy Vol. 2 p. 431

## వ్యాసుడు - యోగభాష్యము

ఈ కలవరముతోబాటు పతంజలిప్రోక్త యోగ సూత్రములకు వ్యాసుడు రచించిన భాష్యమొండు గోచరించును. కాల నియమము ననుసరించి చూచినచో ద్వాపరాంతమునగల కృష్ణద్వైపాయనునకును, ఉపవర్షాచార్య శిష్యుడైన పాణిన్యాచార్యప్రోక్త వ్యాకరణములకు కాలాంతరమున మహాభాష్యమును రచించిన పతంజలిమహర్షి చే నిర్మితమైన యోగసూత్రములకు భాష్యమును విరచించిన వేదవ్యాసునకును చాల కాలవ్యత్యాసము గానగును. Vyasa, the reputed author of the Brahma Sutras, wrote also a commentary to Patanjali Yoga Sutra [32] బ్రహ్మసూత్రములకు ప్రఖ్యాత కర్తయగు వ్యాసుడు పాతంజల యోగసూత్రములకుగూడ భాష్యరచనము గావించెనని రోయర్ పండితు డుద్దేశించెను. Vyasa, the commentator of the Patanjali Yoga Sutras is not Veda vyasa[33] పాతంజల యోగసూత్రములకు భాష్యకర్తయగు వ్యాసుడు వేదవ్యాసుడు కాదని పై నుదాహరింపబడియున్న కాలభేదము ననుసరించి భాష్యాచార్యులు నిర్ణయించిరి. As to the commentary on the Patanjali Yoga Sutra being the work of the same Vyasa, this seems to me altogether out of the question [34] ఒకే వ్యాసుడు, పాతంజల యోగసూత్ర భాష్యమునుగూడ రచించెననుట పూర్తిగా నసంభవమనియు మాక్స్ముల్లరు అభిప్రాయమును తెలిపెను.

32. Dr. E Roer · The Twelve Upanishads
33 Pandit Bhashyacharya The Age of Patanjali p. 24
34. Prof. F. Max Muller. The Six Systems of Indian Phil[illegible]

## ద్వాపరే ద్వాపరే వ్యాసః

ఇంకను యీ వ్యాసమీమాంస చేసితిమేని వేద వ్యాసు డొకడు కాదనియు అనేకులు గలరనియు విదితమగును. ఈవిషయమును వివరించుచు 'ప్రతిమహాయుగస్య ప్రత్యేక వేదవ్యాస స్మరణాత్ జ్ఞాయతే' (3.3.11...20) ప్రతిమహాయుగమునకు ప్రత్యేకమైన వేదవ్యాసుడు గలడనియు 'ద్వాపరే ద్వాపరే విష్ణుర్వ్యాసరూపే మహామునే। వేదమేకం బహుధా కురుతే జగతో హితః॥' ద్వాపరద్వాపరాంతమున విష్ణువే వ్యాసావతారముదాల్చి జగచ్ఛ్రేయము కొరకై ఏకరూపముననున్న వేదముల ననేకమొనర్చును అను విష్ణుపురాణ వాక్యముచేతను 'ప్రవృత్తిః సర్వశాస్త్రాణాం పురాణస్యా భవత్తతః। కాలో నాగ్రహణం దృష్ట్వా పురాణస్య తతో నృప॥' వ్యాసరూప మహంకృత్వా సంహరామి యుగే యుగే। చతుర్లక్షప్రమాణేన ద్వాపరే ద్వాపరే సదా॥' (53.8.9) సర్వశాస్త్ర పురాణములందు నేను వ్యాసాకారముదాల్చి ప్రతిద్వాపరమున చతుర్లక్షప్రమాణముల ద్వారా ఎల్లప్పుడును అజ్ఞానమును సంహరించెదను అను మత్స్యపురాణ వచనముచేతను ప్రతిమహాయుగమున విష్ణువే ద్వాపరాంతమున వ్యాసరూపముననవతరించునని సువిదితము. అందుచేతనే 'పితా శుకస్య సర్వజ్ఞో గురుర్వ్యాసో మహామతిః' (యో. వా. 2.3.3) శుకుని తండ్రియు మహామతియు సర్వజ్ఞుడును అయిన వ్యాసగురువును ప్రస్తావించి, 'ఇమం వ్యాసమునిం తత్ర ద్వాత్రింశం సంస్మరామ్యహం। యథా

సంభవ విజ్ఞానదృశా సందృశ్యమానయా॥' (యో.వా. 2.3.21) నాదృష్టి పోగలిగినంతవరకు చూడ, ఈ వ్యాసుడు ముప్పదిరెండవవాడుగ గన్పడుచున్నాడు. ఇట్టి వ్యాసులు పూర్వసృష్టులలో ముప్పదియొక్కరు చనిరి. మరియు 'ద్వాదశాల్పధియ స్తత్ర కులాకారే హి తైః సమాః। దశ సర్వే సమాకారాః శిష్టాః కుల విలక్షణాః॥' (యో.వా. 2.3.22) ఆముప్పదియొకరిలో మొదటి పండ్రెండుగురు వ్యాసుల యొక్క కులము, ఆకృతి చరిత్రలు సమానములు. వీరు అల్పజ్ఞానులు. పదియవవాని వంశముమాత్రము భిన్నము. అంతియగాక 'అద్యాప్యన్యే భవిష్యంతి వ్యాసవాల్మీకయ స్తథా। భృగ్వంగిరః పులస్త్యాశ్చ తథైవాప్యన్యథైవ చ॥' (యో. వా. 2.3.23) ఇంక నొదరో వ్యాస వాల్మీక భృగ్వంగిర పులస్త్యాది వ్యాసులు జన్మింపనున్నారు. వీరిలో గొందరి శరీరములు పూర్వమువలెనే యుండును, కొందరివి మారును అని యోగవాసిష్ఠమున వసిష్ఠమునీంద్రుడు రామ చంద్రునికి బోధించెను. ఇంతియగాక 'భావ్యమద్యాప్య నేనేహ నను వారాష్టకం పునః। భూయోఽపి భారతంనామ సేతిహాసం కరిష్యతి॥' (యో. వా. 2.3.29) యీవ్యాసుడే మరల ఎనిమిదిసార్లుద్భవించి భారతేతిహాసమును ఎనిమిది పర్యాయములు రచింపనున్నాడు. మరల యీవ్యాసుడే 'కృత్వా వేదవిభాగం చ నీత్వా నేన కులప్రథాం। బ్రహ్మత్వం చ తథా, కృత్వా భావ్యం వై దేహ మోక్షణం॥' (యో. వా. 3.3.33) వేదవిభాగ మొనరించి, భారతకుల

మునకు గీర్తినార్జించి, పిదప విదేహముక్తి నొంది బ్రహ్మత్వము నొందుననియు వాసిష్ఠ ప్రోక్తమగుటచే నీవ్యాసుని పూర్వము ముప్పదియొక్క రుండుటయేగాక, తర్వాత నితడే ఎనిమిదిసార్లు యుద్భవింపనుండుటచే వసిష్ఠుని గణనము నకు నలువది వ్యాసులున్నట్లు తాత్పర్యము. 'ఆవిర్హిత స్త్వను యుగం స హి సత్యవత్యాం వేదద్రుమం విటపశో విభ జిష్యతి స్మ' (2.7.36) ప్రతియుగమందు...సుశాశ్వతములు నైన వేదతరుశాఖలు దా విభజించినట్టి సన్నుతుడు పరాశర ప్రియ తనూజుడు నాహరి పుట్టె నర్మిలిన్ (ఆంధ్రభాగవత. 2.194) అను భాగవత వచనముగూడ ప్రతియుగమున వేద మును విభజింప హరి వ్యాసరూపమున నవతరించునని తెలుపుచున్నది.

---

## 28 వ్యాసులు

దేవీభాగవతము 'తతః శక్తిర్జాతుకర్ణ్యః కృష్ణ ద్వైపాయన స్తతః। అష్టావింశతి సంఖ్యేయం కథితా యా మయా శ్రుతా॥' (1.3.33) పిమ్మట శక్తియు తర్వాత జాతుకర్ణ్యుడును తర్వాత కృష్ణద్వైపాయనుడును గలరు. వీరు యిరువదిఎనిమిదిమందిగా చెప్పబడుట తనచే తెలియ బడెను అని యిరువదిఎనిమిది వ్యాసులనే తెలుపుచున్నది. ఇటులనే కూర్మపురాణముగూడ నిరువదిఎనిమిది సంఖ్యనే

నిర్ణయించుచు, వారివారి నామములగూడ బేర్కొని యున్నది. ఎట్లన 'అస్మిన్ మన్వంతరే పూర్వం వర్తమానే మహావిభుః। ద్వాపరే ప్రథమో వ్యాసో (1) స్స్వాయంభువో మతః॥ ఇత్యాదినా (2) ప్రజాపతి (3) ఉశనా (4) ప్రజాపతిః। (5) సవితా (6) మృత్యుః (7) ఇంద్రః (8) వసిష్ఠః (9) సారస్వతః (10) త్రిధామా (11) వృషభః॥ (12) శతతేజాః (13) ధర్మః (14) తరసః (15) త్ర్యారుణి (16) ధనంజయః। (17) క్రతుంజయః (18) ఋతంజయః (19) భరద్వాజః॥ (20) గౌతమః॥ (21) వాసవః (22) ఊషామ్రాయణః (23) తృణబిందు స్త్రయోవింశే। (24) వాల్మీకిస్తు పరం స్మృతః (25) పంచవింశే తథా శక్తి (26) షడ్వింశే తు పరాశరః॥ (27) సప్తవింశే తథా వ్యాసో జాతుకర్ణ్యో మహామునిః॥ (28) అష్టావింశే పునః ప్రాప్తే హ్యస్మిన్వై ద్వాపరే ద్విజా। పరాశర సుతో వ్యాసః కృష్ణ ద్వైపాయనః పరః॥' ఇట్లే విష్ణు (3.3.11-20) వాయు (పూర్వ. 23-100) పురాణములును తెలుపుచున్నవి.



## వ్యాసశబ్దము - బిరుదు

దీనియంతటి సారాంశముగ వ్యాసనామము కేవలము బిరుదమే యనియు 'సీ॥ అక్కుమారుని శ్రుతులన్నియు... వ్యాసమొందింపుమనియె' 'గీ॥ కాలమున కీడు కతమున గలగబడిన వేదముల నీవు నాడును విమలబుది నంచిత

వ్యాసమొనరించి......' (శాంతి.5) అను మహాభారత ప్రయోగమునొంతె వ్యాసశబ్ద వ్యుత్పత్తుల బరిశీలించి, తీర్మానించిరి. I think we should remember that Vyasa, as a man, meant no more than compilator or arrangement, as opposed to సమాస conciseness or abbriviation, so that the same story might be recited సమాసేన in an abbriviated and వ్యాసేన in a complete form [35] సమాస యన సంక్షిప్తపరచుట యను యర్థమునకు వ్యతిరేకమైన క్రోడీకరణమును సూచించు వ్యాసునిగనే మన మతని గ్రహింప విస్మరింపజనదు. ఒకే గాధను సంక్షిప్తమొనరించుట యన సమాసపరుపవచ్చును, లేక వ్యాసపరచుట యన దాని సంపూర్ణ స్వరూపమును కుంచింపక తెలుపవచ్చునని మాక్సుముల్లరు వాదించెను. అందుచేతనే వ్యాసుడు పురాణ కర్త కాదనియు, పురాణ శబ్దము వాని ప్రాచీనతను సూచించుచుండుటయు, మరియు వరాహ మత్స్యాదిక పురాణనామములు ఆయా ఋషీశ్వరుల నామములనియు, ననగా నాఋషీశ్వరకృత గ్రంథములు నాయాఋషీశ్వరుల నామముల బరగుచుండ, నవి కాలవాహినిలోబడి క్షీణించి యుండుటచే పునరుద్ధరించుట లేక వ్యాసపరచుటచే నవి వ్యాస కర్తృకములుగా వ్యవహార్య మగుచున్నవి గాని వ్యాసుడు వాని కర్త కాదని కొందరు తలంచుచున్నారు.



35. Prof. Max Muller · The Six Systems of Indian Philosophy p. 117

## దర్శనకర్తల నామరహస్యము

ప్రాచీన భారతవిద్వాంసులు పేరుప్రతిష్ఠల నారయక, అంత యుద్గ్రంథముల రచించియు నసమాన నిరాడంబరత్వమున విరాగధనులై తమ కృతుల తమ నామముల జేర్చకుండుట గమనార్హము. వారి త్యాగ మమోఘముగా వారి విశేషముల నరయ యత్నించువారి ప్రాణాంతకము అనియు విదితము. అంతియుగాక, వారు తమ నిజ నామధేయముల ద్వారా కాక వారిని వివరించు గుణములే నామములుగ గ్రంథముల దెలియబడుచుండుటయు విచారకరము. కపిలాచార్యుని నామ మెయ్యదియోగాని కపిలవర్ణమున నుండుట నానామ మాతనికి గలిగియుండునట్లు తోచును. అటులే గౌతమ, పతంజలి, కణాద, శబ్దముల గాంచియుంటిమి. 'జైమిని' శబ్దముగూడ 'జేమనం' అనగా ఆహారము, భుజించుట యను శబ్దోద్భవమేమో! అట్లే వేదవ్యాస, బాదరాయణ, కృష్ణద్వైపాయన మొదలైన శబ్దములును ఆమహానుభావుని శక్తి గుణముల నిర్వచనరూపములై అసలు వ్యక్తిని మనకు చాల దూరమొనరించుట చింతనీయము. కాని అందే వారి జ్ఞానౌన్నత్యమును గాంచి, These great master minds producing momentous results in the hearts of mankind were content to write their books without even putting their names [36] మానవ హృదయాంతరాళముల అద్భుత పరివర్తన గలుగజేయుచున్న ఆప్రజ్ఞాధురంధరులు, వారి నామముల నంకిత మొనర్పకయే గ్రంథముల

36. Swami Vivekananda The Complete Works Vol. 3. p. 253

రచించి దృష్టిగాంచిరి అని శ్రీవివేకానంద మహానీంద్రుడు సగర్వముగా వక్కాణించియున్నాడు.

కాని All this is very discouraging to the students accustomed to chronological accuracy[37] యిదియంతయు కాలనిర్ణయదృష్టి నలవరచుకొన్న విద్యార్థులకెంతయో ఆశాభంగము కలిగించును. అయినను After all, the importance of that literature, and more particularly of its philosophical portion is quite apart from the names and dates of its authors[37] ఆసాహిత్యముయొక్కయు ముఖ్యముగ ఆతత్త్వశాస్త్ర భాగముయొక్క ప్రాధాన్యత, వాని కర్తల నామముల పైనను, కాలముమీాదను ఆధారపడజాలదు అనియు మాక్సుముల్లరు సమన్వయించుకొని తృప్తిగాంచెను.



## ద్వైపాయన మాహాత్మ్యము

ఇందరు పురాణపురుషులుండ అందు ఒక్కొక్కరు అద్భుత శేముషీధురంధులై యుండ నందరిలో నొక్క వేద వ్యాసనామమే యింత ప్రశస్తమై యొప్పారుటకు కారణమేమి ? అనియు సందియము గల్గును. దానికి సమాధానముగ వివేకానందు లిట్లు నుడువుచున్నారు. Compare the great teachers of religion with the great philosophers. The philosophers scarcely influerced anybody's

37 Prof. F. Max Muller The Six Systems of Indian Philosophy p. 121

inner man, and yet wrote most marvellous books. The religious teachers, on the other hand, moved countries in their life time[38] గొప్ప మతప్రవక్తలను గొప్ప తత్త్వవేత్తలతో బోల్చుడు. ఏయొక్కరి హృదయమున పరివర్తనము గలుగజేయజాలకున్నను, తత్త్వవేత్తలు అద్భుత గ్రంథరచనముల గావించియుండిరి. ఇక మతాచార్యులన, దేశ దేశముల కదిలించివేసిరి. The difference was made by personality. In the philosopher, it is a faint personality that influences, in the prophets it is tremendous. In the former, we touch the intellect, in the latter we touch life[38] వ్యక్తిత్వముననే వ్యత్యాసము గలదు. తత్త్వవేత్తలో నాకర్షించు శక్తిమత్త్వము చాల అల్పము. ఆచార్యునిలో అద్భుతము. మొదటివానిలో బుద్ధికుశలత గోచరింప, తర్వాతవానిలో జీవనము వ్యక్తము అని వివేకానందుని వివరణము. ఇక వేదవ్యాసుడన్ననో, అత్యుగ్ర తపోదీక్ష జన్మతః గావించి, తపోధనుడై, సిద్ధుడై, ఆదర్శప్రాయుడై రూపొంది, అత్యద్భుత తపోశక్తి స్వరూపుడై విరాజిల్లెను. అందుచే సర్వమతాచార్యుల కంటె అత్యధికతమ శక్తియుక్తుడై యలరారెను. అందుచేతనేగదా ఆమహానుభావుని సూత్రగ్రంథమునుండి సర్వ మానవ మానసిక ప్రవృత్తుల కనుగుణమైన అసంఖ్యాక మతము లుద్భవించి ప్రపంచమును ముంచి ఎత్తినవి! అటులనే, తనకు మించిన జ్ఞానధనుడు లేడనునట్లు తన అనంతమగు గ్రంథములచే ప్రపంచమునంతను నాతడు ముంచి

38. Swami Vivekananda The Complete W...

వైచెను! అతని కావ్యముల గ్రహింప నేటికిని మేధా సంపన్నులగు మహాపండితులుగూడ తలక్రిందులై భయ భ్రాంతులై ఆయనంతశక్తుని ముందు పరమాణువులమని గ్రహించుకొను చున్నారు. అందుచేతనే ధీమంతుడైన, మాక్సుముల్లరు He is to us a name and an intellectual power[39] ఆతడు ఒక నామమాత్రమును, అద్భుత ప్రజ్ఞా శక్తియు నని నిర్వచించియున్నాడు. అట్టి మహాప్రజ్ఞాధురీ ణులచే నలంకృతమైన మన భారత మెంతటి యదృష్టదేవత! India, whose soil has been trodden by the feet of the greatest sages that ever lived[40] ప్రపంచమున నుద్భ వించిన మహాత్ములలో సర్వోత్తముల పాదధూళి ధరించిన దీ భారతావని యని వివేకానందుడును విజ్ఞానానందసాగరుడై సగర్వముగ వక్కాణించియుండెను. అట్టి పరమ జ్ఞానశక్తి స్వరూపుల సంప్రదాయమున నుద్భవించియున్న భారతీయు లెంత ధన్యాత్ములోగదా! అమ్మహనీయుని జ్ఞానదీప్తులు సర్వప్రపంచము నావరించి అజ్ఞానతిమిర వినాశము గావిం చునుగాక! అట్టి మహోత్తమ ఉద్యమమునకై ఏకోన్ముఖ ముగ భారతీయులందరు కృషి సల్పుదురుగాక!



## వ్యాసుని కాలము

అట్టి మహాపురుషుని కాలనిర్ణయము ఆర్షగ్రంథముల నిస్సంశయముగ దీర్మానింపబడి యున్నను, It is often

39 Prof. F. Max Muller The Six Systems of Indian Philosophy p.116

assumed without reason that every passage in the Vedas must be looked upon as subsequent interpolation, and that every book treating of a philosophical subject must be considered as having been written after the time of Buddha or after the commencement of Christian era[41] కారణము వచింపకయే వేదవాక్యముల నన్నింటిని కాలాంతర ప్రక్షిప్తములుగను, తత్త్వవిషయ విచారణము సల్పు ప్రతిగ్రంథము బుద్ధునికాలముతర్వాతనో క్రీస్తుశక ప్రారంభముననో లిఖితములుగను తరచు తీర్మానింపబడుటయు; It seems to me that the ignorance of our fellow countrymen, in regard to religions of India is often worse than a blank[42] భారతీయ మతములగూర్చి మన దేశములకు ఏమియు తెలియదని నాకు తోచుచున్నది. Even the most profound Orientalists, who have never come in contact with Indian mind, except in books, commit themselves to mischivous and misleading statements[42] గ్రంథముల మూలముగాక భారతీయ చిత్తసీమయొక్క సంబంధ మెఱుగని గొప్ప సంస్కృత విద్వాంసులుగూడ, సంకుచితమును, నింద్యమునై పెడత్రోవబట్టించు వాక్యముల వ్రాయుచుందురు అని మోనియర్ విలియమ్స్ తెలిపి చింతించియున్నాడు. అట్టి పాశ్చాత్య విద్వాంసులు వ్యాస కాలనిర్ణయమునకు వ్యక్తిస్వరూప నిశ్చయమునకు బహుళ చర్చ గావించియుండిరి. వ్యక్తినిరూపణ విషయము

---

41. Pandit N. Bhashyacharya The Age of Pata[illegible]
42. Dr. M[illegible]

ాత్ర్యము పరిశీలించియుంటిమిగాన, నిక వ్యాస కాలనిర్ణయ
నుగూడ చూచెదముగాక.

---

వ్యాసుడు – శంకరుడు

'శక్తేః పరాశరః పుత్ర స్తస్య వంశం నిబోధమే।
స్య ద్వైపాయనః పుత్రః స్వయం విష్ణు రజాయత' (201.
) శక్తి యొక్క పుత్రుడును పరాశరుని కుమారుడైన
ద్వైపాయనుడుగ స్వయముగా విష్ణువు జనించెనో అతని
శమునుగూర్చి బోధింపుము అని మత్స్యపురాణముచే
ింపబడియున్న వేదవ్యాస భగవానుడు 'శుకశిష్య గౌడ
ద గుర్వనుగ్రహాచ్చరమాశ్రమం సురనదం చ శిశ్రియే'
31) శుకయోగీంద్రుని శిష్యుడైన గౌడపాదగురు అను
హమున తురీయాశ్రమమును గంగానదిని ఆశ్రయించెను
ఏ పతంజలిచరిత మొదలగు ఆర్ష గ్రంథములచే గౌడ
మునకు రెండుతరముల బూర్వుడని అనుమానింపబడు
న్నది. అందుచే So far may be said to determine
chronological position as anterior to that of
other Vyasa, who was the father of Suka the
cher of Gaudapada, the teacher of Govinda, the
cher of Sankara and who if Sankara belong to
eighth century, might have lived in about 6th
tury of our era [43] క్రీస్తుశకమున ఎనిమిదవశతాబ్దికి

43 Prof Max Muller The Six Systems of Indian Philosophy p ...

శంకరులు చెందియున్నచో, శంకరుని గురువు, గోవిందుని గురువు, గౌడపాదుని గురువు శుకుని తండ్రియగు మరియొక వ్యాసునికాలము క్రీ. శ. ఆరవ శతాబ్దముగ నిర్ణయింపనగు నని మాక్సుముల్లరు వచించియున్నాడు. కాని శంకరుని కాలనిర్ణయమే అత్యంత క్లిష్టముగా నుండుచు క్రీస్తుపూర్వము సుమారు 500 వత్సరములకు జరుగుచుండ 44 నట్టి అనిర్ణీత శంకర కాలము ననుసరించి వ్యాస కాల మపేక్షికము కానేరదు. మరియు శంకర గురుపరంపరను సూచించుటయు కష్టసాధ్యము. గురుపరంపర యనుటతోడనే పరంపరలోగల సర్వగురువులు లెక్కకురాక, అందు ప్రధానులును ప్రఖ్యాతులును మాత్రమే గణింపబడుటయు నుచితమగుటచే శంకరుని గురువు గోవిందుడేయైయున్నను, అతనికి గౌడపాదుడు గురువని నిర్ణయించుట దుర్లభము. అట్టిచో గౌడపాదునకు వ్యాససూనుడగు శుకదేవుడు గురువు సాక్షాత్తుగా కాకపోవచ్చును. పరంపరా సంబంధమున చతుర్ముఖు నుండి పరంపర చెప్పుకొనుటయు నాచారము. కాన కాల నిర్ణయమున నా మార్గము లోపభూయిష్టము.



44. G. K. Shastri. Sri Bhagavathgitha

అట్లే బుద్ధుని కాలము ననుసరించి కొందరు కాలనిర్ణయముగావింప యత్నించిరి. షడ్దర్శనములలో న్యాయ బ్రహ్మసూత్రములు మాత్రము బౌద్ధ శాఖ యనబడుశూన్యవాదమును ఖండించుచు విజ్ఞానవాదమును గ్రహింపకుండుటచే నీ రెండు శాస్త్రములు క్రీ. త. 450 – 200 వత్సరములకు మధ్యలో నేర్పడియుండునని జకోబి పండితుని పరిశీలనా ఫలితము. [45] శంకర భాష్యము ననుసరించి చూచినచో 2.2.28–32 సూత్రములలో బౌద్ధవిజ్ఞానవాదము ఖండింపబడియున్నదనియు కాని అది బౌద్ధ నాగార్జున శూన్యవాదమున కన్వయింప నగుననియు వాకొనుచు, నాగార్జునవాద ఖండన గలదిగనుక నది నాగార్జున ఆర్యదేవుల తర్వాతి రచితమై యుండుననియు కీత్ పండితు డభిప్రాయపడుచు, మరల వెంటనే నాగార్జున పూర్వమే శూన్యవాదము అశ్వఘోషురచనలలో గోచరించు ననియు ననుమానించి, నాగార్జున ప్రస్తావన సరియైనచో వేదాంతసూత్రగ్రంథము క్రీ. త. 3 వ శతాబ్దికి చెందునని కీత్ పండితుడు వక్కాణించెను. [46] On the whole it is more likely than not that it was the dialectical ability of the teachers which made the doctrine the object of Vedanta confutation [46] మొత్తమునకు నాయాయాచార్యుల వాదములకు ఆధారమైన ధీశక్తియే వేదాంతమున ఖండనమునకు గురియయ్యెనని అతని భావము. ఎట్లైనను

45. Dr. A. B. Keith : A History of Sanskrit Literature p. 472
46. Dr. A. B. Keith : Karma Mimamsa p. 6

Badarayana cannot be dated later than 200 A D.[47] బాదరాయణుడు క్రీ. శ. 200 సంవత్సరములకు తర్వాత మాత్రము కానేరడు అనియు కీత్ నిర్ణయము. భారతీయ పండితులు సూత్రకాలము క్రీ. పూ. 500 నుండి 200 సంవత్సరములకు మధ్య నుండునని అభిప్రాయపడుచున్నారనియు, ఫ్రేజర్ పండితుడు క్రీ. పూ. 400 సంవత్సరములు సూత్రకాలముగా నిర్ణయించెననియు రాధాకృష్ణుడు వ్రాసెను.[47]

కాని పై వాదముగూడ దోషయుతము. ఎందుచేనన,

It is also assumed that Buddhism was brought into existence by Gautama Buddha. The previous existence of Buddhism, Jainism and Arhat philosophy is rejected as an absurd and ridiculous invention of the Buddhists and others, who attempted thereby to assign a very high antiquity to their own religion. In consequence of this erroneous impression, every Hindu book refering to the doctrines of the Buddhists is declared to have been written subsequent to the time of Gautama Buddha [48] గౌతమబుద్ధునితోడనే బౌద్ధమతోత్పత్తియని భావింపడుచున్నది. తమ మతములకు అతి ప్రాచీనత్వముల బ్రతిపాదించుకొనుబుద్ధితో బౌద్ధము మొదలైన మతములు గౌతమాదులకు బూర్వమే తమవి గలవను వాదన అసంబద్ధముగా త్రోసివేయబడినది. అట్టి దోషదృష్టి ఫలితమున, బౌద్ధసిద్ధాంతమును సూచించు హిందూగ్రంథములన్నియు గౌతమబుద్ధుని తర్వాత ఏర్పడినవని నిర్ణయింప

47. Prof. S. Radhakrishnan. Indian Philosophy Vol. 2. p. 431
48. Pandit N Bhashyacharya: The Age of Patanjali p. 22

బడుచున్నవి, అని భాష్యాచార్యులు పాశ్చాత్యధోరణిని ఖండించియున్నాడు. గౌతమబుద్ధుడే తన బుద్ధపరంపరను గురించి Now I go to help the world, this lost of many times [49] పూర్వ మనేక పర్యాయములకు కడసారిగా ప్రపంచసహాయమునకు నేనిపు డరుగుచుంటిని అని తెలుపుచుండుటచే బుద్ధునికిపూర్వమే బౌద్ధమతము మరొక నామాంతరమున నుండియుండునని తెలియబడుచున్నది. అందుచే నాయాకాలమున వాతావరణములో నెగురుచున్న సిద్ధాంతముల ఆచార్యులు గ్రహించి, ఖండన మండనముల గావించియున్నారు. మరియు, వేదాంతసూత్రముల బౌద్ధాది మత ఖండన గావింపబడునప్పుడు వ్యక్తుల నామములు లేక సిద్ధాంతములు మాత్రమే అనువదింపబడి పరిశీలింపబడుట గమనార్హము. అనగా వేదాంతసూత్రముల జర్చింపబడియున్న బౌద్ధము చాల ప్రాచీనమని తెలియుటచే, దాని ననుసరించి వ్యాస కాలనిర్ణయము గావింప నెంచుటయు లోపభూయిష్టమే యగుచున్నది. అంతియగాక గౌతమబుద్ధ కాల నిర్ణయమైనను, Chinese, who believe that the Nirvana of Sakya muni took place in 949 or 973 instead of in 543 B. C. [50] పూర్వనిర్ణయము ననుసరించి క్రీ. పూ. 543 సంవత్సరముగాక క్రీ. పూ. 949 కాని 973 సంవత్సరము గాని సాక్యముని బుద్ధుని నిర్వాణ కాలముగా చైనాదేశీయుల నమ్మకమగుటచే నిట్టి యస్థిర ప్రమాణములపై

49. Gautama Buddha : Light of Asia p. 1
50. Pandit N Bhashyacharya The Age of Patanjali

నాధారపడిన. వ్యాససూత్ర కాలనిర్ణయము కానేరదు. అందుచేతనే Similarity of words and ideas here and there is therefore not a safe guide [51] అందుచేత, పదముల భావముల పోలికలు సురక్షితమైన మార్గదర్శములు గావని సతీశచంద్ర విద్యాభూషణుడు హెచ్చరించుచున్నాడు.

---

## వ్యాసుడు – ఉపవర్షుడు

పాణినీయ వ్యాకరణసూత్రములు భిక్షుశాస్త్ర నామమున వేదాంతసూత్రముగ ప్రస్తావింపబడుటయు, 'ఉపవర్షో వృత్తికారః' అనురీతి పాణిన్యాచార్యుని ఆచార్యుడగు ఉపవర్షుడు వేదాంత మీమాంసాశాస్త్రములకు వృత్తుల రచించియుండుటచేతను, ఉపవర్షునికి పూర్వమే వేదాంతసూత్ర రచనమని పండితుల నిర్ణయము. The identity of Vedanta Sutras and the Bhikshu Sutras would no doubt fix the date of Sutras very early before Buddha[52] వేదాంత భిక్షుసూత్రముల అనన్యప్రతిపాదనము సూత్రకాలమును అతి ప్రాచీనముగ బుద్ధునికి పూర్వముగ నిస్సందేహముగ దీర్మానించునని వీరేశ్వరానందుని వచనము. దర్శనకారుల నందరిని ప్రస్తావించుచు పతంజలి చరిత్రము 'యది భిక్షుశాస్త్ర మిదమఖిలం' (5 21) అని వచించియుండుటచే వేదాంతదర్శనమే భిక్షుశాస్త్రమని నిర్ధారణము. అందుచే

51. M. M. Satishchandra Vidyabhushan : The Sutras of Gotama p. 8

52. Swami Veereswarananda , Brahma Sutras p. 8

వేదాంతదర్శనము బుద్ధ పూర్వకాలికకృతియే యని నిర్ణయము. మరియు 'అథ కాలేన ఉపవర్షస్య శిష్యవర్గో మహానభూత్। తత్ర ఏకః పాణినిర్నామ జడబుద్ధితరో భవేత్॥' (4.20) అను కథాసరిత్సాగర శ్లోకము ననుసరించి పాణినికి గురువుగనున్న ఉపవర్షుడే ఉభయమీమాంసలకు వృత్తుల రచించియుండుటచే వేదాంతదర్శనము ఉపవర్షునకే పూర్వమనియు గ్రాహ్యమని వీరేశ్వరానందుల నిశ్చయము.[52] పాణినికాలమే Panini is as old as most probably the seventh century B. C.[53] క్రీ. పూ. ఏడవ శతాబ్దమునకు గలదు. ఈనిర్ణయముపై నాధారపడగలిగినచో This would prove the existence of our Sutras before the time of Panini. This would be a most important gain for the chronology of Indian Philosophy[54] సూత్రము పాణినికి పూర్వకాలిక మగుచున్నది. భారతీయ తత్త్వశాస్త్ర కాలనిర్ణయమున యిదియొక ముఖ్యప్రయోజనమని మాక్సుముల్లరు ఆనందించియున్నాడు.

---

## బ్రహ్మసూత్రము – భగవద్గీత

భగవద్గీతాశాస్త్రమున 'ఋషిభిర్బహుధా గీతం ఛందోభిర్వివిధైః పృథక్। బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భి

52. Swami Veereswaranand Brahma Sutras p. 8

53 M. M. Satishchandra Vidyabhushan : The Sutras of Gotama

54 Prof. F. Max Muller . The Six Systems of Indian Philosophy p.117

ర్వినిశ్చితైః॥ (13.4) క్షేత్రక్షేత్రజ్ఞుల విషయము ఋషుల చేతను వేదములచేతను అనేకవిధములుగా చెప్పబడెను. బ్రహ్మసూత్రములందు నిర్ణయింపబడెనను శ్లోకమున బ్రహ్మ సూత్రముల ప్రస్తావన యుండుటచే Max Muller too is of opinion that the Vedanta Sutra belong to an earlier period than the Gita and in the text quoted he finds a clear reference to the recognized title of the Vedanta or Brahma Sutras[55] గీతకంటె వేదాంత సూత్రము ప్రాచీనమనియు, పై శ్లోకమున వేదాంతము లేక బ్రహ్మసూత్రములు గుర్తింపబడు చున్నవనియు మాక్సు ముల్లరు అభిప్రాయము. 'బ్రహ్మసూత్రపదైః' అనునది వేదాంతసూత్రములే యని రామానుజ మధ్వాది భాష్య కారులందరు సమ్మతించియుండిరి. But if the Vedanta Sutra be of an earlier date than the Gita, how could it contain references to the Gita? In Sutras 2.3.45 and 4.2.21 all the commentators quote the same text of the Gita, and there seems to be no doubt that they are right[55] కాని గీతకంటె వేదాంతసూత్రము ప్రాచీనమే యగుచో, సూత్రములు గీతాప్రమాణముల నెట్లు గైకొనును ? 'అపి చ స్మర్యతే' (వే. సూ. 2.3.45) 'యోగినః ప్రతి చ స్మర్యతే స్మార్తే చైతే' (వే. సూ. 4. 2.21) సూత్రముల భాష్యకారులందరును 'మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః' (గీ. 15.7) 'అగ్నిర్జ్యోతి రహః శ్శుక్లః షణ్మాసా ఉత్తరాయణం। ధూమో రాత్రి స్తథా

55. Swami Veereswarananda : Brahma Sutras p. 10.

కృష్ణ షణ్మాసా దక్షిణాయనం॥' (గీ. 8.23) అను గీతా వాక్యములనే స్వీకరించియున్నారు. భాష్యకారుల భావ ముచితమసియే దీర్ఘానమని వీరేశ్వరానందులు వక్కాణించియున్నారు.

పై విషయముల జర్చించుచు 'బ్రహ్మసూత్రపదైః' (13.4) అను గీతాశ్లోకగత వాక్యము బ్రహ్మసూత్రములనే స్పష్టముగ తెలుపుచున్నదని బాలగంగాధర తిలక్ మహాశయుడును తన గీతారహస్యమున నిర్ణయించియున్నాడు. కాని యీ బ్రహ్మసూత్రములును, ప్రస్తుతమందున్న వేదాంతసూత్రములును వేరుకావని యందుమేని ప్రస్తుత వేదాంతసూత్రముల యనంతరము గీతపుట్టినదని యర్థము. కాన గీతాప్రస్తావిత బ్రహ్మసూత్రము లెవ్వి యని విచారింపవలెను. ప్రస్తుత వేదాంతసూత్రమే బ్రహ్మసూత్ర మనబడుచున్నదిగాని మరొక బ్రహ్మసూత్రగ్రంథ మగోచరము. కాని వేదాంతసూత్రముకంటె గీతాశాస్త్రము ప్రాచీనమని సంప్రదాయము. బ్రహ్మసూత్రముల 'భగవద్గీత' యను శబ్దము ప్రత్యక్షముగ లేకున్నను, స్మృతి శబ్దగోచరమున భగవద్గీత యనియే భాష్యకారు లుద్దేశించియున్నారు. భాష్యకారుల వివరణము ననుసరించి, 'స్మృతేశ్చ' (వే.సూ. 1.2.6), 'అపి చ స్మర్యతే' (1.3.23) 'ఉపపద్యతే చాప్యుపలభ్యతే చ' (2.1.36) 'అపి చ స్మర్యతే' (2.3.45) 'దర్శయతి చాథో అపి స్మర్యతే'(3.2.17)'అనియమః సర్వాసామవిరోధః శబ్దానుమానాభ్యాం' (3.3.31) 'స్మరంతి చ'

(4.1.10) 'యోగినః ప్రతి చ స్మర్యతే' (4.2.21) అను వేదాంతసూత్రములలో 18.61, 15 6, 15.3, 15.7, 13.12, 8.26, 6.11, 8.23 భగవద్గీతా శ్లోకములు అన్వయింపబడి యుండుటచే గీతాశాస్త్రమే ప్రాచీనతర మనిపించును. కావున గీతా వేదాంతసూత్రముల పరస్పరాపేక్షికత్వము సందిగ్ధముల కాలవాలమై యొప్పారినది. మా మతమున నీసందేహము నివృత్తమగుటకు మార్గ మొకటియే యున్నది. బ్రహ్మసూత్రముల రచించినవారు మూలభారతమును గీతనుకూడ ప్రకృత మున్నరీతి రచించియుందురనిన నేమియు విరోధ ముండనేరదు (734) అని గీతారహస్యకర్త తిలక్ మహాశయుని తీర్మానము. అనగా మూలభారతమునకును, తదంతర్గత గీతలకును ప్రకృతమునందున్న స్వరూపమును వ్రాయుటకును, బ్రహ్మసూత్రముల రచించుటయు ననుకార్యముల నొక బాదరాయణులగు వ్యాసులే చేసియుందురని యూహింపవచ్చును. అనగా బాదరాయణ వ్యాసులు భారత గ్రంథకర్త కాక పునరుద్ధారకుడని భావమని తిలక్ మహాశయుడు సుస్పష్టపరచిరి. అందుచేతనే These cross references show that the author of the Gita had a hand in the present recention of the Sutras[56] సీఅన్యోన్యాపేక్షిక వాక్యములు, గీతాకారునకే ప్రస్తుత సూత్రగ్రంథనిర్మాణమున సంబంధమున్నదని వీరేశ్వరానందులును వాకొనిరి. కాని సూత్రగ్రంథము బాదరాయణ కర్తృకమై ప్రాచీనమై యొప్పు భారతకర్తయగు

56. Swami Veereswarananda : Brahma Sutras p. II

వ్యాసుడే సూత్రముల పునరుద్ధరించెనను భావమును వీరు వెలిబుచ్చిరి.[56] 'ఆహ చ భగవాన్ ద్వైపాయనః' (పూ. మీ. సూ. 1.1.5) అను మీమాంసాసూత్రమున ప్రభాకరమిశ్రులు 'న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మ సంగినాం' (3.23) అను గీతాశ్లోకము సూచించి, గీతాకారుడు ద్వైపాయనుడని తలంచియుండుటచే కృష్ణద్వైపాయన వ్యాసుడే మహాభారతకర్త యనిపించును.

అందుచే 'ద్వాపరే ద్వాపరే విష్ణుర్వ్యాసరూపే మహాముసే' అను విష్ణుపురాణవాక్య ప్రమాణమునను 'ఇమం వ్యాసమునిం తత్ర ద్వాత్రింశం సంస్మరామ్యహం' అను యోగవాసిష్ఠ వాక్యమును గ్రహించి అనాదిసిద్ధమగు వేదాదికము నేగాక పురాణాదులను వ్యాసరూపధారు లుద్ధరించుచుందురనియును, అనగా వివ్యాస మొనరించుచుండుటచే వ్యాసు లనబడుచుండిరేగాని వారి నామములు ప్రత్యేకములనియు గ్రహించుటుచితము. కాన ప్రకృతగ్రంథముల వివ్యాసరూప ఘనకార్య మొనరించిన మహావ్యక్తి బాదరాయణుడనియు, కృష్ణద్వైపాయనుడనియు వేదవ్యాసుడనియు వ్యవహరింపబడుచున్నాడని స్వీకరించుటయు సమంజసము.

గీతాగ్రంథమును ద్వివిధముగా వ్యాసపూర్వ వ్యాసానంతరములుగా గావించి, వ్యాసానంతరమగు నీప్రస్తుత గీత క్రీ. పూ. 500 సంవత్సరములకు పూర్వమేయైయుండుననియు, మూలగీత దీనికంటె కొన్ని శతాబ్దములు తప్పక ప్రాచీనమై

(పు. 782) క్రీస్తుకు బూర్వము సుమారు పదునాల్గు శతాబ్దముల క్రిందటనే యుండెననియు (పు. 766) గీతారహస్య కర్త తీర్మానము. కాని కృష్ణద్వైపాయనుడే యీయుద్గ్రంథ కర్త యగుటయు ఆతడే వివిధ నామముల వ్యవహరింపబడుటయు, నాతడు ద్వాపరాంతము, కలియుగారంభమున నున్నట్లు సర్వేసర్వత్ర సకలమైన ఆర్ష గ్రంథము లుద్ఘోషించుచుండుటచే Viewed in this light, the Gita which we have been reading since 5052 years as a religious book [57] యీదృష్టిదిలకించిన 5052 సంవత్సరములనుండి మనము అధ్యయనము గావించుచున్న గీతాశాస్త్రము అని జి. కె. శాస్త్రి మహాశయుడు 745 శ్లోకములుగల తన ప్రాచీనగీతనుగూర్చి ప్రసంగించియున్నచందము తద్గ్రంథకర్త యగు బాదరాయణుండును 5054 సంవత్సరములనాటివాడని స్పష్టమగుచున్నది. అనగా క్రీ. పూ. 3101 సంవత్సరమునకు కడువృద్ధుడై జి. కె. శాస్త్రి పరిగణనము ననుసరించి 214 వర్షముల ప్రాయమువాడని విదితమగుచున్నది. అనగా ఆ జ్ఞాన శక్తియొక్క యవతరణము నేటికి 5054 + 214 = 5268 సంవత్సరముల క్రితము ఒక శుభముహూర్తమున గలిగియుండునని తుదినిర్ణయము.

## వేదాంతాచార్యులు

## సూత్ర వ్యాఖ్యలు

The Paragon of all monistic systems is the Vedanta Philosophy of Hindustan [58] ఏకేశ్వరసిద్ధాంతములకెల్ల భారతీయ వేదాంతశాస్త్రము శిరోభూషణము అని విలియమ్ జేమ్సు పండితునిచే నుతింపబడియున్న యీ వేదాంతదర్శనము సూక్ష్మములగు సూత్రరూప గ్రంథమగుటచే On which were hung the explanations and lectures of the Rishis to their disciples and were a sort of *memoria technica* intended to remind the disciples of the teachings of the Master [59] వానిపై తమ శిష్యులకొరకు ఋషీశ్వరులచే నేర్పడియున్న వివరణములు ఉపన్యాసములు ఆధారపడియుండెను. ఆసూత్రములు ఉపాధ్యాయుని బోధల విద్యార్థులు స్మరించుకొనుటకు ఒక సాధనముగా నేర్పడినవి. కాని In course of time, the lectures were lost, the threads alone remained, without pearls, lending themselves to the ingenuity of the commentators to hang whatever they liked on the Sutras [59] కాలానుసరణముగ ముత్యములువోయి సూత్రము శేషించినట్లు, ఆయుపన్యాసములు అదృశ్యములగుచు, ఆసూత్రములపై తమకు యిష్టమైనవానినెల్ల నంటింప భాష్యకర్తల బుద్ధికుశలతకు అవకాశ మొసంగెనని శ్రీనివాస అయ్యంగారు వ్రాసిరి. ఈవిషయమునే ప్రస్తావించి,

58. William James Pragmatism p. 151

As we have seen, the Sutra must from the first have been accompanied by a comment, which in course of time was lost or became defective [60] మనము తిలకించిన విధాన సూత్రము ఒక వ్యాఖ్యను తప్పక గలిగియుండునని స్పష్టము. కాని కాలక్రమముగా నవి లోపభూయిష్టములై గాని నశించిగాని యుండును అని కీత్ పండితుడు వాక్రొనెను.

---

## ఉపవర్షుడు

అందుచే నట్టి వ్యాఖ్య ఒకదానిపై నాధారపడి యుండియో లేక స్వతంత్రముగనో 'ఉపవర్షస్తు వృత్తికారః' అనుక్రమమున నుపవర్షుడు ఉభయ మీమాంసలకు వృత్తుల వ్రాసి కరుణాప్రపూర్ణుడై ముముక్షువులకు బ్రసాదించెను. ప్రథమముననే వ్యాససూత్రములకు శుకదేవుని వృత్తిగలదని యందురుగాని అది యలభ్యము. వృత్తి విరచించిన వృత్తికారు లసమాన విరాగమున తమ నామము నంకితము గావింపకుండుటచేతను, ఆవృత్తియు లభింపకుండుటయు శాస్త్రజ్ఞులు చాల కలవరము నొందిరి. అందుచే వృత్తికార నిర్ణయముగూడ సమస్యాపూర్ణమై యొప్పారుట పూర్వవిదితమే. పూర్వమీమాంసా భాష్యకర్తయగు శబరస్వామియు ఉత్తరమీమాంసా భాష్యకర్తయగు శంకరులును వృత్తికారుల నుపవర్షులుగనే స్వీకరించిరి. శంకరా

చార్యులవారు 'అత ఏవ చ భగవతోపవర్షేణ ప్రథమే తంత్రే' (3.3.53) అను సూత్రభాష్యమున వృత్తికారుల ఉపవర్షాచార్యులుగనే స్మరించిరి. కాని రామానుజా చార్యులవారు మాత్రము బోధాయనులే వృత్తికారులని భావించిరి. ఉపవర్ష బోధాయనులు వేరు అనియు, ఉప వర్షునివలెనే బోధాయనులును మీమాంసాద్వయమునకు భాష్యముల నుల్లేఖించిరని జకోబి పండితుడు భావించెను.[61] శంకర సంస్మరిత ఉపవర్షాచార్యుడు పాణిన్యాచార్యుని ఆచార్యుడేయైయుండునా అను సంశయము గలదని మాక్సు ముల్లరు తలంచెను.[62] బోధాయననామమునే ప్రస్తావింప లేదు శ్రీ శంకరులు. కాని రామానుజులు బోధాయనుని నుతించుటయేగాక వృత్తినుండి ప్రమాణముల గైకొని యుండెను. ఎట్లైనను బోధాయన ఉపవర్షులు ప్రత్యేక వ్యక్తులుగాక ఒకరే యని వేదాంత దేశికాచార్యుని సమన్వయము.



## శంకరుడు

అంత The oldest of the extent commentaries is by Sankara, the exponent of Monism[63] అద్వైత

61 Dr Jacobi : Prof. S. Radhakrishnan : Indian Philosophy Vol 2. P 375

62. Prof. F Max Muller . The Six Systems of Indian Philosophy p.116

ప్రతిపాదకుడైన శంకరులు రచించిన భాష్యమే ఉన్నవానిలో ప్రాచీన భాష్యముగ నున్నది. ఈభాష్యము నిర్విశేషమై నిర్గుణమై అనిర్వాచ్యమైన బ్రహ్మప్రతిపాదనము గావించు చున్నది. శ్రీశంకరులలో We saw tremendous intellectual power, throwing scorching light of reason upon every thing[64] సర్వమునకు అద్భుతకాంతి ప్రసాదించు అమానుష ప్రజ్ఞాశక్తి మనము గాంచుదుము అని వివేకానందు లను చందము. అత్యంత మేధాసంపన్నుడై శంకరులు యితరులపై నాధారపడక Sankara's philosophy in its inflinching monism, is his own rather than Badarayana's[65] శంకర సిద్ధాంతము తన సునిశిత అద్వైతవాదమున బాదరాయణునకు సంబంధించినది గాక తన స్వంతమేయని పండితులు శంకించునంత స్వాపేక్షికమై తనరొందియున్నది. కాని ఆనిర్ధారణము నిరాధారము. ఎందులకన బాదరాయణు ననుసరించునను బోధాయన గ్రంథము అలభ్యముగదా.[65] అందుచే తుదితీర్మానము అసంభవము. అందుచే శంకర ప్రోక్త అద్వైతసిద్ధాంతము అసాధారణ ధీ ప్రతిభాయుతమై సర్వప్రపంచ పండితవర్గమునే ప్రకాశింపచేసి యున్నదనుట కెట్టి సందియమును లేదు. శ్రీశంకరాచార్యులవారు క్రీ.త. ఎనిమిదవ శతాబ్దికి జెందినవాడని కొందరి తీర్మానము. కాని అదియు సందేహాస్పదముగ నున్నది. క్రీ. పూ. ఐదవ

---

64. Swami Vivekananda The Complete Works Vol. 2. p. 140
65. Prof. F. Max Muller The Six Systems of [illegible]

శతాబ్దమునకు కొందరు నిర్ణయించుచున్నారు. మళయాళ దేశమున కాలడి యను గ్రామము జన్మస్థానము.

## రామానుజుడు

తర్వాత సుప్రశస్తమగునది శ్రీరామానుజాచార్యుల వారి శ్రీభాష్యము. అతడు బోధాయనవృత్తి నెక్కువ గానుసరించి యందు ప్రమాణముల యథాతథముగ గూడ నుపయోగించి భాష్యరచనము గావించెను. రామానుజ సిద్ధాంతము విశిష్టాద్వైత మనబరగుచు, ఎక్కువ భక్తి ప్రబోధక మనిపించును. ద్రవిడ దేశమున భక్తిసంప్రదాయమున ననుసరించియుండు ద్రమిడభాష్యమునొండు రామానుజుడనుసరించినట్లును వ్యక్తమగుచున్నది. శ్రీరామానుజుడు క్రీ. శ. 12 వ శతాబ్దమునకు జెందినవాడని దెలియుచున్నది. ఆంధ్ర తమిళ దేశమధ్యస్థమునగల శ్రీపెరంబుదూరున వీరు జన్మించియుండిరి.

## ఇతరులు

శ్రీభాష్యమున అరమిడ, టంక, భర్తృప్రపంచ భారుచి, కపర్ది, బ్రహ్మనంద, గుహదేవ భాష్యము

లున్నట్లు సూచితముగాని, అవి అలభ్యముగా నున్నవి. శ్రీశంకరు తర్వాత యాదవప్రకాశ, భాస్కర, విజ్ఞానభిక్షు, నీలకంఠ, శ్రీపతి, నింబార్క, మధ్వ, వల్లభ, బలదేవులు తమతమ భాష్యముల విరచించియుండిరి. ఇవియన్నియు బ్రహ్మసూత్రములగల ఆచార్యుల నొక్కొక్కరిని అనుసరించి వ్రాయబడినవే యగును.

---

## మత భేదము

శ్రీశంకర ప్రతిపాదితము అద్వైతవాదమగుచుండ రామానుజీయము విశిష్టాద్వైత మనబడును. మధ్వాచార్యులది ద్వైతసిద్ధాంతమన నా వ్యవహార్యముగనుండ, నింబార్క సిద్ధాంతము భేదాభేదవాద మనబడును. శుద్ధాద్వైతమని వల్లభుని మతము పేరుగాంచ, అచింత్య ద్వైతాద్వైతమని బలదేవుని తత్త్వము పిలువబడును. ఇట్లు ఒకే సూత్రగ్రంథమునుండి యనేకములగు సిద్ధాంతములేగాక, అనుష్ఠానవిధానములు నుద్భవించి భారతీయాధ్యాత్మిక జీవనమునకు గొప్ప లాభమును చేకూర్చియున్నవి. ఈమతాచార్యులగూర్చియు, సిద్ధాంతములగూర్చియు సర్వ సిద్ధాంత సౌరభ ద్వితీయ తృతీయ ఖండముల విపులముగా చర్చింపబడును గావున నిట సంక్షిప్తము చేయబడినది.

---

## వేదాంతము

వేదశాస్త్రార్థ తత్త్వజ్ఞో యత్ర తత్రాశ్రమే వసన్ !
ఇహైవ లోకే తిష్ఠన్ స బ్రహ్మభూయాయకల్పతే॥

మను. 12. 102

వేదశాస్త్రార్థ తత్త్వము నెరిగినవా డేయాశ్రమమున నున్నను, యీలోకమునుండియే మోక్షమును బొందును అని సుప్రసిద్ధి గాంచియున్న వేదమునందు In the whole world there is no study so beneficial and so elevating as that of the Upanishads. It has been a solace of my life, it will be the solace of my death [66] ఉపనిషత్తులవంటి ప్రయోజనకరమును ఉత్కృష్టమును అగు పఠనము సర్వప్రపంచమున మరొకటి లేదు. అది నా జీవితమునకు శాంతి నొసంగెను. అదియే నా మృత్యువు నకుగూడ శాంతినొసంగునని షోపెన్హార్ నా జర్మన్ తత్త్వవేత్తచే గొనియాడబడిన ఉపనిషత్తులు గలవు. అవి Indeed these constitute the real toil and travail of the human heart in its first religious aspirations which gave birth to the intensity of its triumphs and its joys [67] మానవ హృదయముయొక్క సిద్ధత్వ సంతోషత్వముల జనింపజేసిన దాని ప్రాథమికోద్దేశముల

---

66. Swami Vivekananda . The Complete Works Vol. 5. p 109

యొక్క సాధక బాధకముల యథార్థ చారిత్రమును ఈయుపనిషత్తులు గలిగి యున్నవనియు మాకున్నముల్లరు వివరించి యున్నాడు.

---

## వేదము - ఉపనిషత్తులు

పూర్వోక్తవిధముగ నీయుపనిషత్సహిత వేదభాగ మంతయు నాఅక్షర బ్రహ్మముయొక్క వదనమునుండి ఉచ్ఛ్వాసనిశ్వాసములరీతి నప్రయత్నముగ బహిర్గతమై 'ఋగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వాంగిరసః' (బృ. 2.4.10) అనురీతి చతుర్విధమై విరాజిల్లియున్నవి. అందు ముక్తికోపనిషత్తు ననుసరించిచూచుచో, 'ఋగ్వేదస్య తు శాఖాస్స్యురేకవింశతి సంఖ్యకాః। నవాధికశతం శాఖా యజుషో మారుతాత్మజ॥ (1.12) సహస్ర సంఖ్యయా జాతాశ్శాఖాస్సామ్నః పరంతప। అథర్వణస్య శాఖాస్స్యుః పంచాశద్భేదతో హరే॥' (1.13) అనురీతి ఋగ్వేదమున కిరువదియొక్క శాఖలును, నూటతొమ్మిది యజుర్వేదశాఖలును, సామమునకు సహస్ర శాఖలును, అథర్వణ వేదమునకు ఏబది శాఖలును గలవు. అనగ మొత్తమునకు వేద భాగమునకంతటికి 1180 శాఖలున్నట్లు స్పష్టము. అందు 'ఏకైకస్యాస్తు శాఖాయా ఏకైకోపనిషన్మతా' (1.14) ఒకొ్కక శాఖకు ఒకొ్కక్క ఉపనిషత్తు గలదని యూ ...ు. కాని పిమ్మట ఉపని

షత్తుల నామముల వాకొనుచు 1180 ఉపనిషత్తులగాక 108 ఉపనిషత్తుల నామములమాత్రమే యుల్లేఖించుట గమనార్హము. అనగా 1180 — 108 = 1072 ఉపనిషత్తుల ప్రసంగమే చేయక ముక్తికము మౌనముద్ర ధరించెను. అయినచో నా 1072 ఉపనిషత్తులు ఏమైనట్లు? వేదము మొత్తముగానున్నదానిని వేదవ్యాసుడు భాగచతుష్టయముగ విభాగించినప్పుడు వానిని వదలి 108 ఉపనిషత్తుల మాత్రమే యుద్ధరించెనా లేక, నాతడు 1180 ఉపనిషత్తుల నుద్ధరించినను 1072 ఖిలమైపోవ 108 మాత్రమే శేషించి యున్నవా అను సంశయము గలుగును. ఖిలమైపోయియే యుండుచో నా ఖిల యుపనిషద్భాగము ప్రస్తుతము లభించు భాగమునకు సుమారు పదిరెట్లుండుటచే దాని నన్వేషింప యుద్ధరింప విద్వాంసులు కృషి సల్పుదురుగాక! ఉన్న 108 ఉపనిషత్తులే యింత మానవోద్ధరణ కుపయుక్త మగుచుండ నిక నా 1072 యుపనిషత్తులు లభించినచో నెట్లుండునో అచింత్యము. ఆ మహాభాగ్యము భారతవర్షమునకు సంప్రాప్తించునుగాక!

---

## 108 ఉపనిషత్తులు

ఆ 108 ఉపనిషత్తుల నామములు క్రిందివిధముగ ముక్తికోపనిషత్తు వివరించియున్నది. 'ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండ, మాండూక్య, తిత్తిరిః (7) । ఐతరేయం

చ, ఛాందోగ్యం, బృహదారణ్యకం తథా (10) ॥ బ్రహ్మ కైవల్య, జాబాల, శ్వేతాశ్వతర, హంస, ఆరుణిః (16) । గర్భ, నారాయణో, హంసో, బిందు, ర్నాద, శిర, శ్శిఖా (23) ॥ మైత్రాయణీ, కౌషీతకీ, బృహజ్జాబాల, తాపనీ (27) । కాలాగ్నిరుద్ర, మైత్రేయీ, సుబాల, క్షురి, మంత్రికా (32) ॥ సర్వసారం, నిరాలంబం, రహస్యం, వజ్రసూచికం (36) । తేజో. నాద, ధ్యాన, విద్యా, యోగతత్త్వా, త్మబోధకం (42) ॥ పరివ్రా, ట్త్రిశిఖీ, సీతా, చూడా, నిర్వాణ, మండలం (48) । దక్షిణా, శరభం, స్కందం, మహానారాయ, ణాద్వయం (53) ॥ రహస్యం, రామతపనం, వాసుదేవం, చ ముద్గలం (57) । శాండిల్యం, పైంగలం, భిక్షు, మహా, చ్ఛారీరకం, శిఖా (63) ॥ తురియాతీత, సన్యాస, పరివ్రాజా, క్షమాలికా(67) । అవ్యక్తైకాక్షరం, పూర్ణా, సూ, ర్యాక్ష్య, ధ్యాత్మ, కుండికా (73) ॥ సావి, త్ర్యాత్మా, పాశుపతం, పరబ్రహ్మావధూతకం (78) । త్రిపురాతాపనం, దేవీ, త్రిపురా, కఠ, భావనా (83) ॥ హృదయం, కుండలీ, భస్మ, రుద్రాక్ష, గణ, దర్శనం (89) । తారసార, మహావాక్య, ఘున బ్రహ్మాగ్నిహోత్రకం (98) ॥ గోపాలతాపనం, కృష్ణం, యాజ్ఞవల్క్యం, వరాహకం (98) । శాట్యాయనీ, హయగ్రీవం, దత్తాత్రేయం చ, గారుడం (102) ॥ కలి, జాబాల, సౌభాగ్య, రహస్య, రుచ, ముక్తికా (108)॥

ఈ 108 ఉపనిషత్తులకు ఉపనిష ద్బ్రహ్మయోగి యనువారు భాష్యమును విరచించిరి. దానిని అడయారు దివ్యజ్ఞాన సమాజమువారు ప్రకటించియున్నారు. శ్రీశంక రులు ప్రథమ దశోపనిషత్తులకును, శ్వేతాశ్వతర, కౌషీత క్యుపనిషత్తులకు భాష్యముల విరచించిరి.

ముక్తికోపనిషత్తు ననుసరించిగూడ నీఅష్టోత్తర శతో పనిషత్తులలో 'మాండూక్య మేకమేవాలం ముముక్షూణాం విముక్తయే।' (1.26) ఒక మాండూక్య పఠనముననే దృఢ జ్ఞానమును ముక్తియు సిద్ధించును. అట్లుగానిచో, 'తథాఽ ప్యసిద్ధం చేజ్జ్ఞానం దశోపనిషదం పఠ' (1.27) దశోపనిష త్తులు పఠనీయములు. 'తథాఽపి దృఢతా నో చేద్విజ్ఞాన స్యాంజనాసుత। ద్వాత్రింశాఖ్యోపనిషదం సమభ్యస్య నివ ర్తయ॥' (1 28) వానిచేతనుగూడ దృఢజ్ఞానము సిద్ధింపనిచో ముప్పదిరెండు ఉపనిషత్తుల పఠింపవలెను. 'విదేహముక్తా విచ్ఛా చే దష్టోత్తరశతం పఠ॥' (1.29) నీకు విదేహముక్తి కాంక్షయున్నచో అష్టోత్తర శతోపనిషత్తుల అధ్యయనము చేయుము అని తెలుపబడియున్నది. 'ఈశ కేన కఠ ప్రశ్న ముండ మాండూక్య తిత్తిరిః। ఐతరేయం చ ఛాం దోగ్యం బృహదారణ్యకం తథా॥' అనునవి దశోపనిషత్తు లనబడును. వీనికి శంకరులవలె ఆచార్యులెల్లరు వ్యాఖ్యల రచించియున్నారు. 1. అథర్వశిఖ 2. అథర్వశిర 3. అమృత నాద 4. అమృతబిందు 5. ఆత్మ 6. ఆరుణేయ్య 7. కైవల్య 8. కౌషీతకి 9. క్షురిక 10. గర్భ 11. గోపాలపూర్వతాపనీ

12. గోపాలోత్తరతాపనీ 13. చూలికా 14. జాబాల 15. తేజోబిందు 16. ధ్యానబిందు 17. నాదబిందు 18. నీల రుద్ర 19. పరమహంస 20. పిండ 21. ప్రాణాగ్నిహోత్ర 22. బ్రహ్మ 23. బ్రహ్మబిందు 24. బ్రహ్మవిద్య 25. మైత్రి 26. యోగతత్త్వ 27. యోగశిఖ 28. రామ పూర్వతాపనీ 29. రామోత్తరతాపనీ 30. సన్న్యాస 31. సర్వ 32. హంసోపనిషత్తులు ముప్పదిరెండు పఠనీయ ములు. 'ఏవమష్టోత్తర శతం భావనాత్రయనాశనం । జ్ఞాన వైరాగ్యదం పుంసాం వాసనాత్రయనాశనం॥' (1.40) ఈ 108 ఉపనిషత్తుల పఠించు పురుషులకు వైరాగ్యము తప్పక సిద్ధించి, భావనాత్రయము, వాసనాత్రయము నశించును అనియు ముక్తిక వాగ్దాన మొసంగుచున్నది.



## ఉపనిషత్ శబ్దము

ఉపనిష త్పదముయొక్క అర్థమును విచారించినచో 'సేయం బ్రహ్మవిద్యా ఉపనిషచ్ఛబ్దవాచ్యా తత్పరాయణాం స హేతోః సంసారస్యాత్యంతావసాదనాత్ । ఉపనిషత్పూర్వస్య స్తదే సదర్థత్వాత్ । తాదర్థ్యాత్ గ్రంథోఽప్యుపనిష దుచ్యతే' (బృ.భా. 1.1.1) బ్రహ్మవిద్యయే ఉపనిషత్తన బడును. దీని పఠించువారి సంసారకారణమైన అవిద్యానాశ మొనరించును. 'సత్' అను పదము 'ఉప' 'ని' అను

ఉపసర్గలతో గూడియు బ్రహ్మమునకే యన్వయము. అదే యుద్దేశముతో బోధించుచున్న గ్రంథములు ఉపనిష త్తన బడుచున్నవని శంకరులు బృహదారణ్యక భాష్యమున వివ రించిరి. ఈయర్థమునే తైత్తిరీయక భాష్యమున (1.1.1) గూడ వివరించియున్నారు శంకరపూర్వులగు ద్రమిడా చార్యులుగూడ నిట్లే నిశ్చయించియుండుటచే శంకరులు యీ యర్థమును ద్రమిడాచార్యునినుండి గ్రహించెనని కుప్పుస్వామి శాస్త్రి వచించెను. కఠోపనిషద్భాష్యమున కుపోద్ఘాతమున గూడ శంకరులు యీ యర్థమునే యింక వివరణము చేసి యున్నారు. ఉపనిష న్నిర్వచనము గావించుచు, దాని యర్థమునకు జీవబ్రహ్మైక్యము నుపదేశించు మహావాక్యము నుదాహరణముగా గొని, 'ఉప = సామీప్యేన (అహం బ్రహ్మాస్మీతి గమయిత్వా నితరాం అహం మమాది గ్రంథీం శిథిలీకృత్యావిద్యాం స్వకార్య సంస్కారాం) సాదయతి = వినాశయతీతి ఉపనిషత్' నేనే బ్రహ్మమును అను జ్ఞాన మును త్వరగా గలిగించి నేను నాది అనెడి మనోగ్రంథులను శిథిలమొనర్చి నేను నాది యనెడి అవిద్యను నశింపజేయునది 'ఉపనిషత్తు' అని చెప్పబడుననియు నుపనిషత్తులు బోధించు చున్నవి.

## బ్రహ్మ భావము

పై నిర్వచింపబడియున్న యుపనిషత్తులలో జీవ బ్రహ్మ ప్రపంచములగూర్చియు, ముక్తివిధానమును గూర్చియు, సమగ్రముగా వివరింపబడియున్నది. The idea of one Supreme Person, who pervades the whole universe and remains beyond it, is found in a hymn of the Rig-Veda[68] సర్వవిశ్వము నావరించియు నతీతముగనున్న బ్రహ్మముయొక్క భావము ఋగ్వేదీయ మంత్రములగలిగి యుపనిషత్తుల కాధారమైనదని సతీశచంద్ర చటర్జీ భావము. ఇదేభావము నుల్లేఖించుచు The beginnings of Indian philosophy which are to be found in the latest hymns of the Rig-Veda and in the Atharva-Veda are concerned with the speculations on the origin of the world and on the eternal principle by which it is created and maintained[69] భారతీయ తత్వశాస్త్రమున కాధారములుగ ప్రాచీనమైన ఋగ్వేదాథర్వణవేద మంత్రములు గలవనియు, నవి సృష్టినిగూర్చియు, దాని సృజించి పోషించు నిత్యతత్వమును గూర్చియు మీమాంసించి యున్నవని మాక్డొనెల్ తెలుపుచున్నాడు. We find Vedantic thought even in some of the earliest hymns of the Rig-Veda e. g. the Nasadiya Sukta, which forms as it were the basis of later Upanishads[70] ఋగ్వేదీయ

68. Prof. Satishchandra Chaterjee . In Introduction to Indian Philosophy p. 55

69. Dr. A. A. Macdonell : A History of Sanskrit ...

మగు నాసదీయసూక్తమున ఉపనిషత్తుల కాధారమగు మంత్రము లున్నవనియు, అయినను నాటి ఆర్యులు కర్మరతులై యుండి యజ్ఞయాగాదికమందు మగ్నులై యుండి, These were elaborated to such an extent by the Brahmanas, the priestly class, that persons of the rationalistic bent of mind ravolted and questioned the very efficacy of the sacrificial religion. They engaged themselves in metaphysical problems, and arrived at different solutions of the world. The Vedantic thought that was in germ form was now developped more and more, and we have the Upanishads[70] కర్మకాండకు బ్రాహ్మణులు అత్యధికముగ ప్రాధాన్యత నొసంగుచుండ, కొందరు యోచనాపరులు ప్రతిఘటించి, కర్మకాండ ప్రయోజనమునే ప్రశ్నించిరి. వారు అభౌతిక సమస్యానిమగ్న మానసులై విశ్వమును గూర్చి కొన్ని వివిధరూపములైన నిర్ణయముల కేతెంచిరి. అట్టి వేదాంత భావబీజము, పరిణమించి ఉపనిషద్రూపము దాల్చెను అని వీరేశ్వరానందులు వాకొనిరి. అందుచేతనే The Upanishads contain too many technical terms, such as Brahma, Atma, Dharma, Vrata, Yoga, Mimamsa, and many more, to allow us to suppose that thay were not the product of one day or of one generation[71] బ్రహ్మ, ఆత్మ, ధర్మ, వ్రత, యోగ, మీమాంసాది యనేక పారిభాషిక పదము లుపనిషత్తుల గోచరించుచు, యుపనిషత్తులు ఒకదినమున, ఒకతరమున

70. Swami Veereswarananda : Brahma Sutras p. 2

71. Prof. F. Max Muller The Six Systems of Indian Philosophy

నిర్మింపబడినవి గావని నిరూపించుచున్నవని మాక్సుముల్లరు కూడ విశ్వసించుచున్నాడు.

---

## బ్రాహ్మణ క్షత్రియ భేదము

పై వర్ణితమైన వేదాంత జననమునుగూర్చి యోచించి బృహదారణ్యకాది యుపనిషత్తులలో క్షత్రియులయొద్ద బ్రాహ్మణులు విద్యగైకొనుట మొదలగు విషయముల బరిశీలించి, In the two different Vedic schools, it is expressively declared that the knowledge of the Brahman as Atman, the central doctrine of the entire Vedanta, is possessed by the king; but on the contrary, is not possessed by the Brahmana famed as a Vedic scholar [72] వేదాంతమునకు మూలసూత్రమగు ఆత్మ బ్రహ్మవాదము రెండు వైదిక శాఖలలో క్షత్రియులచేత స్పష్టముగా బ్రకటింపబడియున్నది. వేదవిదు డనబడియున్నను బ్రాహ్మణునకు అది లభింపలేదనియు, We are forced to conclude if not with absolute certainity, yet with a very high degree of probability, that as a matter of fact the doctrine of the atman standing as it did in sharp contrast to all the principles of the Vedic ritual, though the original conception may have been due to Brahmanas, was taken up and cultivated primarily not in Brahmana, but in Kshatriya circles, and was first adopted by the former in later times [72] సంపూర్ణ నిశ్చయమున కాకున్నను

72. Prof. P. Deussen : Philosophy of Upanishads p. 17.

చాల అవకాశమున్నదిగాక, యథార్థమునకు వైదికకర్మకు ఆత్మవాదము అత్యంత విరుద్ధముగా నున్నదిగాన, మొదట దానిని బ్రాహ్మణులే కనుగొనియున్నను, బ్రాహ్మణులలో గాక నది క్షత్రియసంఘముచే స్వీకరింపబడి, అభివృద్ధి చేయబడియుండ, బ్రాహ్మణులు మరల దాని కాలాంతరమున స్వీకరించిరి అని ఆచార్య దేవసేన్ పండితుడు ఉద్దేశించెను. కాని ఆవాదము నిరాధారము. There is no other country in the world where in such ancient times such disputations would have been thought of [73] అతి ప్రాచీనకాలమున అట్టి సభల భావించిన దేశము మరొక దేశములేదని జనక, అజాతశత్రు, అశ్వపతి మొదలగు రాజుల సన్నిధానమున ఉపనిషత్తుల కాలమునాటి సభల పఠించి మాక్సుముల్లరు అచ్చెరువందిన సభలలోనైనను బ్రాహ్మణ బ్రాహ్మణేతర వాదములు జరిగియుండలేదు అంతియగాక, యాజ్ఞవల్క్య శుకాది మహర్షి పుంగవుల ఆయా చక్రవర్తులు గౌరవించి యుండిరేగాని అసూయనొంది తిరస్కరించి యుండలేదు. మరియు, ఆ రెండు వర్గములకు అసూయా ద్వేషములే యున్నచో ఋషీశ్వరులు క్షత్రియులచే నిర్వహింపబడు ఆసభల కేతెంచి వాదముల బాల్గొనియుండరు. ఆనాటి సభలలో క్షత్రియులు పాల్గొనుటగాని సభాగౌరవమును పొంది రాజాదరణచే వెయ్యి గోవుల గైకొనియుండుటగాని యెందును గానరాదు. జనకాదులైనను పంచశిఖాచార్య

మొదలగు గురువుల నాశ్రయించియే తమ విద్య గైకొనిరి గాని క్షత్రియ పరంపరగా నావిద్య వచ్చియున్నట్లు గానుపించదు. 'ఏవం పరంపరా ప్రాప్తమిమం రాజర్షయో విదుః। సకాలే నేహ మహతా యోగో నష్టః పరంతప॥' (గీ.4.2) అర్జునా, రాజర్షులు యీప్రకారముగా పరంపరగా పొందబడియున్న యీ యోగమును ఎరుగుదురు. ఎక్కువ కాలానుగతముగ నిది లోకములో విచ్ఛిన్నమయ్యెను అను గీతా వాక్యమున రాజర్షి శబ్దమును చూచి కొందరు పై దురభిప్రాయమునకు రానవకాశము గలదు. కాని ప్రకరణాను నాలోచించిన చో తృతీయాధ్యాయముననే వివరింపబడి యున్న కర్మయోగము ననువదించుచు శ్రీకృష్ణుడు యీ వాక్యము నుచ్చరించుటచే 'ఇమం' శబ్దము కర్మయోగపర మని గ్రాహ్యము. గీతారహస్య కర్త తిలక్ మహాశయులు నిట్లే గ్రహించియున్నారు. కాన, కర్మయోగము ముఖ్యముగా రాజ్యపాలనాది కార్యసిమగ్నుల కవసరమగుటచే మహర్షులు చక్రవర్తుల కుపదేశించుటయు, అది పరంపరానుగతముగ నుండుటయు దాని కృష్ణభగవానుడు పార్థునకు బోధించుటయు సముచితముగనే యున్నది. కాన శ్రీకృష్ణ పరమాత్మ వచనములనైన బ్రాహ్మణాబ్రాహ్మణ విభేదము అభావము.

అందుచే నాటి భారత వాతావరణమున ఆధునిక కాలములందువలె బ్రాహ్మణాబ్రాహ్మణ వైరములు అగోచరములగుటయేగాక వారన్యోన్యమైత్రితో, పరస్పర సహకారాంగీ

కారములతో, అన్యోన్యాభివృద్ధికి సహకారులై మెలంగి మహాభారతవర్ష పరిణామమునకు దోడ్పడిరనియే భావింప నగును. కాన The idea of an independent creation of thought that of worriors as opposed to priests, is really fantastic [74] బ్రాహ్మణులకు విరుద్ధముగ క్షత్రియులు ప్రత్యేక సిద్ధాంతకారకులైరి అను భావము నిశ్చయముగా అభూతకల్పనమని కీత్ తీర్మానించెను.



## విశాల విజ్ఞాన వాతావరణము

ఉపనిషత్కాలమునకు బూర్వమే అనంతమైన తాత్త్వికాధ్యాత్మిక విజ్ఞానము నాటి ప్రాచీన భారతమున నిండి వెలుగొందియుండెననియు, Of which we seem to see the last ramnants only in our Upanishads, while the original springs are lost to us for ever [75] వాని నుండి అసంఖ్యాశేషములే మన యుపనిషత్తులు మాత్రమైయుండ, నిజమైన ధారలు మనకు శాశ్వతముగా నదృశ్యమైపోయిన వనియు మాక్సుముల్లరు తెలుపుచున్నాడు. భారతీయుక్క విజ్ఞాన స్రవంతినిగూర్చి స్మరించుచు, There existed in India a large common fund of philosophical thought which, like language, belong to no one particular but was like air breathed by every living and thinking man. Thus only can it be explained that we find a number of

74 Dr. A. B. Keith . A History of Sanskrit Literature p. 487

75. Prof. F. Max Muller : The Six Systems of Indian Philosophy p. 5

ideas in all or nearly all systems of Indian Philosophy, which all philosophers seem to take simply for granted, and which belong to no one particular school in particular [76] జీవించు భావించు మానవులెల్ల ఆస్వాదించు వాయువు వలె, నే సిద్ధాంతమునకు చెందక భాషవలె సర్వభుక్తమైన విశాల తత్త్వవిజ్ఞాన సమూహము భారతావని గలదనియు, నే ప్రత్యేక వాదమునకు జెందనివిగను, సర్వసామాన్యముగ తత్త్వవేత్తలచే గ్రహింపబడియున్న, భారతీయ తత్త్వ శాస్త్రమునందుగల సర్వసిద్ధాంతములలోగల అనేక భావములకు అదే నిరూపణమనియు నాతడు వచించెను. ఆభావ జాలమంతయు ఘనీభవించి అభివృద్ధిగాంచి, వైదికయుగమునకు అంతముగ నుపనిషద్రూపమున మూర్తీభవించి యున్నది.[77]

అట్లు ఉపనిషత్తుల భావముల ధ్యానించియున్న మాక్సుముల్లరు I feel indebted to it for much that has been helpful to me in my passage through life[78] నాజీవిత యాత్ర కుపయుక్తమైన దానికి నేను ఋణపడియున్నానని యనుటయం దాశ్చర్యమావంతయు నుండదుగదా! అట్టి భారత ఔన్నత్యమును దిలకించి, The nation and the race which can produce such a magnificient type (Buddha) must have deep reserves of wisdom and inner strength[79] బుద్ధునివంటి అద్భుతాదర్శమును సృజింప

76 Prof F. Max Muller The Six Systems of Indian Philosophy p 104
77. Prof. F Max Muller . The Six Systems of Indian Philosophy p 4
78. Prof. F. Max Muller · The Six Systems of Indian Philosophy p.193
79. Pandit Jawaharlal Nehru . Discovery of India p. 101

గల్గిన జాతికి అగాధమైనవిజ్ఞానరాసి, అంతరశక్తి యుండవలె నని జవహరిలాల్ నెహ్రూ పండితుడు గర్వించియుండుటయు సముచితము. I love India, not because I cultivate the idolatory of geography, not because I have had the chance to be born in her soil, but because she has saved through tumultuous ages the living words that have issued from the illuminated consciousness of her great ones[80] భౌగోళిక విగ్రహారాధనము నాకభివృద్ధి నొందుటచేగాక, యీభూమిని నే జనించియుండుటచే గాక, తనయొక్క మహాపురుషుల ఆత్మానుభవ జన్యమగు సజీవ వాక్యసముదాయమును, అనేక కల్లోల యుగముల నుండి ఆపి రక్షించియుండుటచే భారతావని నేను ప్రేమించు చున్నానని రవీంద్రుడు ప్రేమప్రకటన గావించుటయు సమంజసము. అట్టి యసాధారణ సంస్కృతిని ప్రేమించియే We will never forget them (ancients) or cease to take pride in that noble heritage of ours. If India forgets them, she will no longer remain India, and much that has made her our joy and pride will cease to be[81] మన పూర్వుల విస్మరింపజాలము. వారు మనకు ప్రసాదించియున్న దివ్యమైన వారసత్వమునకు గర్వింపక మానము. వారిని భారతవర్షము విస్మరించినచో, అది భారతభూమిగ నుండదు. ఆమెవలన మనకానందమును, గర్వమును గలుగజేసిన కారణము లదృశ్యములగును అని నెహ్రూ పండితుడు గట్టిగ వక్కాణించుచు మన ప్రాచీన

80. Rabindra Nath Tagore · Pandit Jawaharlal Nehru : Discovery of India p. 485

81. Pandit Jawaharlal Nehru : Discovery of India p. 438

వైజ్ఞానిక వైభవమును కొనియాడియున్నాడు. అవును, డగ్లస్ వంటి పాశ్చాత్య పండితులే భారతిని The Hindus, alone of mankind, have penetrated behind the veil, and possess the knowledge, which is really not philosophical ie., wisdom-loving but wisdom itself[82] మానవప్రపంచమున హిందువులొక్కరే అజ్ఞానావరణమును ఛేదించి జ్ఞానము నార్జించిరి. ఆజ్ఞానము యథార్థమున తాత్త్విక జ్ఞానము. అనగా జ్ఞానప్రీతిగాకుండ సాక్షాత్తు జ్ఞానమే అగుచున్నదని ప్రణమిల్లుచుండ నింక భారతావని జనించి, ఆమెచే భౌతిక మానసికాధ్యాత్మికముగ పోషింపబడి మరల నందే లయించు భారతీయు లామహాతల్లిని గొనియాడుటయే గాక నర్చించుటయందు ఆశ్చర్యమేమి!

## అవిస్పష్ట ఉపనిషత్తుల సిద్ధాంతము

కాని పై వివరింపబడిన యుపనిషత్తులు Had no set theory of philosophy or dogmatic scheme of theology to propound. They hint at the truth in life, but not as yet in science or philosophy[83] ఒక ప్రత్యేక తత్త్వసిద్ధాంతమునుగాని, అనుష్ఠాన సూచికమైన విధానమునుగాని వివరించుటకు లేకుండెను. జీవితము లోని సత్యము నవి సూచించునేగాని, అవి తత్త్వమునుగాని

82. Duglas Grant Duff Ainslie · The Science of Religion of Swami Yogananda

83. Prof. S. Radhakrishnan : Indian Philosophy Vol. I p. 140

శాస్త్రమునుగాని తెలుపలేదు. అంతియగాక అవి సంసిద్ధమైన సిద్ధాంతమును జూపక, ప్రథమదృష్టికి పరస్పర వైరుధ్యములతో గూడినట్లు జేయుచున్నవి. అప్పటి తాత్త్విక భావములు The Upanishadic philosophy is in a chaotic condition[84] ఉపనిషత్తుల తత్త్వసిద్ధాంతము సంక్షుభితస్థితి నుండెననియు మాక్డొనెల్ వచించియున్నాడు. కాని మన ప్రాచీనులు తాత్త్వికవిషయముల నితమిత్థమని తేల్చకుండుటకు కారణముగా Intellectual modesty born of the cousciousness of human imperfections compelled the thinkers of the Upanishads to rest in negative statements of the Supreme Reality[85] మానవలోప స్మృతివలన గలుగు ప్రజ్ఞారూప వినయము ఉపనిషత్ జ్ఞానులను పరమార్థ సత్యమునుగూర్చి వ్యతిరేక వాక్యముల బలుకజేసెనని రాధాకృష్ణ పండితుడు వచించెను. అయినను In the age of the Upanishads, when the thinkers were speculating as to the nature of the universe and the destiny of man, the seeds were being sown which eventually blossomed out into distinct systems of philosophical thought[86] ఉపనిషత్కాలమున, సృష్టితత్త్వమునుగురించియు, మానవ గమ్యమును గూర్చియు ఋషీశ్వరులు యోచించుచుండు కాలముననే, అవిస్పష్టముగ వికసించియున్న తత్త్వశాస్త్ర బీజములు నాటబడుచునే యుండెనని హెరాల్డు స్మిత్ వచించియున్నాడు. పూర్వోక్తరీతిగ

84. Dr. A. A. Macdonell : A History of Sanskrit Literature p. 385
85. Prof. S. Radhakrishnan . Indian Philosophy Vol. 1. p. 187
86. F. Harold Smith · Out Lines of Hinduism p. 46

1180 ఉపనిషత్తులలో 108 మాత్రమే మనకు లభించి యున్నను మాక్సుముల్లరు లెక్కకు 150 యుపనిషత్తులును, డాక్టరు బర్నెల్ గణనకు 170 యుపనిషత్తులును వచ్చి నట్లును తెలియుచున్నది. అవి 108 ఉపనిషత్తులాగుం దంత ర్గతములో లేక అన్యములో తెలియకున్నవి.

---

## వేదాంతసూత్ర జననము

అట్లు అవిస్పష్టముగనున్న ఉపనిషత్ సిద్ధాంతముల క్రమపరచు నవసర మేర్పడెను. ఉపనిషత్తులు సూచించి వివరింపకుండుటచే Numerous are the suggestions of truth, so various are their guesses at God, that almost anybody may seek there what he wants and find what he seeks and every school of dogmatics may congratulate itself on finding its own doctrine in the sayings of the Upanishads[87] సత్యమునుగూర్చి యనేక యూహలును, భగవంతునిగూర్చి వివిధములైన యోచనలును జరిగి, ఎవడైనను, తనకు వలసినదాని నందు గాంచుట కవకాశమేర్పడి, తమ సిద్ధాంత ముపనిషత్తుల వాక్యముల నుండుటచే ప్రతి సంకుచిత సిద్ధాంతముగూడ ఆత్మస్తుతి చేసికొనుటకు పూర్తి అవకాశ మేర్పడెను. కావున కీత్ పండితుని భావము ప్రకారము, After the period of the Upanishads dates the time when ideas of earlier thinkers

87. Prof. S. Radhakrishnan, Indian Philosophy Vol I p. 142

were gradually taken up and made into a definite system, Darsana, taught in a philosophical school, in the sense of a series of teachers who developed or atleast expounded one definite body of doctrine [88] ఉపనిషత్కాలానంతరము, ప్రాచీన మహర్షుల భావముల గైకొని దర్శన రూపమున క్రమమొనరించి, తత్త్వశాస్త్ర పాఠశాలల, బోధించుకొను కాలము ప్రారంభించెను. ఆయాచార్య పరంపర లేక ఆసమూహము ఒక్క సిద్ధాంతమును అభివృద్ధి చేసి యుండిరి. ఇట్టి యభివృద్ధి కొంతకాలము జరుగగా There ultimately came the desire to fix in definite form the doctrines of the school, and this led to the composition of the Sutras [88] ఆయాసిద్ధాంతములకు విస్పష్టరూపము నొసంగుట జరిగి సూత్రరచనమునకు మార్గదర్శి యయ్యె ననియు కీత్ మహాశయుని అభిప్రాయము.



## వేదాది యుగములు

అనగ వేదములను దాని శాఖలను, బరిశీలించిన పాశ్చాత్య పండితవర్గము దానిని కొన్ని యుగములుగా కాల విభజనము గావించియున్నారు. మాక్సుముల్లరుయొక్క కాలవిభజనము ప్రకారము వైదిక వాఙ్మయమును, ఛంద, మంత్ర, బ్రాహ్మణ, సూత్రయుగములుగా చేసియున్నాడు. అతడు ఒక్కొక్క యుగమునకు 200 వత్సరములు

88 Dr. A. B. Keith : A History of Sanskrit Literature

మాత్రము నిర్ణయించియున్నాడు. కాని డాక్టరు హాంగ్ పండితుడు ఆ దేవిధానము నవలంబించి, మధ్యకాలమును 500 వత్సరములుగ భావించు టుత్తమమని భావించెను.[89] కాని యీ విభజనసిద్ధాంతమే సంప్రదాయ విరుద్ధమేమో అని తోచును. ప్రమాణాధార మావంతైయు గానుపింపని యిట్టి విషయముల నిర్ధారణ గావించుటకంటె 'అచింత్యాః ఖలు యే భావాః న తాం స్తర్కేణ యోజయేత్' (బ్ర.సూ. భా. 2.1.6) ఏవిషయములు నిశ్చయముగ నచింత్యములో వానిని తర్కముచే సమన్వయింప యత్నింపకుండుట సముచితమని తోచును.

---

## ఉపనిషత్తులు–దర్శనములు

అట్లు ఉపనిషత్తులనుండి యుద్భవించిన భారతీయ విజ్ఞానమంతయు There is no important form of Hindu thought, heterdox Buddhism included, which is not rooted in the Upanishads[90] అవైదిక మనబడు బౌద్ధముతోసహా ప్రముఖ హిందూసిద్ధాంతములన్నియు ఉపనిషత్తులపై నాధారపడి యేర్పడియున్నవి. అట్లుపనిషత్తులపై నాధారపడి జనించిన చార్వాకాది సిద్ధాంతములు లోకాయతికములై అనర్థదాయకములై యుండుటచే వాని నెడు

ర్కొనగల వైదిక సాంప్రదాయిక ధీయుక్తమగు సిద్ధాంతములు నిర్మింప నవసరమేర్పడెను This led to the foundation of the six systems of orthodox Hindu philosophy-orthodox in the sense that they accept the authority of the Vedas in things transcendental[91] అలౌకిక విషయముల వేదప్రామాణ్యమును స్వీకరించు వైదికములగు షడ్దర్శన నిర్మాణమున కిది యవకాశ మొసంగెను.

---

## పూర్వ ఉత్తర మీమాంసలు

ఈషడ్దర్శనములు వైదికములయినను అందు, వేదములకు సంపూర్ణ సన్నిహిత సంబంధముగలవి పూర్వోత్తర మీమాంసా ద్వయము. కౌషీతకీ బ్రాహ్మణ వాక్యము ననుసరించి యాగానుష్ఠాన ప్రక్రియనుగూర్చి చర్చించుట మీమాంస యనబడును. ఆ యర్థము పూర్వమీమాంస కన్వయించునుగాని, సామాన్యముగ నేదేని విషయమును పరిశీలించుట యను యర్థము బ్రహ్మాత్మవిషయ పరిశీలనము గావించు వేదాంతమునకుగూడ నీపదమే అన్వయింపబడి బ్రహ్మమీమాంస యనియు ఉత్తరమీమాంస యనియు నాబడియున్నది. ఈ మీమాంసాద్వయము పరస్పరాపేక్షికములై పూర్వోక్తవిధమున జైమిన్యాచార్యుడు తన కర్మమీమాంసాసూత్రముల బాదరాయణుని అయిదు పర్యాయ

ములు స్మరించియుండ (పూ. మీ. సూ. 1.1.5, 5.2.19, 6.1.8, 10.8.43, 11.1.64) బాదరాయణవ్యాసుడు జైమినిని తన బ్రహ్మమీమాంసాశాస్త్రమున పదునాలుగు పర్యాయములు (వే. సూ. 1.2.28, 1.2.31, 1.3.31, 1.4.18, 3.2.40, 3.3.33, 3.3.43, 3.3.50, 3.4.2, 3.4.18, 3.4.40, 4.3.12, 4.4.5, 4.4.11) సంస్మరించి ఖండన మండనముల గావించియున్నాడు. కర్మమీమాంస యజ్ఞ యాగాద్యనుష్ఠాన విధానమును చర్చించి శాస్త్రీయవిధానమును నిర్ణయింప, వేదములగల తాత్త్వికవిషయ పరిశీలనము గావించి దానినుండి యొక విశిష్ట తత్త్వవిచారణా శాస్త్రమును బెంపొందించెను. అనాదికాలమునుండి పరంపరానుగతముగ వచ్చుచున్న కర్మప్రక్రియను మీమాంసించి ఒక విశిష్టక్రమమును మీమాంసాశాస్త్రము గావించుచుండ, They are not mere speculations but the record of the spiritual experiences of the race for centuries, actual realisations or super-conscious perceptions[92] వేదాంత చర్చనీయాంశములు కేవల మూహాగానములుగాక, శతాబ్దములుగ జాతికిగల అలౌకికములగు, ప్రత్యక్షానుభవములే యని వీరేశ్వరానందులు వచించునట్లు, అనాదిసిద్ధమైన ఆత్మానుభూతమగు తాత్త్విక విషయపరిశీలనము గావింపబడి యున్నది. అందుచే పూర్వమీమాంసా దర్శనమునకు నెక్కువ తాత్త్వికమీమాంసా నైపుణ్య మవసరములేక, అసలు తత్త్వశాస్త్రము కాదేమోయని సంశయింపబడు

92. Swami Veereswarananda, Brahma Sutras p. 1.

చుండ, వేదాంతము ఉపనిషత్తులగల తత్త్వవిషయము లన్నింటిని సేకరించి సమగ్ర పరిశీలనగావించి, విస్పష్టమును సమగ్రమును అజేయమును అగు తత్త్వశాస్త్రముగ మూర్తీభవించి, పూర్వదర్శనముల నన్నింటిని అప్రధానముగ నొనరించివైచెను.

కర్మమీమాంసకు పూర్వమీమాంసయనియు ప్రాచీమీమాంసయనియు వ్యవహారమగుటచే నది ఉత్తరమీమాంసకు పూర్వమని అనగా పూర్వకాలికమని గొందరు భావించిరి. కాని, జ్ఞానమునకు పూర్వమగు కర్మను ప్రతిపాదించు శాస్త్రమగుటచే నది పూర్వమనియు, జ్ఞానకాండను ఉత్తరమనియు ననిరని పండితాభిప్రాయము.[93] ఈభావమును రామానుజులు స్వీకరించియున్నారు గాని శంకరులు సమ్మతింపక, కర్మ జ్ఞానముల గమ్యము విభిన్నమగుటచే రెండును ఒకేశాస్త్రమగుటగాని, రెండును అపేక్షికములగుటగాని అసమంజసము, అసమ్మతము, అశాస్త్రీయము అని వాదించిరి. అయినను మీమాంసాద్వయము పూర్వ మొకే శాస్త్రమనియు తర్వాత కుమారిల శంకరులు వాని విభజించి రెండుగ నాచరింపజేసిరనియు జకోబి భావించియుండెను.[94] కాని ఆ వాదము అప్రామాణికమును నిరాధారమునై యున్నది. జైమిని బాదరాయణుల భావములగూర్చి, ఒకశాస్త్రముగ మరొక కర్తగాని, సాంప్రదాయిక సంఘములుగాని వాని

93. Prof. F Max Muller : The Six System of Indian Philosophy p. 197
94. Dr A. P. Keith : A History of S[illegible]

రచించి యుండవచ్చుననియు నందుచేతనే వారిరువురిగ్రంథములు ఒకరినామముల నొకరు స్మరించుకొనుటయేగాక, తమ శాస్త్రముల దమ నామములనే స్మరించుట జరిగియున్నదనియు గొందరివాదము.[95] ఆ రెండు దర్శనములకుగూడ ఉపవర్షాచార్యుడు వృత్తి విరచించియుండుటచే నొకే శాస్త్రముగనున్న మీమాంసాశాస్త్రమునకు అతడు వ్యాఖ్య జేసియుండుననియు దాని ప్రథమభాగమైన కర్మభాగమునకు శబరస్వామియు, జ్ఞానకాండకు శంకరులును భాష్యముల నిర్మించిరనియు వచించుచు, 3.3.53 బ్రహ్మసూత్రభాష్యము యీయర్థమును స్ఫురింపజేయుచున్నదనియు ఆచార్య దేవసేన్ భావించును.[95] కాని శంకరులు జ్ఞాన కర్మ సముచ్చయముగాని సంబంధముగాని అసంబద్ధముగా దీర్మానించును. కర్మ మజ్ఞానజనితముగా నిరసించును. అట్టిచో ఆసూత్రభాష్యమున శంకరులు మీమాంసాద్వయముయొక్క ఏకత్వప్రతిపాదనము గావించియుండుననుట సాహసమగుచున్నది. అట్లేయగుచో ప్రాచీన సిద్ధ షడ్దర్శన వ్యవహారమునకు భంగమువాటిల్లి పంచదర్శన వ్యవహార ముండవలెను. అట్టి ఆధారము నిరాధారముగ నున్నది. అదియునుగాక ప్రత్యేక దర్శన ప్రతీతిగాంచిన మీమాంసాదర్శనము తన విశిష్టతను గోల్పోయి అప్రాధాన్యతనొందియుండును. అట్లు ప్రమాణమును గానుపింపదు. బ్రహ్మప్రతిపాదనగావించు వేదాంతదర్శనముతో బోల్చియుండ

95. Swami Veereswarananda. Brahma Sutras p. 7

నోపు 'కాణాదపి కపిలాద్యైస్తు మునీంద్రైరపి కీర్తితం। మందబుద్ధ్యనుసారేణ కేవలం పరికీర్తితం॥' వైశేషిక సాంఖ్యాదులు కణాద కపిలాది మునీంద్రులచే నిర్మింపబడి యున్నను, అవి మందబుద్ధులకొరకే కీర్తింపబడినవని సూతసంహిత వచించుచుండ, 'కణాదేన తు యత్ప్రోక్తం శాస్త్రం వైశేషికం మహత్। గౌతమేన తథా న్యాయం సాంఖ్యం తు కపిలేన తు॥ ద్విజన్మనా జైమినినా పూర్వం వేదమపార్థకం। శాస్త్రాణి చైవ గిరిజే తామసాని నిబోధ మే॥' కణాద ప్రోక్తమైన వైశేషిక మహాచ్ఛాస్త్రము, గౌతముని న్యాయము, కపిలుని సాంఖ్యము, ద్విజన్ముడైన జైమిని యొక్క పూర్వమీమాంసాది తామస శాస్త్రములు వేదముల కపార్థకల్పనముగా నేను బోధించితిని అని పద్మపురాణముగూడ, పంచదర్శనముల నొక్కటిజేర్చి తామసికములనియు, వేదబాహ్యము లనియుగూడ నిందించి యున్నది. కాని, కర్మమీమాంస నొక్కదానినే త్రోసిపుచ్చుట పూర్వము జరుగలేదు. అందుచేతనే Nyaya and Vaiseshika lay stress on the practical side, Sankhya and Yoga emphasize the mental aspect, while the Mimamsa systems stress the spiritual aspect న్యాయ వైశేషికములు భౌతికమును, సాంఖ్య యోగములు మానసికమును, మీమాంసాద్వయము ఆధ్యాత్మికమును గట్టిగ ప్రతిపాదించును అని పూర్వము వచించబడియున్నది. ఆ మీమాంసా ద్వయమునందును వేదాంతదర్శనము జ్ఞాన సాధనమగు జీవ బ్రహ్మ ప్రతిపాదనము [illegible]

దర్శనోత్కృష్టశాస్త్రమై వాని నన్నింటిని అప్రధానముగ ద్రోసిపుచ్చి అంతట తానై వెలుగొందియున్నది. ఎట్లనను The Mimamsa and the Vedanta may be regarded as the direct continuation of the Vedic culture[96] మీమాంసా వేదాంతములు వైదిక సంస్కృతులయొక్క ప్రత్యక్షరూపములనుట సమంజసము.

---

## వేదాంత ప్రాశస్త్యము

అందును The Vedanta Sutras of Badarayana were intended as a Mimamsa, embodying the principles of interpretation to be applied to the Upanishads[97] బాదరాయణుని వేదాంతసూత్రములు ఉపనిషద్వాక్యాన్వయ నియమముల సూచించు మీమాంసాశాస్త్రమై Describes the philosophico-theological views of the Upanishads[98] ఉపనిషద్గత తాత్త్విక ధార్మిక భావవివరణ రూపములై, ఉపనిషదాధారమై Upanishads which mark the culmination of the Vedic speculation and are feelingly called the Vedanta or the end of the Vedas[99] వేదముయొక్క పర్యవసాన స్వరూప చిహ్నములై,

96. Prof. Satishchandra Chatterjee An Introduction to Indian Philosophy p 7
97. V. T. Srinivasa Iyangar · Out lines of Indian Philosophy p. 75
98. Prof S Radhakrishnan Indian Philosophy Vol 2. p. 430
99. Prof Satishchandra Chatterjee : An Introduction to Indian

వేదాంతమని హృదయపూర్వకముగ వచింపబడినవని సతీశ చంద్ర ఛటర్జీచే తెలుపబడిన ఉపనిషత్తులనుండి జనించి యున్నది.

ఉపనిషత్తుల కట్టి యవసర మేల యేర్పడె నన్నచో The Upanishads do not contain any ready made consistent system of thought. At first sight they seem to be full of contradictions. Hence arose the necessity of systematizing the thought of the Upanishads [100] ఉపనిషత్తులు ప్రస్ఫుట సయుక్తిక సిద్ధాంతమును గలిగియుండ లేదు. పరస్పర విరుద్ధముగ బ్రథమదృష్టి కవి గోచరించును. అందుచే నుపనిషద్భావముల క్రమ మొనర్ప నవసర మేర్పడి నదని వీరేశ్వరానందుల సమాధానము. అందుచే It is clear that Badarayana endevoured to introduce order into and to reduce their various guesses to something like a system [101] నుపనిషత్తులగల వివిధ భావజాలములలో నొక సిద్ధాంతరూపమును ప్రవేశ మొనరింప బాదరాయణా చార్యులు యత్నించినట్లు స్పష్టమని మాక్సుముల్లరు స్పష్ట పరచెను. ఆయుపనిషత్కాలముననే The six orthodox systems of thought developed side by side at different intellectual centres even during the Upanishadic period[102] షడ్దర్శనములన్నియు ప్రక్క ప్రక్కనే వివిధ కేంద్రముల నభి వృద్ధిగాంచుచు నుండెను. కాని పూర్వోక్తరీతి నుపనిషత్తుల యందున్న విషయముల నన్నింటిని విచారించి సప్రమాణ

100. Swami Veereswarananda Brahma Sutras p. 6
101 Prof. F Max Muller The Six Systems of Indian Philosophy p 198

కార్యకారణాది రూపహేతువులను నిరూపించి, సంపూర్ణ సిద్ధాంతమిందు నిర్మింపబడియుండుటచే యుపనిషత్తుల రహస్యముల నెరుంగుటకై వేదాంతసూత్రములు మాత్రమే అత్యావశ్యకము లగుచున్నవి.

---

## మతము - తత్త్వశాస్త్రము

మరియును, Religions have helped greatly in the development of humanity. But with all the good they have done, they have also tried to imprison truth in set of forms and dogmas and encouraged cerimonials and practices which soon lose all their original meaning and became mere routine [104] మానవ పురోభివృద్ధికి మతములు ఎక్కువగనే సహకరించినవి. కాని మేలుతోసహా, అవి ఆచారవిశ్వాసములలో సత్యమును బంధింప యత్నించి, ఆయాచార కర్మకాండలను ప్రోత్సహించినవి. కాలక్రమమున నాకర్మలు స్వాభావికార్థముల గోల్పోయి కేవలము అర్థరహితములుగ పరిణమించియున్నవని నెహ్రూ పండితుడన్నటుల, వైదికమగు కర్మకాండయంతయు నట్లు కేవలాచారస్వరూపమును దాల్చ, Reasoning is necessary for the understanding of the teaching, for removing doubts and realising their cogency [104] సందేహ నివారణ గావించి వాని యౌచిత్యమును గ్రహించి అందుగల పరమా

---

103. Balagangadhara Tilak · Bhagavadgita 13. 4.

ర్థమును గ్రహింప యుక్తి యవసరమగుటచే వైదికవిషయముల నాసూక్ష్మదృష్టి బరిశీలింప Philosophy is a task which man will face in one form or other as long as he remains man[105] మానవుడు ఎంతకాలము మానవుడుగనుండునో అంతకాలము తత్త్వశాస్త్రమును అతడు ఎదుర్కొనుచుండ వలెనని కార్లే జస్పర్స్ అనునట్లు తత్త్వశాస్త్రము మానవు నెదుర్కొని ముందుకు వచ్చెను. నెహ్రూ మహాశయుడను రీతి Philosophy has avoided many of those pitfalls, and encouraged thought and enquiry[106] తత్త్వశాస్త్రము మతాచరణములగల లోపములనుండి వైదొలగించి, మానవుని యోచనాతత్త్వమును ప్రోత్సహించెను. అందుచే Vedanta is one of the most valuable products of the genius of mankind in its search for the eternal truth[107] నిత్య సత్యాన్వేషణమున మానవ ప్రజ్ఞాసౌష్ఠవమున వేదాంతము అమోఘమును అమూల్యమునైన ప్రతిఫలము అని ఆచార్య దేవసేన్ పండితుడు వక్కాణించియున్నట్లు వేదాంతము సుప్రశస్తమగుటచేతను, Philosophy tells us that, so long as we are bound by intellect, and are lost in the world of many, we shall seek in vain to get back to the simplicity of the one[108] ఎంతకాలము మనము బుద్ధికి బద్ధులమై ప్రపంచ నానాత్వమున మునిగియుందుమో అంత వరకు ప్రశాంతమగు నేకత్వమునకు తిరిగి అరుగ వృథా

105. Karl Jaspers : Way to Wisdom p. 14
106. Pandit Jawaharlal Nehru : Discovery of India p. 439
107. Prof. P Deussen : Essay on the Philosophy of the Vedanta

యత్నమని మనకు తత్త్వశాస్త్రము బోధించుచుండుటచే Among our philosophers, the Sutras of Vyasa have the greatest prominence, on account of being the consummation of all the systems of philosophy [109] మన తత్త్వ శాస్త్రములలో, వ్యాససూత్రము, సర్వసిద్ధాంత పర్యవసాన రూపమగుటచే నత్యంత ప్రాధాన్యత నొందియున్నది.

## వేదాంతము – వ్యాప్తి

ఆవిధముగ Vedanta in its different forms pervades the whole atmosphere [110] వేదాంతము తన వివిధరూపముల వాతావరణము నంతటి నావరించి, Practically forms the scripture of the Hindus, and all systems of philosophy, that are orthodox, have to take it as their foundation[111] హిందువుల ముఖ్యశాస్త్రమై యొప్పారినదగుటచే సర్వసనాతన సిద్ధాంతములును దానినే తమ పరమప్రమాణముగ స్వీకరింపవలసియుండెను అని వివేకానందుల వచనము. అట్లు అది సర్వసిద్ధాంత శాఖలకు బరమప్రమాణమగుటచే ప్రతినూత్న సిద్ధాంతముగూడ దానికి వ్యాఖ్యానము వ్రాయక ప్రసరింపదు కావున భాష్యము వ్రాయుచుండును. కావున In one or the other of its forms the Vedanta determines the world view of the Hindu thinkers of the present

109. Swami Vivekananda : The Complete Works Vol. 3 p. 396

110 Prof. S. Radhakrishnan Indian Philosophy Vol. 2 p 28

time[112] అది దాని ఏదోయొక సిద్ధాంతభాగముద్వారా ఆధునిక హైందవ తత్త్వజ్ఞుల భావలోకమును వ్యక్తపరచు చుండునని రాధాకృష్ణుని నిశ్చయము. ఇక Vedanta is clearly the native philosophy of India[113] వేదాంతము భారతవర్షమునకు స్వాభావిక తత్త్వశాస్త్రమను మాక్సు ముల్లరు వచనములయం దాశ్చర్యమేమి? అదియే భారత మున సజీవ సిద్ధాంతమనుటయు నుచితమే.[114] అంతియగాక భారతి కదే ప్రాణమన్నను సమంజసమే యగును. కాక భారత వేదాంతముల కభేదమన్నను యొప్పును.

The Vedanta reaches the greatest heights the Indian mind has ever attained[115] భారతీయచిత్తము నధి రోహించగల అత్యున్నత స్థానమును వేదాంతము పొంది యుండుటయేగాక Vedanta philosophy a system in which human speculation seems to have reached its very acme [116] మానవ యోచనావిధానమున అగ్రస్థానమునే వహించియున్నదని మాక్సుముల్లరు వచించెను. దాని పరి శీలనావిధాన మంతయు Dialectic is necessary to put intuition to the proof[117] అనుభవమును పరిశోధించి నిరూపింప తర్క మవసరమని బెర్గ్సన్ అనురీతి అనుభవ నిరూప

112. Prof S. Radhakrishnan · Indian Philosophy Vol. 2 p. 430
113. Prof. F. Max Muller : The Six Systems of Indian Philosophy p. 115
114. Prof. F. Max Muller · The Six Systems of Indian Philosophy p. xviii
115. Dr. V. V. Sovani · A Critical Study of Sankhya System p. 14
116 Prof. F. Max Muller : The Six Systems of Indian Philosophy

ణార్థమే యుపయోగించి, We all have some ear for this monistic music, it elevates and reassures[118] ఈ వేదాంత గానము మనకెల్లరకు శ్రవణానందము గలుగజేసి, ఆశ గలిగించుచు నుత్సాహమును గలిగించుచున్నదని విలియం జేమ్స్ వ్రాసియున్నాడు. అందుచేతనే If philosophy or religion is meant to be a preparation for the after life, a happy life, and happy death, I know of no better preparation for it than the Vedanta[119] మతముగాని తత్త్వశాస్త్రముగాని సుఖజీవితమునకు ఆనందకర మృత్యువునకు సంసిద్ధమగుటయే యనిన వేదాంతముకంటె నితరసంసిద్ధత నాకు తెలిసినంతవరకు కానుపించదు అని మాక్సు ముల్లరు స్తవ మొనరించియున్నాడు. అట్టిదాని నవగాహన మొనరించియున్నచో, Though we may be weak and erring mortals, living a brief and uncertain span of life, yet there is something of the stuff of the immortal God in us[120] అస్థిరమును క్షణికమును అగు జీవితమును గడుపుచు, దుర్బల దోషభూయిష్టమగు మర్త్యులమై మనమున్నను, అమృతమగు భగవంతునిబోలు తత్త్వము మనలోనున్నదను సత్యమును మనము గాంచెదము. యథార్థమున One who has been a Raja in some previous birth, can alone realise Vedanta[121] పూర్వజన్మమున ప్రభువు అయిన

118. Dr. William James : Pragmatism p. 153
119. Swami Rama Tirtha : The Complete Works Vol. 7 p. 115
120. Pandit Jawaharlal Nehru : Discovery of India p. 484
121. Swami Rama Virtha . The Complete Works Vol. 8 p. 244

వాడే యీజన్మమున వేదాంతమును అనుభవించుననని రామ తీర్థస్వామియు వేదాంతమును అర్చించి నమస్కరించి యున్నాడు.

---

## సూత్రపూర్వము

ఇట్టి మహోన్నతమును సర్వోత్కృష్టమును అగు వేదాంత శాస్త్రము బాదరాయణ సూత్రములతోడనే ప్రారంభము కాదనియు దానికి ఉపనిషత్తులు ఆధారముల నియు పూర్వము గ్రహించియుంటిమి. యథార్థమున The individual philosophy is but a mouth piece of tradition, and that tradition goes back further and further, the more we try to fix it chronologically [122] తత్త్వ వేత్తయగువాడు పరంపరాగత సంప్రదాయమునకు వక్త యగును. ఆ సంప్రదాయమో, మనము దాని కాలనిర్ణ యము సేయ యత్నించు కొలది వెనుకకు వెడలుచుండును, అని మాక్సుముల్లరు చెప్పురీతిగను, In the history of thought there is nothing altogether new. No system of thought issues forth in all its fulness from the head of any one man. There must have existed philosophical ideas and doctrines affording the necessary material for the founder to work upon [123] విజ్ఞానచారిత్రమున నూత్న త్వము ఎద్దియును లేదు. ఒక మానవునినుండియే సిద్ధాం

---

122. Prof. F. Max Muller: The Six Systems of Indian Philosophy p.187
123. Prof. S. Radhakrishnan: Indian Philosophy Vol. 2. p. 240

తము పూర్తిగా బహిర్గతము కానేరదు. సిద్ధాంతకర్త కవసర భావపదార్థము లుండి యుండవలయునని రాధాకృష్ణుడును వచించురీతి, అవి ఒక తాత్త్వికుని కర్తృకములుగాక, అనేక తరములకు జెందిన జ్ఞానపరంపరకు జెందినవిగా నుండును. అనగా నవి యథార్థమున అతిదీర్ఘమగు తత్త్వనాహితీ పరిణామముయొక్క పర్యవసానమై యుండును.[124] తత్త్వజ్ఞాన సంశోభితమగు నాటి వాతావరణమును ఆఘ్రాణించి తదనుగుణ క్షేత్రమునుండి తత్త్వవేత్త పరిణమించుననియు ననవగును. అందుచే షడ్దర్శనశాస్త్ర సూత్రములెల్ల రచనమునకు బూర్వమే భారతభూములగల ఋష్యాశ్రమస్థానముల ననేక శతాబ్దములుగ పఠింపబడుచు, అనుష్ఠింపబడుచు నున్న తాత్త్వికభావ స్రోతయే ఆయాదర్శనాచార్యుల ముఖతః నొక స్వరూపమును దాల్చినట్లని గ్రాహ్యము. ప్రపంచమునుగూర్చి గగనమున విహరించుచున్న భావసముదాయమును సామాన్య సిద్ధాంతములుగ యుక్తిగ నాచరించు యత్నములే దర్శనములనియు మాధవాచార్యులు వచించి యున్నారు. సూత్రములలో నితర తత్త్వవిదుల ప్రస్తావన లుండుటయు వారు సూత్రరచనకాలమునకుగాని పూర్వముగాని యుండియున్న తాత్త్వికులనియు విదితమగుచున్నది. అట్టి జ్ఞానుల భావజాలముల గైకొని ఖండనమండనరూప మీమాంస సాగించి తమతమ సిద్ధాంతములకు ప్రత్యేక స్వరూపమును దర్శనాచార్యులొసంగియుండుట ప్రస్ఫుటము.

---

124. Dr. A. A. Macdonell : India's Past

మున 'బ్రాహ్మేణ జైమిని రుపన్యాసాదిభ్యః' (4.4 5–7) మొదలగు సూత్రములవలన మనకు ద్యోతక మగుచున్నది. అందుచే బాదరాయణసూత్రముల పూర్వముగూడ గొన్ని వేదాంతసూత్ర గ్రంథము లున్నట్లును, వానినుండి భేదించియు నభిమానించియు బాదరాయణుడు మరొకటి లిఖింప నది యన్నిటికంటె భిన్నమై ఉపనిషత్తాత్పర్య గ్రహణమున నుపయుక్తమగుటచే, నితరములన్నియు ననుపయుక్తములై యదృశ్యములు కాగా మనకు నిదిమాత్రము సంపూర్ణముగ శేషించియుండి అఖిల ప్రపంచ తత్త్వశాస్త్ర పరిణామమున కాధారమై యొప్పారి శాఖోపశాఖల ప్రపంచము నావరించి యున్నదనియు గ్రాహ్యము.



## సాంఖ్యకాలము – వేదాంతకాలము

షడ్దర్శనములలో మాత్రముగాక అసలు తత్త్వ మీమాంసా క్రమమునకూడ అత్యంత సుప్రశస్తి గనిన సాంఖ్య వేదాంతములలో నేది ప్రాచీన మను సంశయము గూడ గలుగును. కపిల, బాదరాయణులలో నెవరు ప్రాచీనులను విషయము ఎట్లున్నను, సిద్ధాంతములు రెండును సమకాలీనములనియే భావింపదగును. నాటి భారతావని గల తత్త్వజ్ఞులెల్లరు కాపిల వేదాంతములలో నొకదాని నభిమానించుచు అనుసరించుచు, ప్రబోధించుట వఁ కము.

కాని కాపిలులుగా ప్రశస్తిగన్న ఆసురి, ఆసుర్యాయణ, అసిత దేవళ, నారద, సనక సనందాది తత్త్వవిదులుగూడ పురాణ గ్రంథములలో ప్రఖ్యాత గురువులై గానుపించుటయేగాక, కొందరు ఉపనిషత్తుల గూడ ఆచార్యస్థానము నలంకరించి యుండిరి. వారిలో గొందరు వైదిక విద్యలందును ఆచార్యులై యుండి గురు పరంపరల నధిష్టించి వేదాంత దర్శన కర్తయగు పారాశర్యుని పితృవ్యులకే గురువులై యుండుటయు గాంచనగును. వేదాంత గ్రంథమై ప్రస్థాన త్రయమున స్థానము గడించియున్న భగవద్గీతా శాస్త్రముగూడ 'దేవర్షీణాం చ నారదః। సిద్ధానాం కపిలో మునిః' (10.26) 'మునీనా మప్యహం వ్యాసః' (10.37) కపిల వ్యాసుల సమాన ప్రతిపత్తినే చూచుచున్నది గాని అందు కపిల దూషణము గానబడదు. అంతియగాక, అసిత దేవళాది ధర్మవేత్తలచే సాంఖ్య మంగీకరింపబడినదని చెప్పుచు అసిత దేవళాదుల సాంఖ్యాచార్యులుగా సూత్రము నిరూపించి ఖండించుచుండ (వే. సూ. 1.4.28) గీతాశాస్త్రము 'అసితో దేవలో వ్యాస స్స్వయం చైవ బ్రవీషి మే' (10.13) శ్లోకార్థము ననుసరించి, ఆ అసితాదులకు వ్యాసునితో సమాన స్థానము నొసంగి పరమాత్మ నిర్వచనమున నాచార్యులుగా నొనరించుచున్నది. అందుచే నొక కాలమున సాంఖ్య వేదాంత విభేదములు లేవనియే తలంపనగును. కాలాంతరమున, ముఖ్యముగ దర్శన స్వరూప నిర్మాణ కాలమునకు అవి భిన్నములుగా రూపొంది యుండునని భావింపనగును.

కాన, నుపనిషత్తులగూడ నీ రెండును ననేక విధముల బ్రస్తావింపబడుచు నుండుటయు విదితము. 'సాంఖ్య యోగాధిగమ్యం' (శ్వేతా. 6.13) 'కపిలం య స్తమగ్రే' (శ్వేతా. 5.2) అనునట్లు శ్వేతాశ్వతర ముండకాదిక శ్రుతులలో సాంఖ్యము నామతః చర్చింపబడియుండ, వేదాంతముగూడ 'వేదాంతే పరమం గుహ్యం' (శ్వేతా. 6.22) 'వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః' (ముండక 3.2.6) అని యుపనిషత్తుల స్మరింపబడుటయే గాక, సాంఖ్య వేదాంత భావములు అన్యోన్యముగ నభేదముగ వివరింపబడియుండుటయు స్పష్టము. కాన నీ రెండు దర్శనములు అభిన్నస్థితి నుపనిషత్తుల పరిణమించి తర్వాత భిన్నమర్యాదను గాంచి యున్నవనుట సమంజసము.

---

## బ్రహ్మసూత్రము

అట్లు అవిస్పష్టరూప వేదాంతభావముల సుస్పష్టరూపమొందించు భారము అతి కరుణామయుడును, జ్ఞానశక్తియు 'కురుక్షేత్రే సమాసీనం వ్యాసం మతిమతాం వరం। ... మహాభారతకర్తారం సర్వశాస్త్ర విశారదం॥ పురాణాగమ వక్తారం వేద వేదాంగ పారగం' (26.6) అని బ్రహ్మ పురాణముచేతను, 'వేదవ్యాసం తపోసిధిం' (1 1) అని వ్యాస స్మృతిచేతను స్తవమొనర్చబడిన బాదరాయణ వ్యాసు

నిష్టై బడెను. ఉపనిషత్తులలో మహార్షు లుపయోగించి యున్న పదములను సాంకేతికములను ఎట్లు అన్వయింప వలెనో, ఉపాసనాదుల నెట్లు అభ్యసింపవలెనో బాదరాయ ణాచార్యులు బోధింప సంకల్పించెను. His idea in writing the Sutras was just to bring together and with one thread to make a garland of the flowers of Vedantic texts.[127] వేదాంత వాక్యముల నొక దారమున జేర్చి ఒక పువ్వు హారముగ తన సూత్రములద్వార నొనరింప బాదరాయణుని సంకల్పముగా వివేకానందుని వర్ణనము. బాదరాయణ వ్యాసులు తన సిద్ధాంత ప్రతిపాదనమున నే గ్రంథనామముల బేర్కొనక శ్రుతుల జూపించుచు, నితర గ్రంథములను స్మృతి యని మాత్రము వక్కాణించి యున్నాడు. స్మృతి యన బాదరాయణుని భావమున భారతాంతర్గత భగవద్గీత యనియు, మనుస్మృతి యనియు శంకరు లన్వయించిరి. దానినే యితర భాష్య కారులును స్వీకరించిరి. కాని యథార్థమున బాదరాయ ణుని అభిప్రాయ మెద్దియో! భాష్యకారులు సూచించు స్మృతివాక్యములా యా సూత్రముల నన్వయించుటచే భాష్యకారుల భావమే సరియై యుండనోపును. మరియు శ్రుతి యన్నను, బాదరాయణుడు బాహుళ్యముగ నష్టోత్తర శతోపనిషత్తుల స్వీకరించి యున్నట్లు కానుపింపదు. బృహ దారణ్యక, ఛాందోగ్య, కఠ, కౌషీతకి, ఐతరేయ,

127 Swami Vivekananda : The Complete Works Vol.

తైత్తిరీయ, ముండక, ప్రశ్న, శ్వేతాశ్వతర, జాబాలోపనిషత్తులని బాదరాయణుని యర్థమని శంకరులు వచించి, తమ భాష్యములో నా శ్రుతివాక్యములనే యన్వయించి యుండిరి. కావున, వేదాంతసూత్ర రచనములో This must suffice to indicate the intellectual sphere in which Badarayana moved[128] బాదరాయణాచార్యుడు ఎంతటి వైజ్ఞానిక వాతావరణమున మెలగియుండెనో ద్యోతక మగుచున్నదని మాక్సుముల్లరు తెలుపుచున్నాడు.

## సాంఖ్యము – వేదాంతము

కపిలుని నామమును తెలుపకున్నను బాదరాయణుడు Evidently directed itself strongly against the Sankhya system and the atomism of the Vaiseshikas[129] సాంఖ్యమును, పరమాణువాదులగు వైశేషికులను నిశితముగ ఖండించినట్లు సువిదితము. ఈక్షత్యధికరణమున 'ఈక్షతే ర్నా శబ్దం' (వే. సూ. 1.1.5) నుండి 'శ్రుతత్వాచ్చ' (వే. సూ. 1.1.11) వరకును, ఆనుమానాధికరణమున 'అనుమానికమ ప్యేకేషాం...' (వే. సూ. 1.4.1) నుండి 'మహద్వచ్చ' (వే. సూ. 1.4.7) వరకును, చమసాధికరణమున 'చమసవ దవిశేషాత్' (వే. సూ. 1.4.8) నుండి

128. Prof. F. Max Muller : The Six Systems of Indian Philosophy p 113
129. Dr. A. B. Keith : A History of Sanskrit Literature p. 470

'కల్పనోపదేశాచ్చ...' (వే. సూ 1.4,10) వరకును, సంఖ్యోపసంగ్రహణాధికరణమున 'నసంఖ్యోపసంగ్రహాదపి...' (వే. సూ. 1.4.11) నుండి 'జ్యోతిషైకేషా మసత్యన్నే' (వే. సూ. 1.4 13) వరకును, రెండవ అధ్యాయమున స్మృత్యధికరణమున 'స్మృత్యనవకాశదోషప్రసంగ...' (వే. సూ. 2.1 1) నుండి 'ఇతరేషాం చానుపలబ్ధేః' (వే. సూ. 2.1.2) వరకును అటుత నవిలక్షణత్వాధికరణము (వే. సూ. 2.1.4-11) శిష్టపరిగ్రహాధికరణము (వే. సూ. 2 1. 12) లలోను, పిమ్మట రచనానుపపత్త్యధికరణమున (2.2. 1-10) సాంఖ్యవాదము నిరసింపబడియున్నది పూర్వోక్త విధమున సాంఖ్యవాదము సప్రశస్తమై, కపిలుడు ఉపనిషత్తులగూడ ప్రఖ్యాతుడై యుండుటయు, నాటి వాతావరణ మంతయు సాంఖ్యవాదమయమై సుప్రసిద్ధ ఋషిపుంగవులును, రాజేంద్రులును దాని విశ్వసించి, ఆశ్రమవాసములును ఆస్థానములును సాంఖ్యముచే నిండియుండెను. వేదాంతమువోలె నదియు సృష్టిరహస్యమును ప్రతిపాదించుచు, తగు న్యాయము ననుసరించుచు నుండుటచే దాని వ్యతిరేకించుట బాదరాయణునకు ప్రథమకర్తవ్యమై యుండెను. సాంఖ్యము, వేదాంతమువలె, సృష్టిచింతన గావించి, భోక్తయగు పురుష ప్రతిపాదనము గావించి సృష్టి కుపాదానము గు ప్రధానమును నెలకొల్పెను. అందు ఈశ్వరునకు స్థానమున్నట్లు గానుపింపకపోవుటచే సృష్టికారణము జడమైన ప్రధానము కానేరదని నిరూపించి చూపుటకు బాద

రాయణుడు గ్రంథమున శ్రమించియుండెను. అట్లే సృష్టి కారణము పారిమాండల్య రూపమునను్న పరమాణు సముదాయమును వైశేషికులు బాదరాయణు దృష్టికి ద్వితీయ స్థానము నలంకరించిరి. అచేతనములగు పరమాణు సముదాయముగాని జడరూపమగు కర్మయనగా అదృష్టము గాని సృష్టికారణము కానేరదని వైశేషికము వ్యాసునిచే ఖండింపబడెను. ఇక యోగమున కొక సూత్రమును (వే. సూ. 2.1.3) మాత్ర ముపయోగించి ద్వైపాయనుడు ఖండించి యుండెను. యథార్థమున యోగ న్యాయ ములకు ప్రత్యేక తాత్త్వికదృష్టి లేక యోగము సాంఖ్య మును, న్యాయము వైశేషికము నాశ్రయించెను. కాన వాని మూలస్థానములు నిరసింపబడినచో నవియు నిరాస మొందినట్లే యగును. కాని యోగము సాంఖ్యముతో గలిసియున్నను, యుపనిషత్తుల 'సాంఖ్య యోగాధిగమ్యం' మొదలగు స్థానముల సంస్మరింపబడియుండుటచే నచ్చ టచ్చట 'ప్రకాశక్రియాస్థితిశీలం భూతేంద్రియాత్మకం భోగాపవర్గార్థం దృశ్యం' (యో. సూ. 2.18) 'విశేషా విశేషలింగమాత్రాలింగాని గుణపర్వాణి' (యో. సూ. 2.19) మొదలగు సూత్రముల సాంఖ్య భావములనేగాక పరిభాషనుగూడ యోగము అనువదించియుండుటచే దానిని ప్రత్యేకముగ వేదవ్యాసుడు ఖండించియుండెను. వైశేషిక మునకు విలక్షణముగ న్యాయము సూత్రప్రతిపాదన మేమియు సేయకుండుటచే, మరియు నది ప్రత్యేక తత్త్వశాస్త్రముగ

స్థానము గడింపకుండుటచే న్యాయ ప్రసంగమునే బాదరాయణుడు గైకొనలేదు. అంతియగాక పరసిద్ధాంత ఖండనమున, సూత్రకారుడు న్యాయవిధానమునే యవలంబించియుండుటచే దాని ఖండింపవలసిన యవసరము గానుపింపదయ్యెను. ఇక మీమాంసాదర్శన మన్నచో నది తత్త్వశాస్త్రము కాకుండుటచే దాని ప్రశంసయే నెందును గానరాదు. కర్మ జ్ఞాన వివక్షణమున గర్మను నిరసించి జ్ఞానమునే బాదరాయణుడు మన్నించును. అనగ కర్మకైవల్య ప్రాప్తికి మార్గమేగాని, స్పష్టవిషయ ప్రతిపాదనము గాని జీవబ్రహ్మైక్యవచనముగాని, సాంఖ్య వైశేషిక వేదాంతములవలె గావించియుండలేదు. అందుచే నట తాత్త్వికముగ స్వీకరింపబడి ఖండింపబడ దయ్యెను. ఈ దృష్టిని బాదరాయణున కన్వయించిచూచు వో We gather that in Badarayana's time, the Vaiseshika system was not in great repute[130] బాదరాయణుని కాలమున వైశేషికము అధిక ప్రఖ్యాతముగ లేదనుటగాని, Vyasa does not care even to review the Nyaya in the Brahma Sutra seeing that it does not been recognized by any worthy sage[131] శిష్టగ్రహణము లేకుండుటచే బ్రహ్మసూత్రముల న్యాయశాస్త్రమును వ్యాసు డనువదింపలేదనుటయు సముచితము కానేరదు. యథార్థమును న్యాయ విమర్శా విధానమునే యెల్ల సిద్ధాంతులును స్వీకరించియుండుట స్పష్టము. కపిల

130. Prof S. Radhakrishnan : Indian Philosophy Vol. 2. p 431
131. M, M. Satishchandra Vidyabhushana ; The Sutras of Gotama

ఖండనమును జూచికూడ చింతించి If according to Vyasa, even the great Muni Kapila, the greatest among the perfected souls, is himself deeply involved in error, then who would say that Vyasa may not be so involved in a greater measure? Did Kapila fail to understand the Vedas?[132] వ్యాసుని అభిప్రాయము ననుసరించి సిద్ధుల నగ్రగణ్యుడైన కపిల మునివర్యుడే గాఢ దోషయుతుడై యున్నచో వ్యాసుడుకూడ నంతకంటె నధిక దోషముల నుండ లేదని ఎవరనగలరు? కపిలుడు వేదముల గ్రహింపజాల కుండెనా? అని వివేకానందుడు ప్రశ్నించియున్నాడు. వివరములులేని ఆదర్శనముల నాధారముగ గైకొని నిశ్చితాభిప్రాయమున కరుదెంచి, నిందించుటుత్తమముగాదని గ్రాహ్యము.

---

## వేదాంతము–ఇతర వాదములు

అదేవిధమున వ్యాసభగవానుడు వేదాంతసూత్రముల బౌద్ధ, లోకాయత, భాగవత సిద్ధాంతముల ఖండించినట్లు (2 2.18–36, 3.3.53–54) విదితమగుచున్నది. అందు సముదాయాధికరణమున (2.2.18–27) మరియు ఉపలబ్ధ్యధికరణమున (2.2.28–32) బౌద్ధవాదములు ఖండింపబడియున్నవి. అటులే ఏకస్మిన్నసంభవాధికరణమున (2.2.33–36) అర్హత

132. Swami Vivekananda : The Complete Works Vol. 6. 181

మతము నాబడు జైనమతమును, పత్యురసామంజస్యాధికరణమున (2.2.37–41) శైవము, ఉత్పత్త్యధికరణమున (2.2.42–45) భాగవతమున జతుర్వ్యూహవాదముగూడ ఖండింపబడియున్నవి. మరల, శరీరేభావాధికరణమున (3.3.53–54) లోకాయతవాదముగూడ నిరసింపబడియున్నది.

కాని In this connection we must not forget that the author of the Sutras does not refer to any founder of the different schools by name. He even does not use the technical terms of the different schools as they are known to us today[133] సూత్రకారుడు వివిధ మతప్రవక్తల నామముల ప్రస్తావించలేదు. మరియు, ప్రస్తుతము మనకు గల నాయాశాస్త్ర పారిభాషిక పదములనైన వ్యాసు లుపయోగింపకుండు విషయమును మనమీ సందర్భమున మరువరాదని వీరేశ్వరానందులు హెచ్చరిక సేయుచు, బాదరాయణుడు దీని ప్రస్తావించి ఖండించుటచే నతడు ప్రస్తుతమున్న బౌద్ధమతముల తర్వాతవాడు గాక, బాదరాయణునికి బూర్వమే యీ వాదములు మరొక రూపమున గలవని గ్రాహ్యమనియు నాతని నిశ్చయము. గౌతమ మహావీరులు బౌద్ధ జైనమత సంస్థాపకులుగాక, ప్రాపకులుగా పరిగణించుటుచితము. అంతియగాక they might not have existed in the form in which they have been refuted by

133 Swami Veereswarananda : Brahma Sutras p. 8

Sankara[133] నా సిద్ధాంతములు శంకరులచే ఖండింపబడిన రూపమున గూడ నుండియుండక పోవచ్చును.

ఇంత సమగ్రదృష్టి బరిశీలించిన If we turn to the philosophy elaborated by Badarayana, we find no longer rhapsodies but a carefully reasoned system[134] బాదరాయణప్రోక్త సిద్ధాంతము అసందర్భ వచనములుగాక, అతి జాగ్రత్తగా విమర్శింపబడియున్న సిద్ధాంతముగ గ్రహించెదమని మాక్సుముల్లరు వచించెను. అనగా వ్యాస వేదాంతము పూర్వదర్శనములకంటె నెక్కువ వేదములపై నాధారపడియుండి, పూర్వదర్శనముల వేదాంతముతో సమన్వయమొనరించుటచే వేదాంత మనబడినదని వివేకానందుడు వచించెను. The Vedanta as the logical outcome of the Sankhya pushes its conclusions yet further. While its cosmology agrees with that taught by Kapila, the Vedanta is not satisfied to end, indualism but continue its search for the final unity [136] సాంఖ్యజనితమువలె వేదాంతము, సాంఖ్యతీర్మానముల నింక నభివృద్ధి పరచెను. కపిలబోధిత సృష్టిక్రమమును స్వీకరించి, ద్వైతమున ముగించుటకు తృప్తి గాంచక వేదాంతము, ఏకైకతత్వ గమ్యముకొరకై యన్వేషణము సాగించెను అని వివేకానందుడు వివరించెను. ఆ కారణమున, పూర్వదర్శనము లెట్టి మతముల స్థాపింపనేరజాలని వగుచుండ, వేదాంతము సుస్థిర మతస్థాపనము గావించి,

133. Swami Vivekananda Brahma Sutras P 8
134. Prof. F. Max Muller : The Six Systems of Indian Philosophy p 144
135. Swami Vivekananda . The Complete Works Vol. 2. p 357
136. Swami Vivekananda : The Complete Works Vol. 3 p. 5

The one sect that really covers India is that the later Mimamsakas or the Vedanta [137] వేదాంత మనబడు ఉత్తరమీమాంసయే భారతావనినంతటి నావరించియున్న ఒకే యొక్క మతము అని వివేకానందులు వక్కాణించిరి.

## వేదాంత మతాచార్యులు

అట్టి సుస్పష్ట సిద్ధాంత ప్రతిపాదన మొనరించు బాదరాయణ వేదాంతదర్శనము పూర్వోక్తచందము తదర్థ గ్రహణమునకు భాష్యముల నపేక్షించెను. ఆభాష్యకర్తలు తమ రచనముల సూత్రసహాయమున తమతమ సిద్ధాంతముల ప్రతిపాదించి, వివరించి, విస్తీర్ణ మొనరించి, వేదాంత శాస్త్రమును బహుశాఖాలంకృతముగ నొనరించి, సర్వతోముఖ మొనరించియున్నారు. అందు చేతనే వేదాంతము సర్వాకర్షణీయమై సర్వానుష్ఠానయోగ్య మహోన్నతమార్గముగ పరిణమించి సర్వవ్యాప్తిచెంది యలరారి యున్నది. కాని The wonderful dialectical skill of the Acharyas have in the case of the Vedanta Sutras made it all but impossible for an unsectarian investigator to find out exactly the opinions of Badarayana on any point [138] భాష్యాచార్యుల అద్భుత తర్కకౌశలము వేదాంతవిషయమున, నిష్పాక్షిక బరిశీలకుడు ఎవ్విషయమునవైన బాదరాయణుని భావముల సరిగా గ్రహింప దుర్లభముగా నొనరించెను అని శ్రీనివాస అయ్యంగారి అభిప్రాయము. ఆసూత్రగ్రంథము ఒకకాలమున ఆకర్షణీయ భక్తిసిద్ధాంతముగను, మరొక

---

137. Swami Vivekananda : The Complete Works Vol. 2. p. 239

138 V. T. Srinivasa Iyangar : Out lines of Indian Philosophy p. 76

కాలమున అద్భుతాద్వైత వాదముగను రూపొందుచుండ, వివిధ మతములు వివిధ సంప్రదాయములు సుస్థిరములై యుండ వానిని శంకర రామానుజాది యాచార్యులు స్వీకరించి లేఖనారూపమున ప్రకటపరచిరి. ఆవిధముగ Methodical doubt gives rise to a critical examination of all knowledge and without radical doubt there can be no true philosophical thought [139] క్రమయుత సందేహము సర్వజ్ఞానముల సవిమర్శాపరిశీలన కవకాశ మొసంగును. అట్టి సయుక్తిక సంశయము అభావమైయున్నచో యధార్థమైన తాత్త్విక విజ్ఞానమే లేకుండునని కార్ల్ జస్పర్స్ వాకొనువిధముగ భావుకర్తల ధర్మసందేహములు వేదాంతశాస్త్ర విజృంభణమునకే తోడ్పడెనుగాని దాని నణగద్రొక్క దయ్యెను.

---

## శంకరుడు–రామానుజుడు

Sankara and Ramanuja are the two great thinkers of the Vedanta, and the best qualities of each were the defects of the other [140] వేదాంతతత్త్వజ్ఞులందరిలో శంకర రామానుజులు సుప్రసిద్ధులు. వారిలో నొకరి యుత్కృష్ట గుణములు ఒకరికి లోపములుగ నున్నవి. ఎట్లన, Sankara's apparently arid logic made his system unattractive religiously; Ramanuja's beautiful stories of the

139. Karl Jaspers : Way of Wisdom p. 16
140. Prof. S. Radhakrishnan : Indian Philosophy Vol. 1 p. 720

other world, while he narrates with the confidence of one who has personally assisted at the time of the origination of the world, carry no conviction [140] బాహ్యమునకు శుష్కముగనున్న శంకరుని తర్కము అనుష్ఠానమున కాకర్షణీయత్వమును తన సిద్ధాంతమునకు లేకుండ జేసినది. ప్రపంచ సృష్టికాలమున తానుండి స్వయముగ దోడ్పడినట్లు విశ్వాసమున రామానుజుడు కల్పించు గాథలు మొదలైన సుందరకథలు, ఆతని సిద్ధాంతమున యాథార్థ్యతను గోల్పోయెనని రాధాకృష్ణపండితుని వాదము. కాని In the method of proceedure Sankara shows great originality and freshness [141] చర్చావిధానమున శంకరులు అసాధారణ సహజత్వమును, వికాసమును ప్రదర్శించుననియు రాధాకృష్ణుడు వచించెను.



## శంకరుడు

తత్త్వవిచారణమున Sankara is remarkadly ingenious in his key to the Upanishads, the finding of a higher and a lower knowledge, which similarly allows him to conform to the whole apparatus of the Hindu belief on the lower plane while on the higher he finds no true reality in anything[142] పరాపరజ్ఞానవిధాన రహస్య

140 Prof. S. Radhakrishnan : Indian Philosophy Vol. 1 p. 720
141. Prof. S. Radhakrishnan : Indian Philosophy Vol. 2. p. 534
142. Dr. A. B. Keith A History of Sanskrit Literature p. 477

మును ఉపనిషత్తుల గనిపెట్టిన శంకరాచార్యులు ప్రస్ఫుటముగ నద్భుతము. భారతీయ విశ్వాసముల నన్నింటిని అపరముగను, పరముస సర్వవస్తు చయమునందు అసత్యత్వము నాతడు గాంచునట్లు అది యొనరించెను అని ఎ. బి. కీత్ స్పష్టపరచెను. కాని His dialectical skill is very great, and though he doubtless misrepresents Badarayana, he does more justice to the Upanishads.[142] శంకరుని తార్కిక కౌశలము అత్యద్భుతము. అతడు బాదరాయణుని నిస్సందేహముగ అపార్థము చేసియున్నను ఉపనిషత్తులకు న్యాయ మొనరించెనని కీత్ పండితుడు సందేహించెను. ఈ వాక్యము పరస్పర విరుద్ధముగ నున్నది. బాదరాయణు డైనను ఉపనిషదర్థముల స్పష్టపరుప నుద్యుక్తుడై దర్శన నిర్మాణమునకు పూనుకొన, నా ఉపనిషత్తుల అర్థమును శంకరులు సక్రమముగ గ్రహించినచో బాదరాయణ భావములగూడ సక్రమ విధానమున గ్రహించినట్లగుచున్నది. అందుచేతనే గా పండితుడుగూడ The greatest expositor of the philosophy of the Upanishads is Sankara or Sankaracharya. The teachings of Sankara himself is the natural and legitimate interpretation of the philosophy of the Upanishads.[143] ఉపనిష త్తత్వమునకు సర్వోత్తమ వ్యాఖ్యాత శంకరాచార్యులు. ఉపనిషత్తుల తత్త్వమునకు శంకరువాదమే స్వాభావికమైన న్యాయమైన వ్యాఖ్యానమని వక్కాణించుచున్నాడు. There is

142. Dr. A. B. Keith, A History of Sanskrit Literature p 477

likelyhood that his [Sankara] exposition agree in all essentials with the meaning of the Brahma Sutra.[144] శంకరు వ్యాఖ్యానమే అఖిల ముఖ్య విషయములలో బ్రహ్మసూత్రార్థముల ననుసరించునని మాక్డొనెల్ వచించియున్నాడు.

ఇట్లు శంకరభాష్య విషయమున నది బ్రహ్మసూత్ర తాత్పర్యము నుచితరీతి ననువదించెనా లేదా యను సందేహము కొందరికి కలుగునుగాని ఉపనిషదర్థ ప్రతిపాదనమున శంకరు సిద్ధాంతమునే క్రమమును సహజముగా పండితులు స్వీకరించుచుండుట విదితము. అట్లగుచో సూత్ర భాష్యము గూడ నుపనిషత్తుల ననుసరించి యుండుననుట కెట్టి సంది యము లేకుండుటచే నదియు సక్రమమని గ్రాహ్యము. అంతియగాక శ్రీ శంకర ప్రోక్తమగు అద్వైత వాదము the fairest flower of philosophy and religion, that any country in any age has produced, where human thought attains its highest expressions, and even goes beyond the mystery which seems to be inpenetrable.[145] ఏ దేశము ఏ కాలమున నింతవరకు సృజింపనట్టి సుందరాధ్యాత్మికపుష్పరాజము. అచ్చటనే మానవయోచనాశక్తి అత్యున్నతస్వరూపముదాల్చి, అభేద్యమైన రహస్యమునుగూడ దాటి అరిగియున్నది అని వివేకానందులు వచించియున్నారు. అట్టి జీవబ్రహ్మైక్యము నుపదేశించు శంకరసిద్ధాంతము శాంతికాకరమై An Absolute one, and in that one

144. Dr. A. A. Macdonell : History of Sanskrit Literature p.385
145. Swami Vivekananda , The Complete Works Vol. 2. p. 247

surely we have a religion, which emotionally considered, has a high pragmatic value, it imparts a perfect sumptuousity of security [146] అఖండబ్రహ్మము, నేను అదియే అను భావముగల మతము హృదయయుక్తముగ యోచించినచో, అమూల్యమై అది సంపూర్తి సంతుష్టరక్షణము నొసంగునను విలియం జేమ్సు మొదలగు పండితవర్గమునకు ప్రశాంతి ప్రసాదించియున్నది. అందుచేతనే with all its defects and excellance, it stands in the history of human thought as the most consistent system of monism [147] శంకరవాదము దాని గుణాగుణము లెట్లున్నను, మానవవిజ్ఞానచారిత్రమున సర్వోత్తమ సముచిత సిద్ధాంతమై యొప్పారినదని సతీశచంద్ర ఛటర్జీ సంతోషించి యున్నాడు.

---

## ఆశ్మరథ్యుడు

బాదరాయణాచార్యునికి పూర్వముండు సూత్రములలో నుదాహరింపబడియున్న ఆశ్మరథ్యాది ఆచార్యులలో నొకొక్క భాష్యకర్త యొకొక్కని భావమును స్వీకరించెనని పూర్వము వచించియుంటిమి. ప్రథమాధ్యాయ చతుర్థపాదమున, 'వాక్యాన్వయాత్' (వే. సూ. 1.1.19) అను సూత్రమున 'ఆత్మా వా అరే ద్రష్టవ్యః, శ్రోతవ్యో

146. Dr. William James Pragmatism p. 153

147. Prof Satishchandra Chatterjee · An Introduction to Indian Philosophy p. 460

మంతవ్యో నిదిధ్యాసితవ్యః' (బృ. 2.4.5) ఆత్మ అనుభవ వేద్యమైనది, దానిని శ్రవణ మనన నిదిధ్యాసనముల గావింప వలెనను వాక్యము నుదాహరించి, యాజ్ఞవల్క్యమహర్షి మైత్రేయికి ఆత్మతత్త్వోపదేశము గావించి, ఆవాక్యాంత మున 'ఆత్మనో వా అరే దర్శనేన శ్రవణేన మత్యా విజ్ఞానే నేదం సర్వం విదితం' అని సమాప్తి జేసెను. అందు విజ్ఞాన రూపుడగువాడు ద్రష్టవ్యాదికమునకు గమ్యమా లేక బ్రహ్మమా యను సంశయము గలుగును. అందుచే సిద్ధాం తముగ శ్రోతవ్యమైనవాడు పరమాత్మయే యని దీర్మానింప తద్విషయమున ఆచార్యుల భేదభావము లుత్పన్నమైనవి. అందు 'ప్రతిజ్ఞాసిద్ధేర్లింగమాశ్మరథ్యః' (వే. సూ. 1.4.20) జీవునకును బ్రహ్మమునకును భేద మభేదము గలదు గావున నిట నభేదాంశముచే జీవోపక్రమణము ప్రతిజ్ఞకు సాధక మని ఆశ్మరథ్యాచార్యులు తలంచుచున్నాడు. ఆశ్మరథ్య వాదమును భేదాభేదవాద మందురు. ఈసిద్ధాంతము ననుస రించి జీవ బ్రహ్మములు కార్యకారణ సంబంధముగలిగి, భేదాభేదమున నుందురు. అనగ విస్ఫులింగ జ్యోతి న్యాయమున నుందురని యర్థము. విస్ఫులింగము తత్త్వతః జ్యోతియేయై పరిమాణాదికదృష్టికి అన్యమై యుండునట్లు జీవుడు తత్త్వతః బ్రహ్మమునకు అభిన్నుడై ఉపాధితః భిన్నుడని తాత్పర్యము.

అజ్ఞానజన్యమైన కల్పిత ఉపాధులవలన భిన్నత్వము గోచరముగాని యిరువురు సత్యమున నొక్కరేయనియు నుపాధులు భ్రాంతిసిద్ధములనియు వివరించును.

పూర్వోక్త వాదత్రయముయొక్క ఉచితాయుచితము లెట్లున్నను, యీవాదముల భాష్యకర్తలు స్వీకరించి, తమ భాష్యగ్రంథముల నధికముగ వివరించుచు వేదాంతశాస్త్ర మును బహుళమొనరించియున్నారు. అందు కాశకృత్స్న మహర్షి వాదమును శంకరులు గైకొని, తన రచనల నన్నింట దానినే ప్రతిపాదించి, తగురీతి ఉపనిషత్తులగూడ ననువదించి అద్భుతమును అజేయమును అగు అద్వైత సిద్ధాంతమును సంస్థాపించిరి.



## శంకరవాదము

కాని శ్రీశంకర ప్రోక్తమగు అద్వైతవాదము జైన బౌద్ధవాదములవలె, Is only for the strong-hearted, who can follow logic duantlessly and face conclusions however subversive of ordinary ideas of reality and value[148] ప్రత్యక్షానుభూతికి ఎంత విరుద్ధముగ గన్పట్టినను దాని తర్కమును ధైర్యముతో ననుసరించుచు, దాని నిర్ణయముల గ్రహించు స్థైర్యశాలురకే యుపయుక్తమై

148. Prof. Satishchandra Chaterjee : An Introduction to Indian Philosophy p. 471

చెల్వొందెను. అవును, ఈశ్వరునకు సృష్టి స్థితి లయ కర్తృత్వశక్తి గలదుగదా యని సంశయించి, భ్రాంతిదృష్టికి ప్రపంచము దోచుటచే దానికి సృష్టికర్తయు నున్నట్లు భ్రాంతిచే పొడగట్టుననియు. భ్రాంతి నశింప సృష్టియే లేకుండుటచే, తత్సృష్టికర్తగ భ్రాంతిస్థితినున్న ఈశ్వరుడును అదృశ్యమని శంకరులు వాదించెదరు. ఈభావము సామాన్యులకు భయానకమనుటయం దాశ్చర్యమేమి! సామాన్య ముముక్షులోకమున కగ్రాహ్యముగ నుండుటే గాక అద్వైతసిద్ధాంతము భీతిని గొల్పుచుండును. అయినను శంకర వేదాంత నిర్వచనము అన్ని యితర వాదములకంటె Has exerted the greatest influence of Indian life and it still persists in some form or other in different parts of India[149] నత్యధికావలంబనము భారతీయజీవితమున గలిగి, ఏదియో యొకరూపమున భారతావని వివిధ ప్రాంతముల వ్యాపించి యున్నది. అయినను అది అతిక్లిష్టమై కేవలము పండిత మతమై యొప్పారియున్నది.



## రామానుజుడు

మరియు The truth cannot be expressed in words and when words are used, even by Sankara

149. Prof. Satishchandra Chatterjee, An Introduction to Indian Philosophy p. 55

acute minds can always find a loop-hole for attack[150]
భాష్యములో సత్యము పలుకబడదు. చివరకు శంకరునిచేనైన పదము లుపయోగింపబడినచో, సూక్ష్మబుద్ధులు ఖండనమునకు అందు లోపముల గాంచగలుగుదురని డగ్లస్ మహాశయుడు నుడివియున్నట్లు శంకరానంతర భాష్యకర్తలందరు శంకరు నెదుర్కొనిరి. అందు నాయకుడై
We are indebted to him (Ramanuja) for exposing many of the obscure points of the Advaita school[151]
అద్వైతవాదమునగల అనేక సూక్ష్మ విషయముల బహిర్గతమొనర్చినందులకు రామానుజునకు కృతజ్ఞులము అని సతీశ చంద్రుడు పలికినట్లు రామానుజుడు ప్రముఖాద్వైత వ్యతిరేకిగా రూపొందెను. అతడు బాదరాయణ దర్శనమును సామాన్యుల కుపయుక్తమగు చందము వివరించి అనేక భాష్యకర్తలలో నగ్రగణ్యుడయ్యెను.

శ్రీరామానుజాచార్యుని సిద్ధాంతమున, బ్రహ్మమునకు సర్వప్రకృతియు శరీరమనియు, ప్రకృతి జీవులు సూక్ష్మావస్థ, అనగా కారణావస్థనుండగ బ్రహ్మము ముకుళితమై కారణరూపము దాల్చుననియు, మరల జీవ ప్రకృతులు స్థూలావస్థకు పరిణమింప బ్రహ్మము వికసితమై కార్యరూపమున నుండునని తాత్పర్యము. అందుచే బ్రహ్మకార్యరూపమగు జగత్తు బ్రహ్మమున కభిన్నమని యన్వయించెను.

150. Donglas Grant Duff Asinslie : The Lcience of Raligion of Swami Yogananda
151. f. Satish Chendra Chatterjee · An Introduction to Indian

(వే. సూ. 1.4.27, 2.1.15) జీవబ్రహ్మములకు కార్య కారణసంబంధ మేర్పడియుండుటచే వీరికి అంశాంశిభావ సంబంధము విస్ఫులింగ జ్యోతి, తరంగ సాగరములవలె నుండునని వివరించెను. రామానుజునకు బ్రహ్మము సగుణమై అనంతకళ్యాణ గుణవంతుడగుచున్నాడు. జీవులు బ్రహ్మ కార్యములై నిత్యముగ ప్రాకారములై బ్రహ్మమునందు నిత్యముగా నుండునని రామానుజ తాత్పర్యము. ప్రకృతి సృష్టి లయ కాలముల రూపాంతరము నొందుచుండ జీవులు అనశ్వరములై సంకోచ వికాసములమాత్రమే నొందునని సిద్ధాంతము.

—ooo—

## ఇతరులు

తర్వాత భాస్కర, యాదవ, నింబార్క మధ్వాది, సిద్ధాంతులు ఔడులోమి ఆశ్మరథ్యుల ననుసరించి తమతమ సిద్ధాంతముల భేదాభేదము నుభయరూపముగను, అచింత్య భేదాభేదమును ద్వైతమును విశ్వసించుచు రూపొందించిరి.

వేదాంతమునగల యీతారతమ్యములు మన సర్వ సిద్ధాంత సౌరభ గ్రంథమున ప్రత్యేక ప్రత్యేక ఖండముల చర్చింపబడును గాన నింతటితో వీని మీమాంస విర మింతముగాక.

—

# దర్శన రచన

ఇక వేదాంత దర్శన రచనా విధానమును, విషయ స్వరూపమును తిలకించెదముగాక !

'శాస్త్రాధ్యాయే తథా పాదే న్యాయసంగతయ స్త్రిధా। శాస్త్రాది విషయే జ్ఞాతే తత్తత్సంగతిరుహ్యతాం॥' అను శ్లోకార్థమునననుసరించి వేదాంత దర్శనగ్రంథము తత్ప్రోక్త విషయ వివరణార్థమై అధ్యాయ చతుష్టయమును మరల నొక్కొక్క అధ్యాయము నాలుగు పాదములచేతను భూషితమై యున్నది. ఆ పాదంబులును 'విషయో విశయ శ్చైవ పూర్వపక్ష స్తథోత్తరం। నిర్ణయశ్చేతి పంచాంగం శాస్త్రేఽధికరణం విదుః॥' అను ఆర్యోక్తి ననుసరించి విషయ పరిశీలనా సందర్భమున పంచాంగములు నాబడు విషయ, విశయ, పూర్వపక్ష, ఉత్తర, నిర్ణయము నా మీమాంసా విధాన సంశోభితమై యొప్పారియున్నది. వేదాంత దర్శనమున మొత్తమునకు 192 అధికరణములుండ, ప్రథమాధ్యాయ ప్రథమపాదమున 11, ద్వితీయమున 7, తృతీయమున 14, చతుర్థమున 8, మొత్తము అధ్యాయమున 40 అధికరణములు గలవు. అటులే ద్వితీయాధ్యాయమున ప్రథమపాదమున 13, ద్వితీయపాదమున 8, తృతీయమున 17, చతుర్థమున 9, అధ్యాయము మొత్తమునకు 47 అధికరణములు గలవు. మరల తృతీయాధ్యాయ ప్రథమపాదమున 6, ద్వితీయమున 8, తృతీయమున 36, చతుర్థమున 17 అధికరణములును గలిగి తృతీయాధ్యాయమున మొత్తము

నకు 67 అధికరణముల గలవు. చతుర్థాధ్యాయ ప్రథమ పాదమున 14, ద్వితీయమున 11, తృతీయమున 6, చతుర్థమున 7, అధికరణములగలిగి చతుర్థాధ్యాయము మొత్తము నకు 38 అధికరణముల గలిగియున్నది. మరల నీ అధికరణములు సూత్రములుగా విభజింప బడియున్నవి. సూత్ర నిర్వచనము 'లఘూని సూచితార్థాని స్వల్పాక్షరపదాని చ। సర్వతః సారభూతాని సూత్రాణ్యాహుర్మనీషిణః॥' (భామతి 1.1.1) లఘువును, అర్థసూచికమును, స్వల్పాక్షరపద సంయుక్తమును, సారభూతమును, అయియుండునది సూత్రమని బుధులు చెప్పుదురని వాచస్పతి మిశ్రులు గావించిరి. 'అల్పాక్షర మసందిగ్ధం సారవద్విశ్వతోముఖం। అస్తోభయ మనవద్యం చ సూత్రం సూత్రవిదో విదుః॥' అల్పాక్షరముల గలిగి స్పష్టముగ, వాదసారమును తెలుపుచు, ప్రశ్నమును సమగ్రలీల చర్చించుచు, పునరుక్తిరహితమై నిర్దుష్టమై యుండునది సూత్రమని సూత్రవిదులు తెలుపుచున్నట్లు పద్మపురాణ నిర్వచనము. ఈసూత్రరచనా విధానమును 'సంజ్ఞా చ పరిభాషా చ విధి ర్నియమ ఏవ చ। అతిదేశోఽధికారశ్చ షడ్విధం సూత్రలక్షణం॥' సంజ్ఞా, పరిభాషా, విధి, నియమ, అతిదేశ, అధికారరూపమున షడ్విధముగ పాణిన్యాచార్యు లుల్లేఖించియున్నారు. ప్రథమాధ్యాయమున 134, ద్వితీయమున, 157, తృతీయమున 186, చతుర్థమున 78 సూత్రములుండి మొత్తము దర్శనమున 555 సూత్రము లొప్పారుచున్నవి.

# అధ్యాయ విషయము

సమన్వయాధికరణమని ప్రశస్తిగనిన ప్రథమాధ్యాయమున బాదరాయణుడు, సృష్టికి నిమిత్తోపాదానకారణము బ్రహ్మమేయనియు, నిర్ణయించి, ప్రధానము నుపాదానముగా భావించు సాంఖ్యవాదమును నిరసించెను. మరియు సాంఖ్యసిద్ధాంతమును సూచించుచున్న ఉపనిషద్గత అజ, అవ్యక్త, మహత్, మొదలగు శబ్దముల ప్రత్యేకముగ చర్చించి వానిని బ్రహ్మమునకే సమన్వయించెను. ఇందు బ్రహ్మనిరూపణము గావింపబడియుండుటచే బ్రహ్మనిరూపణాధ్యాయమనియు ననవచ్చును. అవిరోధాధ్యాయ మనబడు ద్వితీయము నాటి సుప్రసిద్ధ సాంఖ్య, బౌద్ధ, జైన, యోగ, వైశేషిక, భాగవత, శాక్తేయ, పాశుపత మతములు జర్చించి, ఆమతములు శ్రుతివిరోధములుగా నిరూపించి, శిష్టజనాదరణీయములు కానివిగా నిర్ణయించెను. అధ్యాయాంతమున జీవ, భూత, ఇంద్రియోత్పత్తులను జీవపరిమాణ, కర్తృత్వ భోక్తృత్వ జ్ఞాతృత్వముల విమర్శించి స్వమత సంస్థాపనమును బాదరాయణుడు గావించెను. ఇందు పరమత ఖండనము సయుక్తికముగ గావింపబడియుండుటచే నిది పరమతఖండనాధ్యాయమనియు, నాబడును. తృతీయాధ్యాయము ముక్తిసాధనాధ్యాయ మనబడుచు, సాధనోపదేశముల గావించును. ఇది పునర్జన్మ స్వర్గ నరకాదిక గతియు, జాగ్రదాద్యవస్థలు, భగవద్రూప ప్రాప్యమును, తత్సాధనావిధానమును చర్చించి తీర్మానించును.

ముక్తిస్వరూపాధ్యాయముగా పేర్కొనబడదగు చతుర్థాధ్యాయము ముక్తిని వర్ణించియున్నది. ముక్తిసాధన కవసరమగు సాధనాంతర సంపత్తి, బ్రహ్మవిదుల వ్యవహారమును గూర్చియు, ముక్తిస్వరూపమును నిరూపించును.

సూక్ష్మముగ ప్రథమాధ్యాయము బ్రహ్మ ప్రతిపాదకాధ్యాయము, ద్వితీయము యుక్త్యధ్యాయము, తృతీయము సాధనాధ్యాయము, చతుర్థము మోక్షాధ్యాయము అని గూడ ననవచ్చును. ఇట్లు వేదాంతదర్శనము ఆధ్యాత్మిక విద్యను సమగ్రరీతి మీమాంసించి సాధక, సాధన, సాధ్యముల నిర్ణయించి సర్వజ్ఞుడగు బాదరాయణ వ్యాసునిచే ముముక్షులోక హితార్థమై ప్రసాదింపబడియున్నది.



## నామము

వేదకాలమున కంతమున రూపొందుటచేతగాని, వేదభాగములగు సంహితా బ్రాహ్మణారణ్యకముల కంతమున నుండుటచేతగాని, సంహితా బ్రాహ్మణముల తర్వాతిదగు ఆరణ్యకభాగమున నుండుటచేతగాని, దీనికి వేదాంతమను నామము ప్రశస్తమైనది. వైదిక కర్మకాండానంతర మగుటచేతను, వేదజ్ఞానముచే బొందబడు అనగ, అంతమగు బ్రహ్మమునుగూర్చి ప్రసంగించుచుండుటచేతగూడ దీని వేదాంతమన జెల్లును. వేదగిమ్యమును ప్రతిపాదించునుగాన వేదాంత

మనియు ననవచ్చును. వేదాంత శబ్దము 'వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః' (ము. 3.2.6) శ్వేతాశ్వతరము మొదలగు ఉపనిషత్తుల గోచరము. Brahma Sutra because it is an exposition of the doctrine of Brahma, and also Sariraka Sutra because it deals with the embodiment of the unconditioned Self [152] బ్రహ్మవిషయము వివరించుచుండుటచే బ్రహ్మసూత్రమనియు, పరబ్రహ్మము ఉపాధిగత మగుటనుగూర్చి తెలుపుచుండుటచే శారీరక సూత్రమనియు నామాంతరము గలదు. లేక శరీరస్థుడై యున్న జీవుని ఉద్ధరణకై బోధింప బడియుండుటచే శారీరక సూత్రము లనియు ననవగును. పూర్వమీమాంసానంతర మగుటచే ఉత్తర మీమాంసయనియు వ్యవహారము గలదు. అట్లే బ్రహ్మమీమాంసా, శారీరకమీమాంసా శబ్దములును అన్వయించును. అంతియగాక బాదరాయణ కర్తృకముగాన, బాదరాయణసూత్ర, వ్యాససూత్రమనియు నాబడుచున్నది. ఈసూత్రాధ్యయన ఫలితముగ సాధకుడు ప్రపంచవిషయముల విరాగము గలిగి యుండి తురీయాశ్రమ స్వీకరణము గావించునుగాన 'భిక్షుసూత్రము', లనియు పాణిన్యాచార్యుడు నిర్వచించెను.

# వేదాంతదర్శన తాత్పర్యము

పూర్వ మనేకవిధముల వివరింపబడియున్నరీతి నుత్తర మీమాంసాశాస్త్రము కేవల మాధ్యాత్మిక విషయముల జర్చించుచు, సకల తత్త్వవిచారణమునకు ప్రధానాంశములగు బ్రహ్మ, జీవ జగత్తులు సమగ్రరీతి విచారించి అందందుగల రహస్యముల శోధించి వానివాని నిజస్వరూపముల ముముక్షు లోక హితార్థమై బోధించుచున్నది. అసలు తత్త్వశాస్త్ర మన్నను బ్రహ్మ జీవ జగత్తుల స్వరూపమును, వాని పరస్పర సంబంధములను విచారించి బోధించునది యగుటచే వేదాంత శాస్త్రము ప్రారంభమున 'అథాతో బ్రహ్మ జిజ్ఞాసా' (వే. సూ. 1.1.1) నుండి చివరిదగు 'అనావృత్తిః శబ్దాత్, అనావృత్తిః శబ్దాత్' (4.4.23) వరకుగల సర్వగ్రంథమున పై విషయ నిరూపణము గావించి తద్విరుద్ధ సిద్ధాంతముల పూర్వపక్ష మొనరించి, వేదానుకూల వేదాంత తత్త్వశాస్త్రమును నిర్మించి మనకు శ్రేయ మొనగూర్చి యున్నది. సర్వాధ్యాత్మిక సంస్థితికి బ్రహ్మమే ముఖ్యసూత్రముగాన ఆ బ్రహ్మ మీమాంసనే ప్రథమాధ్యాయమున గావించి, తర్కముచే ద్వితీయమున అన్య సిద్ధాంత ఖండనముగావించి బ్రహ్మ సాధనోపాయముల దర్వాత ప్రతిపాదించి, తత్సాధ్యమగు మోక్ష నిరూపణము గావించి, బ్రహ్మ, తర్క, సాధన, మోక్షాధ్యాయముల క్రమముగ రూపొందించి సమగ్ర శా.స.

మును మనకు ప్రసాదించి యున్న శ్రీ బాదరాయణ భగవానునికి మన మెంతయు కృతజ్ఞులము. ఇక బాదరాయణ వ్యాసుడు బోధించియున్న విషయముల గ్రహింప యత్నింతము గాక.

---

## నిర్గుణ బ్రహ్మము

దర్శన ప్రారంభముననే ద్వైపాయనులు 'అథాతో బ్రహ్మ జిజ్ఞాసా' (వే. సూ. 1.1.1) అని సూత్రీకరించి యున్నారు. ఇచ్చటగల 'అథ' శబ్దము మంగళాచరణముగ గాని, సాధన చతుష్టయప్రాప్త్యనంతరముగ గాని, వేదాధ్యయనానంతరమని గాని, కర్మ పరిపక్వమైన యనంతరమనిగాని వివిధార్థముల ఆచార్యులు సూచించియున్నారు. 'కర్మణా చిత్తశుద్ధిః' అను ఆర్యోక్తి ననుసరించి కామ్య కర్మద్వారా నిష్కామ కర్మ, తన్మూలమున చిత్తశుద్ధి యేర్పడి సాధన చతుష్టయములు సిద్ధించునుగాన, 'అథ' శబ్దమునకు సాక్షాత్సంబంధమున నున్న వివేకాదిక ప్రాప్తిమైన పిమ్మట బ్రహ్మజిజ్ఞాస కర్తవ్యమని ప్రథమ సూత్రముననే గ్రంథ విషయము, అధికారి విషయము నిర్ణయింపబడి యున్నది. అసంఖ్యాకమైన మహర్షులు యీ బ్రహ్మ విషయమును ననేక రీతుల సిద్ధాంతపరచి యుండుటచే యాథార్థము అగోచరమై ముముక్షులోకము సందేహ

పరంపరలంబడి యధార్థ మార్గ దూరులై యల్లాడుచుండుటచే లోకహితార్థము ఈ శాస్త్రము ప్రవృత్తము. అందుచే ప్రథమముననే బ్రహ్మ జిజ్ఞాసా కర్తవ్యమును హెచ్చరించి యున్నది.

అట్లగుచో బ్రహ్మము నెరుంగుమార్గ మెయ్యది యను ప్రశ్న ముదయింప, స్థూలమునుండి సూక్ష్మమునకు బోధ సాగుట యుచిత మగుటచే కార్యరూప జగత్తునుండి ప్రారంభించి, తత్కారణమైన బ్రహ్మమును నిర్ణయింప నీ శాస్త్రము 'జన్మాద్యస్య యతః' (వే. సూ. 1.1.2) ఎక్కడనుండి యీ జగత్తునకు సృష్టిస్థితి లయములో యని సూచించుచున్నది. అటులేగదా భృగువల్లియు 'యతో వా ఇమాని భూతాని జాయంతే। యేన జాతాని జీవంతి। యత్ప్రయంత్యభిసంవిశంతి' (తై. 3.1) ఎచ్చటనుండి ఈ భూతజాలము పుట్టుచున్నదో, దేనిమీద ఆధారపడి పోషింపబడుచున్నదో, మరల దేనిలో లయించుచున్నదో యను ప్రశ్నములతోడనే ప్రారంభింపబడియున్నది. కాన బ్రహ్మము నెరుంగ జగత్తు యొక్క పుట్టుపూర్వోత్తరము లవశ్య గ్రాహ్యము లగుచున్నవి. బ్రహ్మేతర పదార్థమొండు సృష్ట్యాదిని అభావమని శ్రుతు లుద్ఘోషించుచుండుటచే సృష్ట్యనంతర గోచరమగు యీ సృష్టియంతయు బ్రహ్మ జనితమే యని యనుమానితము. కాన కేవల మనుమానము నిర్దుష్ట ప్రమాణము గానేరదు గాన, సర్వోత్కృష్టమును అపౌరుషేయమును స్వతః ప్రమాణమును అయిన 'అత ఏవ చ నిత్యం

త్వాత్' (వే. సూ. 1.3.29) సూత్రమున వివరింపబడిన విధానమున నిత్యమునునైన వేదమే ప్రమాణము అని 'శాస్త్ర యోనిత్వాత్' (వే. సూ. 1.1.3) అను సూత్రము చెప్పబడి యున్నది. అనగా బ్రహ్మమునకు వేదమే ప్రమాణమని తాత్పర్యము. వేదాంత శాస్త్రము గ్రహించు ప్రమాణాంతరములలో ప్రత్యక్షము కేవలము స్థూలమును యింద్రియాపేక్షకమై స్థూల విషయ గ్రహణమునే గావించునుగాని అభౌతిక బ్రహ్మవిషయ పరిగ్రహణము గావింపనేరదు. అటులే యనుమానార్థమును స్థూలేంద్రియాపేక్షకమై సూక్ష్మేంద్రియ మగు మనస్సుపై యాధారపడియున్నను, మనస్సుకూడ కార్య రూపమగుటచే కార్యము కారణ గ్రహణము గావింపనేరదు గాన నదియు నిష్ప్రయోజన మగుచున్నది. ఇక తర్వాతి ఉపమానాదికములన్నియు నీ రెంటిపై నాధారపడి యుండుటచే బ్రహ్మజ్ఞానమున నిరాధారము లగుటచే శాస్త్రమే ప్రమాణముగా వేదాంతదర్శనము గ్రంథారంభముననే స్థిర పరచియున్నది. అట్లగుచో శ్రుతి యనంతమై ననేక విధము లుగ పరస్పర వ్యతిరేకమై బహుళ విరుద్ధార్థశబ్దప్రయోగము లతో గూడియుండ, బ్రహ్మవిషయనిర్ణయ మెట్లేర్పడునని సంశయమురాగా 'తత్తు సమన్వయాత్' (వే. సూ. 1.1.4) బ్రహ్మమునే వేదము ప్రతిపాదించుననియు, సందేహింపరా దనియు, శ్రుతులగల శబ్దముల సమన్వయమొనర్చిన వో నన్నియు బహ్మపర వాచకములే యనియు నీసూత్రము సిద్ధాంతపరచుచున్నది.

ఈవిధముగ ప్రథమమున చతుస్సూత్రములలోనే బాదరాయణాచార్యుడు వేదాంతదర్శన తాత్పర్యము నంతటిని చెప్పియుండుటచే ననేక వ్యాఖ్యాతలు వీనికే ప్రాధాన్యతనిచ్చి తర్వాత గ్రంథమంతయు యీ చతుస్సూత్రికి భాష్యమే యని వక్కాణించుచున్నారు. తదనుగుణముగ ననేకులు యీచతుస్సూత్రములకే సవివర భాష్య మొనరించియున్నారు. అట్లు యీనాల్గుసూత్రములు అత్యంత ప్రాముఖ్యతను గాంచియున్నవి,

బృహదారణ్యకశ్రుతిలో 'అథాత ఆదేశో నేతి నేతి న హ్యేతస్మాదితి నేత్యన్యత్పరమస్తి' (బృ. 2.3.6) అను మంత్రమున ఇంతకంటె సుత్తమ నిర్వచన మభావమగుటచే 'నేతి నేతి' యని బ్రహ్మనిర్వచనము గావింపబడియున్నవి. అనగా పూర్వోక్తమైన 'ద్వేవావ బ్రహ్మణో రూపే మూర్తం చైవామూర్తం చ, మర్త్యంచామృతం చ, స్థితం చ, యచ్చ, సచ్చ త్యచ్చ' (బృ. 2.3.1) బ్రహ్మమునకు, మూర్తామూర్త, మర్త్య అమృత, సాంత యనంత, వాచ్య అనిర్వాచ్యములని పచింపదగు ద్వివిధరూపము గలదని వక్కాణించి, 'నేతి నేతి' అనువాక్యమున నా రెండును బ్రహ్మముయొక్క రూపములు గావనియు నా రెంటికి నతీతమై యొప్పునదే బ్రహ్మమనియు'ప్రకృతైతావత్వం హి ప్రతిషేధతి తతో బ్రవీతి చ భూయః'(వే.సూ.3.2.22) ప్రకృతము చెప్పబడినది నిషేధింపబడి తర్వాతవిషయము తెలుపబడుచున్నదని దర్శనము బ్రహ్మమును ప్రతిపాదించు

చున్నది. అనగా బ్రహ్మము మూర్తామూర్తాదుల కతీత మనియు, సదసత్తుల కన్యమనియు నుడువుటచే నది శూన్యముగాక అనిర్వాచ్యమైయున్నదని గ్రాహ్యము. ఎట్లన నాబ్రహ్మము 'తదవ్యక్తం, ఆహ హి' (వే. సూ. 3.2.23) శ్రుత్యర్థము ననుసరించి అవ్యక్తమై యుండియు 'అపి సంరాధనే, ప్రత్యక్షానుమానాభ్యాం' (వే. సూ.3 2. 24) శ్రుతి స్మృతుల ప్రకారము చూచిన నాబ్రహ్మము గాఢ సమాధిస్థితిలో ననుభూతముగనుండుటచే మనకు సాధారణానుభూతి కతీతముగ తెలియవలెను. మరియు నాబ్రహ్మము 'న స్థానతోఽపి పరస్యోభయలింగం సర్వత్ర హి' (వే. సూ. 3.2.11) సర్వశ్రుతులు తెలుపుచున్నవిధముగ, నాపర బ్రహ్మమునకు ఉపాధి సంబంధమువలన సాకార నిరాకారము నన్వయింపరాదు. అనగ నాతడు సగుణ నిర్గుణాతీతుడై మరల అనిర్వాచ్యస్థితినే యలంకరించి యుండును. ఈ భావమున కాధారముగ 'అపి చైవ మేకే' (వే. సూ. 2 2. 13) అనుసూత్రమున, 'మనసైవేదమాప్తవ్యం నేహ నానాస్తి కించన' (4.11) ఈయేకత్వజ్ఞానము మనస్సుచేతనే ఆప్తవ్యమనియు, నాబ్రహ్మమునందు నానాత్వము లేదనియు నను కాఠకశ్రుతి ప్రమాణము స్వీకరింపబడినది. కావున 'అరూపవదేవ హి, తత్ప్రధానత్వాత్' (వే.సూ. 3.2.14) బ్రహ్మమునుగూర్చిన సర్వశ్రుతుల తాత్పర్యమగుటవలన బ్రహ్మము నిశ్చయముగ నిరాకారుడనియే తీర్మానము.

మరియు నా బ్రహ్మము 'ప్రజ్ఞానఘున ఏవ' (బృ. 4. 5.13) అని శ్రుత్యభిప్రాయమగుటచే 'ఆహ చ తన్మాత్రం' (వే. సూ. 3.2.16) ప్రజ్ఞాస్వరూపుడు. పూర్వోక్తచందము సర్వేతరపదార్థము నిషేధింపబడుటచే 'తథాన్యప్రతిషే ధాత్' (వే. సూ. 3.2.36) బ్రహ్మము ఏకమే యగు చున్నాడు. మరియు నా బ్రహ్మము 'అనేన సర్వగతత్వ మాయామశబ్దాదిభ్యః' (వే. సూ. 3.2.37) శ్రుతివాక్య మూలమున సర్వవ్యాపకుడుగా దెలియబడుచు, 'అంతరా భూతగ్రామవత్ స్వాత్మనః' (వే. సూ. 3.3.35) అను సూత్రము 'యత్సాక్షా దపరోక్షా ద్బ్రహ్మ య ఆత్మా సర్వాంతరః' (బృ. 3..5.1) । ఏబ్రహ్మము పూర్తిగ నపరో క్షమో ఏ ఆత్మ సర్వాంతరమో యను శ్రుతివాక్యముల ననుసరించి సర్వాంత రాత్మగా నిర్ణయింపబడి 'ఆనందా దయః ప్రధానస్య' (వే సూ. 3.3.11) ప్రధానభూతమగు బ్రహ్మము ఆనందాది లక్షణములుగలిగి, 'మాంత్రివర్ణిక మేవ చ గీయతే' (వే. సూ. 1.1.15) తైత్తిరీయాది శ్రుతులు ప్రమాణముగాన 'ఆనందమయోఽభ్యాసాత్' (వే. సూ. 1.1.12) ఆనందమయుడై, యొప్పారుచున్నాడు. మరియు 'గతి సామాన్యాత్' (వే. సూ. 1.1.10) 'శ్రుత త్వాచ్చ' (వే. సూ. 1.1.11) అను సూత్ర ద్వయము ద్వారా వేదప్రమాణము ననుసరించి, బ్రహ్మము శుద్ధ చైతన్యమనియు దీర్మానింపబడియున్నది.

అంత నుపనిషత్తుల సందిగ్ధార్థములుగ నుపయో
గింపబడియున్న అనేక శబ్దములు బ్రహ్మమునకు అన్వయింప
బడియున్నవి. 'అంత స్తద్ధర్మోపదేశాత్' (వే. సూ. 1.1.
20) 'అనవస్థితే రసంభవాచ్చ నేతరః' (వే. సూ. 1.2.
17) ఆదిత్యపురుషుడును, అక్షిపురుషుడును బ్రహ్మమే
యగుచున్నారు. అటులే 'ఆకాశ స్తల్లింగాత్' (వే. సూ.
1.1 22) జగత్తున కాధారముగ ఆకాశము శ్రుతులలో
వచింపబడుటచేతను, 'ఆకాశోర్థాంతరత్వాది వ్యపదేశాత్'
(వే. సూ. 1 3.41) నామరూపాదికమునకు విలక్షణ మగుట
చేతను ఆకాశము బ్రహ్మమే యగుచున్నది. 'దహర
ఉత్తరేభ్యః' (వే. సూ. 1.3.14) తర్వాత శ్రుతుల ననుస
రించి దహరముగూడ బ్రహ్మమే యగుచున్నది. అనగా
నా బ్రహ్మము ఆకాశమువోలె సర్వగతుడని యన్వయము.

అట్లే 'అత ఏవ ప్రాణః' (వే. సూ. 1.1.23) 'కంప
నాత్' (వే. సూ. 1.3.39) ప్రళయకాలమున సర్వము
ప్రాణలో లయించుటచేతను, సర్వము ప్రాణకంపనా జన్య
మగుటచేతను 'ప్రాణ స్తథానుగమాత్' (వే.సూ. 1.4.28)
శ్రుతివాక్య సమన్వయమువలనను బ్రహ్మమే ప్రాణస్వరూప
మని గ్రాహ్యము. ఆబ్రహ్మమే 'జ్యోతిశ్చరణాభిధానాత్'
(వే. సూ. 1.1.24) 'పాదోస్య విశ్వాభూతాని త్రిపాదాస్యా
మృతం దివి' (ఛాం. 3.12.6) అను శ్రుతులచే నతనికి పాద
ములు చెప్పబడుటచేతను, 'జ్యోతిర్దర్శనాత్' (వే. సూ.
1.3.40) పరబ్రహ్మము జ్యోతివాచ్యు డగుచున్నాడు.

అందుచేతనే 'న తత్ర సూర్యో భాతి న చంద్ర తారకం నేమా విద్యుతో భాంతి కుతోఽయమగ్నిః। తమేవ భాంతమనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి॥' (ముం. 2. 2.10, కఠ. 5.15) ఆ బ్రహ్మవిషయమున సూర్య చంద్రతారకాగ్ని విద్యుత్తులు ప్రకాశింప జాలవనియు, నా సూర్యాదిక మంతయు ప్రకాశమానమగు బ్రహ్మము ననుసరించి ప్రకాశించుచుండును, సూర్యచంద్రాదికమంతయు ఆబ్రహ్మకాంతిచేతనే ప్రకాశించు చున్నదను శ్రుతి వాక్యముల ననువదించి, 'అనుకృతేస్తస్య చ' (వే. సూ. 1.3.22) సూత్రమున బ్రహ్మము ప్రకాశ భూయిష్టముగా నిరూపింపబడినది.

కాన నాబ్రహ్మము భూమవాచ్యుడై (వే. సూ. 1. 3.8) ఆకాశపర్యంత సృష్టిని ధరించుటచే అక్షరమనియు (వే. సూ.1.3. 10) బోధింపబడుచు సర్వాంతర, సర్వాతీత, సర్వాధారముగా వేదాంతదర్శనముచే బ్రహ్మము నిర్వచింపబడుచున్నది.



## సగుణ బ్రహ్మము

కాని 'జన్మాద్యస్య యతః' (వే. సూ. 1.1.2) అను సూత్రప్రకారము ఆబ్రహ్మమే సర్వకార్యజాతమునకు నిమిత్తోపాదానకారణ మగుచున్నది. ఈ విషయమునే సూత్ర

కారుడు సప్రమాణముగ నిరూపించియున్నాడు. బ్రహ్మము 'ద్యుభ్వాద్యాయతనం స్వశబ్దాత్' (వే. సూ. 1 3.1) ద్యు భూద్యాదిక సర్వమునకు నాయతనస్థానమై ఆశ్రయ స్థానమై యొప్పి 'యోనిశ్చ హి గీయతే' (వే.సూ. 1.4 27) సర్వమునకు పరమకారణమై యలరారుచున్నాడు. 'కారణత్వేన చాకాశాదిషు యథా వ్యపదిష్టోక్తేః' (వే. సూ. 1.4. 14) ప్రథమ జనితము 'ఆత్మనః ఆకాశస్సంభూతః' (తై. 2.2) అను వాక్యము ననుసరించి ఆకాశమా లేక 'తత్తేజో సృజత' (ఛాం. 6.2.3) అది తేజస్సును సృజించెను అను మాదిరి తేజస్సియా అను మొదలగు సందేహ ముత్పన్నము గాని సర్వమునకును బ్రహ్మమే ప్రథమ కారణమనుటలో శ్రుతులందు భిన్నభావములు లేవనియు, ఆబ్రహ్మము 'సర్వోపేతా చ తద్దర్శనాత్' (వే సూ. 2.1.30) సూత్రము ననుసరించి శర్వశక్తిస్వరూపముగా వివరింపబడియుండుటచే 'శ్రుతత్వాచ్చ' (వే. సూ. 1.1.11) శ్రుతివాక్యరీతి నతడు సర్వజ్ఞుడును 'స్యాత్ అవధారణాత్' (వే. సూ. 3.3.17) 'ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్' (ఐ. 1.1) అనునట్లు సృష్ట్యాదిలో నది యొక్కటి మాత్రమేయుండి 'ఈక్షతే' (వే. సూ. 1.1.5) సృష్టిసంకల్పమును గావించి యున్నదని విదితము. కాన నా బ్రహ్మము 'ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాంతానుపరోధాత్' (వే. సూ. 1.4.23) సూత్రవచనము ప్రకారము ప్రతిజ్ఞ ననుసరించియు ప్రకృత్యాదికమునకు ఉపాదాన కారణమగుచున్నది. మరియు 'అభిధ్యోపదేశాచ్చ' (వే.

సూ. 1.4. 24) సృష్టిసంకల్పము బ్రహ్మమే చేయుచుండుట వలనను నదియే ఉపాదాన నిమిత్తకారణము లగుచున్నది. 'సోకామయత బహుస్యాం ప్రజాయేయ' (తై. 2.6 1) 'తదైక్షత బహుస్యాం ప్రజాయేయ' (ఛాం. 6 2.3) మొదలగు వాక్యములు బ్రహ్మమే ఉపాదాన నిమిత్త కారణములుగ దెలుపుచున్నవి. ఇట్లు 'తదభిధ్యానా దేవ తు తల్లింగాత్ సః' (వే సూ.2 3.13) అతని సంకల్ప బలముచేతనే సర్వము సృజింపబడ 'అంతర్యామీ, అధిదైవాదిషు తద్ధర్మ వ్యపదేశాత్' (వే. సూ.1.2.18) దేవతాది సర్వమున కంతర్యామియై ప్రభువునై బ్రహ్మము యలరారుచున్నాడు.

ఇంత యనంత సృష్టి నాతఁడు కల్పించియున్నను, నతడు పూర్వోక్తచందము 'సర్వధర్మోపపత్తేశ్చ' (వే.సూ. 2 1.37) సర్వశక్తి సంయుక్తుడగుటచే, భూమ వాచ్యమగు అనంతలక్షణు డగుటచేతను (వే. సూ. 1.3.8) 'కృత్స్న ప్రసక్తిర్నిరవయవత్వశబ్దకోపో వా' (వే. సూ. 2.1.26) బ్రహ్మము నిరవయవుడగుటచే నేవికారమును చెందక నిర్వికారముగనే యుండును. మరియు నీసృష్టి సమయమున నాతనికి 'వైషమ్య నైర్ఘృణ్యేన' (వే.సూ. 2.1.34) వైషమ్య క్రూరత్వముల భావములు బ్రహ్మములో నభావము. అంతియు గాక. 'అత ఏవ చోపమా సూర్యకాదివత్' (వే. సూ. 3.2.18) జలముల సూర్య ప్రతిబింబముల చందము యీ సృష్టియంతయు బ్రహ్మ ప్రతిబింబముగనే నేర్పడిన దగుటచే నైజమున బ్రహ్మము నిర్వికారముగ నుండి, తాను అజమై

'అసంభవస్తు సతః అనుపపత్తేః' (వే. సూ. 2.3.9) అను సూత్రము ననుసరించి తాను మాత్రము అకారణుడై యొప్పి యుండును.

ఇట్లు సర్వకారణమైన బ్రహ్మమే మరల 'విపర్యయేణ తు క్రమోతః, ఉపపద్యతే చ' (వే. సూ. 2.3.14) ప్రళయ కాలమున భూతములెల్ల ఉత్పత్తి వ్యతిరేక క్రమమున బ్రహ్మమున లయించు ననునట్లు, 'అత్తాచరాచర గ్రహణాత్' (వే. సూ. 1.2.9) సర్వచరాచరములకు నాతడే లయకర్తయు నగుచున్నాడు.

బ్రహ్మాండాదికసృష్టికి నిమిత్తోపాదానములు బ్రహ్మమైయున్నను, నిర్వికారుడని పూర్వము వినియున్నాము కాన నిక నీ సృష్టిగల సకల సుఖ దుఃఖానుభూతియు నాతనికి ఏమాత్రము నంటదని బాదరాయణాచార్యులు శ్రుత్యాపేక్షికముగ నిరూపించియున్నారు. 'సంభోగప్రాప్తిరితి చేత్ న, వైశేష్యాత్' (వే. సూ 1.2.8) సర్వవ్యాపకుడై సర్వాంతర్యామియై సర్వ జీవులనున్న బ్రహ్మమునకు నా యా యుపాధుల సుఖదుఃఖాదిక అనుభవము ప్రాప్తించునుగదా యని సంశయించి, జీవ బ్రహ్మముల వ్యత్యస్తమువలన కాదని నిర్ణయము. అనగ అజ్ఞుడగు జీవున కట్టి అనుభూతి సిద్ధముగాని నిరజ్ఞుడగు బ్రహ్మమున కట్టి యనుభూతి దుర్లభము. ఎట్లన 'ప్రకాశాది వన్నైవం పరః' (వే. సూ. 2.3.46) సూర్యచంద్రాదిక ప్రకాశము అవరోధమునుబట్టి వక్రముగ

గోచరించినను, నటగల ప్రతిబింబము చలించినను సూర్యాదిక జ్యోతులు నిర్వికారముగనున్నరీతి ప్రతిబింబుడగు జీవున కెట్టి సుఖాదులు సంభవించినను, బ్రహ్మమున కవి ప్రాప్తించవని సోదాహరణముగ సూత్రకారుడు వివరించెను. దానికి వివరణము గావించుచు. ముండక శ్రుతి 'ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే । తయో రన్యః పిప్పలం స్వాద్వ త్త్యనశ్నన్నన్యోఽభిచాకశీతి' (ముం. 3.1.1, శ్వే. 4.6, కఠ. 3.1) నియమ్య నియామక భావసంబంధము గలవారును, సదా కలిసియుండువారును, స్నేహితులును అగు జీవేశ్వరులు ఒకే వృక్షమును (శరీరమును) ఆశ్రయించి యున్నారు. వారిలో ఒకడు రుచిమంతమైన కర్మఫలముల ననుభవించుచుండ, మరియొక్కడు అనుభవింపక సాక్షియై చూచుచున్నాడు అని పైవిషయము నంతటిని చక్కగ వివరించియున్నది.

ఈ విధము నిర్గుణుడై నిరాకారుడై మరియు ననిర్వాచ్యమైన పరబ్రహ్మము, సగుణమై సర్వమునకు సృష్టికారణమై సర్వనియంతయై సర్వాంతరమై మరల సర్వాతీతమై యొప్పారుచున్నదని కాని అదియు తాను నిర్వికారమై జలచంద్ర న్యాయమున సర్వసృష్టికి నిమిత్తోపాదాన కారణముగ ననేక రూపముల దాల్చినట్లు భాసించుచుండును అనియు పైగ్రంథ సారాంశము.

---

# సృష్టి

పూర్వగ్రంథమున బ్రహ్మమే సర్వ చరాచర సృష్టికిని ఉపాదాన నిమిత్త కారణముగా పరగుచున్నాడని శ్రుతి ప్రమాణముగా నిరూపింపబడియున్నది. ఆ విషయము 'జగద్వాచిత్వాత్' (వే. సూ. 1.4.16) కార్యరూపముగు నీ జగత్తునకు ఆ బ్రహ్మమే సర్వకారణమనియు. 'ఆత్మకృతేః పరిణామాత్' (వే. సూ. 1.4.26) సర్వసృష్టిగ నాత్మయే పరిణమించినదగుటచే నదియే కారణ ద్వయమనియు, దీర్మా నింపబడియున్నది. ఈ జగత్తు 'అసదితి చేత్ న ప్రతిషేధమాత్రత్వాత్' (వే. సూ. 2.1.7) సృష్టికి బూర్వము అసత్తు అనుటకు వీలుగాక రూపాంతరమున నున్నది. అసత్తు సత్తుగ పరిణమించుట నసాధ్యముగదా! మరియు ప్రళయ కాలమున, ని సృష్టియంతయు బ్రహ్మమునందే లయించుటచే సృష్టియొక్క గుణాదులు బ్రహ్మమునకు కళంకము చేకూర్చునని సంశయించుచో నది దుర్లభముగ 'అపీతౌ తద్వత్ప్ర సంగా దసమంజసం' (వే. సూ. 2.1.8) సూత్రమునకు సమాధానముగ 'న తు, దృష్టాంతభావాత్' (వే. సూ. 2 1.9) సూత్రము తెలుపబడియున్నది. కార్యము కారణమునందు లయింప కారణము కళంకితము గానవసరములేనట్లు అనేక దృష్టాంతములు గలవని నిరూపితమగుచున్నది. ఘటాదిక మృద్వికారములు కార్యరూపమును త్యజించి, కారణ లయ మొంద, నింక వానిలో కార్యలక్షణములు లేకుండుటచే

కారణమున తమ గుణముల జేర్పజాలవు. ఇంకను కార్య గుణములే యున్నచో నది లయ మనిపించుకొనదు గదా!

పై విషయమును గ్రహింప కార్యకారణ సంబంధము కొంచెము బోధపడవలెను. అందుచే సూత్రకారుడే 2.1.14 నుండి 2.1.19 వరకుగల సూత్రములలో చర్చించి యున్నాడు. వేదాంత సిద్ధాంతము ననుసరించి కార్య కారణములకు అభేదము గలదు. ఎట్లన, ఆరంభణాది శ్రుతివాక్యములు కార్యమైన జగత్తునకును, కారణమైన బ్రహ్మమునకును, అనగా కార్య కారణములకు అభిన్నత్వమును నిర్ధారణ మొనరించియున్నవి. (వే.సూ 2 1.14) ఎందుచేతనన 'భావే చోపలబ్ధేః భావే చ' (వే.సూ. 2.1.15) కారణమున్నప్పుడే కార్యము గోచరము. ఉత్పత్తికి పూర్వము కార్యము కారణమున కారణరూపమునే యుండు ననియు 'సత్వాచ్చాపరస్య' (వే. సూ. 2.1.16) సూత్రార్థము. 'అసద్వ్యపదేశాన్నేతిచేత్' (వే. సూ. 2.1.17) అసత్తునుండి సృష్టి కలిగియున్నదనుచో, 'ధర్మాంతరేణ, వాక్యశేషాత్' (వే. సూ. 2.1.17) అనూపస్థితిలో అసచ్ఛబ్దమునకు అవ్యక్తమని యర్థమగుటచే నవ్యక్తమునుండి సృష్టి గలిగెనని తాత్పర్యము. అనగా కార్యము కార్యరూపమున లేని అవ్యక్తమునుండి యుద్భూతము అని గ్రాహ్యము. ఎట్లన 'పటవచ్చ' (వే. సూ. 2.1.19) వస్త్రము మడతలనుండి నవ్యక్తమై యందుండు చిత్రాదులను గోచరింపచేయకనుండి, విడదీయుటతో వ్యక్తమై తన

యందుండు చిత్రాదికమునుగూడ వ్యక్తపరచినట్లుగ నుదాహరించి సూత్రకారులు వివరించిరి. అందుచే కార్యకారణములకభేదము సిద్ధించుటచే కారణమువినా కార్యమభావమనునట్లు, బ్రహ్మమువినా జగత్తు అభావముగా నుండును. ఎట్లు 'ప్రకాశాద వచ్చావైశేష్యం ప్రకాశశ్చ కర్మణి, అభ్యాసాత్' (వే. సూ. 3.2.25) బింబ ప్రతిబింబములకు గల సంబంధమే బ్రహ్మ జగత్తుల కున్నదని భావము.

లోక వ్యవహారమున నిమిత్తోపాదాన కారణములు అన్యములై నిమిత్తుని ద్వారా ఉపాదానము కార్యరూపము దాల్చుట గలదు. కాని బ్రహ్మమే రెండు కారణము లగుట ఎట్లు అని సంశయించి, 'క్షీరవద్ధి' (వే. సూ. 2.1.24) పాలు పెరుగగుటలో అన్యాపేక్ష లేదని సమాధాన మొసంగెను. ఉష్ణత్వాదులు సహకారులు మాత్రమే యగుచున్నవి. కాని క్షీరాదులు అచేతనములు గాన రూపాంతరము పొందును. అనగా ఉపాదానము కార్యమగును గాని చేతనమైన నిమిత్తము కార్యరూపము దాల్చుట గానముగిదా యను సందేహమును, పురాణముల ననుసరించి, దేవతలు ఋషీశ్వరులు కార్యముల సృజించునట్లు బ్రహ్మము బాహ్యముగ ఉపాదానమునకై అన్యపదార్థాపేక్ష లేకయే తనంతటతానే యంతయు సృజించునని నివారించును. అయినను తానే మియు వికారము చెందడని 'కృత్స్న ప్రసక్తిర్నిరవయవత్వ శబ్దకోపో వా' (వే. సూ. 2.1.26) అను సూత్రమున నిరవయవముగాన, బ్రహ్మము వికారము చెందునుగదా యను

పూర్వపక్షమునకు, సమాధానముగ 'శ్రుతేస్తు, శబ్దమూల త్వాత్' (వే సూ. 2.1.27) సృష్టికి బ్రహ్మము మూలమైనను బ్రహ్మము వికారము పొందనేరదు. వికారము కేవలము కల్పితముగనే యుండునుగాని సత్యముగాదు అని తీర్మానించును. ఈ తీర్మానమునకు బలముచేకూర్ప 'ఆత్మని చైవం విచిత్రాశ్చ హి' (వే. సూ. 2.1.28) జీవుడు స్వప్నమునను, ఇంద్రజాలికుడు మాయచేతను బహుళ సృష్టుల పచరించినను వారు నిర్వికారముగనే యుండునట్లు అని ఉదాహరణమును ప్రదర్శించెను.

అందుచేత 'సర్వోపేతా చ తద్దర్శనాత్' (వే. సూ. 2.1.30) బ్రహ్మము సర్వశక్తులు గలిగి యుండుటచేతను, 'సర్వధర్మోపపత్తేశ్చ' (వే. సూ. 2.1.37) సృష్టి కావశ్యకమగు సర్వలక్షణము లాతనికి యుండుటచేతను, 'న ప్రయోజనవత్వాత్' (వే. సూ 2.1.32) తన కెట్టి ప్రయోజనము సృష్టివలన లేకున్నను, అనగా ప్రయోజనాపేక్ష లేకయే, 'లోకవత్తు, లీలాకైవల్యం' (వే. సూ. 2.1.33) లోకమునందువలె బ్రహ్మము సృష్టిని లీలామాత్రముగా కల్పించెను. అనగా నకారణ ప్రవృత్తితో బ్రహ్మము అనంతసృష్టిని గల్పించెనని తాత్పర్యము.

పై భావమునకు వ్యతిరేకమగు సాంఖ్య వైశేషికాది సర్వసిద్ధాంతములు ద్వితీయాధ్యాయమున ద్వితీయపాదమున ఖండింపబడి సర్వవిధముల నవి ఆక్షేపణీయములుగా నిరసింప

ఇక సృష్టివిధానమునుగూర్చి విచారించెదము గాక! ఛాందోగ్యమున ఆకాశ వాయువుల యుత్పత్తిని ప్రసంగింపక 'తత్తేజో సృజత' అని వచింపబడినందువలన ఆకాశము ఉత్పాద్యము గాదని అది నిత్యమని భావింపనగును. కాని తైత్తిరీయశ్రుతి 'ఆత్మన ఆకాశస్సంభూతః' అని వచించు చుండుటచే, ఆకాశము ఉత్పన్నముగ తాత్పర్యము అని 2.3.6 సూత్రము తెలుపుచున్నది. అట్లే వాయువుగూడ కార్యరూపమే యని 'ఏతేన మాతరిశ్వా వ్యాఖ్యాతః' (వే. సూ. 2.3.8) నిర్ణయించుచున్నది. అనగా తైత్తిరీయము ననుసరించి ఆత్మనుండి యాకాశము జనింప నందుండి వాయువు యుద్భవించెను. 'తేజోఽతః తథాహ్యాహ' (వే. సూ. 2.3.10) వాయువునుండి తేజస్సు జనించినట్లు శ్రుతివచనము. ఆ యగ్నినుండి 'ఆపః' (వే. సూ. 2.3.11) జల ముద్భవము. అటులే 'పృథివీ అధికారరూప శబ్దాంతరేభ్యః' (వే. సూ. 2 3.12) 'అద్భ్య పృథివీ' అను తైత్తిరీయము ననుసరించి జలమునుండి పృథ్వీసంభవము. దానినుండి ఓషధాదిక సృష్టియంతయు జరిగెను.

పూర్వోక్త భూతసృష్టివలెనే, 'తథా ప్రాణాః' (వే. సూ. 2.4.1) బ్రహ్మమునుండి ప్రాణాదు లుద్భవించెను. 'ఏతస్మాజ్జాయతే ప్రాణో మనస్సర్వేంద్రియాణి చ' (ము. 2.1.3) బ్రహ్మమునుండియే ప్రాణ మనస్సు యింద్రియములు పుట్టొందినట్లు స్పష్టము. అంత 'సప్త గతేర్విశేషితత్వాచ్చ' (వే. సూ. 2.4.5.) సప్తేంద్రియములు, నాబడు

జ్ఞానేంద్రియ పంచకము మనోప్రాణములు గలిసి సప్తక ముద్భవించెనని యర్థము. ఇందు కర్మేంద్రియాదులు సూచింపబడలేదు. ఇట్లు సృజింపబడియున్న ఇంద్రియములు 'అణవశ్చ' (వే. సూ. 2.4 7) అణుపరిమాణములు. వానిలో 'శ్రేష్ఠశ్చ' (వే. సూ. 2.4 8) ప్రాణము శ్రేష్ఠముగ బరిగణింపబడినది. ప్రాణము వాయువు కాదు. (వే. సూ. 2.4.9) ప్రాణము చక్షురాదికముతో గూడ ప్రస్తావింపబడుటచే ఆత్మాధీనము. (వే. సూ. 2.4.10) ఆప్రాణము 'పంచవృత్తిర్మనోవద్వ్యపదిశ్యతే' (వే. సూ. 2.4.12) మనస్సు, మనోబుద్ధిచిత్తాహంకారములవలె విభజింపబడి యున్నటుల, ప్రాణము, ప్రాణ అపాన వ్యాన ఉదాన సమాన రూపమున పంచవిధములుగా విభజింపబడియున్నది. ఈప్రాణముగూడ అణుమాత్ర పరిమాణము గలిగియే యున్నది. (వే. సూ. 2.4 13) 'సంజ్ఞామూర్తిక్లృప్తిస్తు త్రివృత్కుర్వతః ఉపదేశాత్' (వే. సూ, 2.4.20) శ్రుతులు వచించునట్లు నామరూపములుగూడ నాబ్రహ్మమువలన జనితమే యగుచున్నవి. మరియు నిట్లు సర్వసృష్టికి నాధారము బ్రహ్మమే యగుచుండ నిక మాంసాదికము మాటయేల? అయినను 'మాంసాది భౌమం' (వే. సూ. 2.4.21) మాంసాదికము పృథ్వీజనితముగ సూత్రీకరింపబడియున్నది.

ఈవిధముగ సర్వసృష్టియు నాయఖండమును ననంతమును, నిర్వికారమును, నిరాకారమును అగు బ్రహ్మము నుండియే జనితమని గ్రాహ్యము. కాని దానివలన బ్రహ్మము

పరిణామమునుగాని వికారమునుగాని నొందక, తన స్వస్థ స్థితినే యున్నట్లును తాత్పర్యము.



## జీవుడు

ఇంతవరకు బ్రహ్మ జగత్తులగూర్చి యోచించి యుంటిమి. ఈజగత్తున కర్తగ భోక్తగనుండి, బ్రహ్మేతర చైతన్యముగ గోచరించు జీవుని విషయము గ్రహింప వలెను. సర్వాతీతమైన బ్రహ్మవిషయమునకే సుఖదుఃఖా దిక బాధయులేదు. అట్లే జడాత్మకమగు ఆకాశాది సృష్టి కిని యది అచేతనమగుట సుఖదుఃఖాదికమగు అనుభవము అభావము. ఈరెండింటికి మధ్యనున్నటుల గానుపించు జీవునికే సర్వానుభవమగుట చేతను, శాసనకర్తయగు వేదము కూడ నతనికై ప్రవృత్తమై అతని ప్రవృత్తిని క్రమమొనర్ప విధినిషేధముల నియమించుటయు, నీజడ ప్రకృతియును నాతని అనుభూతికొరకై యున్నటుల దోచుచుండుటయు, మొదలగు కారణములచేత, బ్రహ్మ సృష్టులకంటె నీజీవుడే అతి ప్రధాన తత్త్వముగ వెలుగొందియున్నాడు. ఆతని స్వరూప నిర్ణయముతో సర్వజ్ఞాన నివృత్తి యేర్పడి బ్రహ్మ ప్రాప్తి నాబడు కైవల్యస్థితి యేర్పడును గాన జీవ విషయ మీమాంస అత్యవసరమై యొప్పారుచున్నది. అతని జ్ఞానా జ్ఞానములమీదనే సర్వశాస్త్రములు ఆధారపడి ప్రవృత్తించు

చున్నవి. కాన జీవ విషయ మొకించుక విచారించెదము గాక.

పూర్వచర్చా సారాంశముగ సుఖదుఃఖానుభూతి నిస్సంగుడును సర్వాతీతుడును అగు బ్రహ్మమునకుగాని జడమగు శరీరాదికమునకు గాని యుండజాలదు. అందుచే వాని 'కర్తా. శాస్త్రార్థవత్త్వాత్' (వే.సూ.2.3.33) శాస్త్రార్థమువలన నతడే కర్తయని తెలియుచున్నది. ప్రత్యక్షముగ నింద్రియముల సంబంధమున నున్న జాగ్రదవస్థయందే గాక 'ఉపాదానాత్' (వే సూ. 2 3.35) స్వప్నస్థితిలో గూడ నింద్రియవృత్తుల స్వీకరించి 'విహారోపదేశాత్' (వే. సూ. 2 3.34) విహరించుచు, 'వ్యపదేశాచ్చ క్రియాయాం' (వే. సూ. 2.3.36) శ్రుతులుగూడ వాకొనుటచే సర్వకర్మ కర్తయగుచున్నాడు. ఈ ఆత్మకర్తృత్వము, జాగ్రత్స్వప్నములలో మాత్రమేగాక 'సతోఽభివ్యక్తియోగాత్' (వే. సూ. 2 3.31) జాగ్రదవస్థకు పునరాగమన ప్రసక్తిచే సుషుప్తియందును, 'సమాధ్యభావాచ్చ' (వే.సూ. 2.3.39) కర్తకానిచో సమాధి లేకుండునుగాన సమాధియందునుగూడ జీవుడే కర్తయై విరాజిల్లుచున్నాడు. అట్లు కర్తృత్వప్రాప్తి నొందియుండుటచే జీవుడు 'ప్రాణవతా శబ్దాత్' (వే. సూ, 2.4.15) ప్రాణసంబంధి యగుటచే సర్వభోక్తయు గూడ నగుచున్నాడు. అనగా సర్వేంద్రియ కర్తృత్వముతో సహా నతడు సర్వేంద్రియ వ్యాపారఫలములగు సుఖదుఃఖాదికమునుగూడ బొందినవాడగుచున్నాడు.

ఈ జీవుడు 'పరాత్తు తచ్ఛ్రుతేః' (వే. సూ. 2.3.41) తన కర్తృత్వమును ఈశ్వరానుగ్రహమువలననే పొందిన వాడై సుఖదుఃఖాది యనుభవమును బొందుచుండును. కాని కర్మ కర్తృకశక్తిని ప్రసాదించిన పరమేశ్వరుడు జీవుని 'కృతప్రయత్నాపేక్షస్తు విహిత ప్రతిషిద్ధావైయర్థ్యాదిభ్యః' (వే సూ.2.3.42) కర్మాధీనునిగా జేసియుండుటచే శ్రుతిప్రోక్త విధి నిషేధకర్మ యుపయుక్త మగుచున్నది. ఈ జీవుడు దేహధారియై యుండుటచేతనే విధి నిషేధములు గలవని 'అనుజ్ఞా పరిహారౌ దేహ సంబంధాత్' (వే. సూ. 2.3.48) సూత్రముయొక్క తాత్పర్యము.

ఇతడు 'జ్ఞోఽత ఏవ' చైతన్యస్వరూపుడై 'పృథగుపదేశాత్' (వే. సూ. 2.3.28) సూత్రవచనము ననుసరించి చూడ ప్రజ్ఞారూపుడై శరీరమునంతటి నావరించియుండును. కాని యతడు 'తద్గుణసారత్వాత్ తు' (వే. సూ. 2 3.29) బుద్ధివలె నణువుగను, 'ఉత్క్రాంతి గత్యాగతీనాం' (వే. సూ. 2.3.19) లోకాంతరగమన ముండుటచేత పరిగణింపబడుచున్నాడు. అంతియగాక నతడు అణుస్వరూపుడుగ 'స్వశబ్దోన్మానాభ్యాం చ' (వే. సూ. 2.3.22) శ్రుతులు గూడ 'ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యః'(ముండక.3.1.9) అణుస్వరూపుడగు ఆత్మ చిత్తముచే గ్రహింపదగినవాడనియు 'వాలాగ్రశతభాగస్య శతధా కల్పితస్య తు జీవో భాగస్స విజ్ఞేయ' (శ్వే.తా. 5.9) నూరుప్రకారములుగ విభజింపబడిన

గలవాడు అనియు శ్రుతివాక్యములు వచించుచున్నవి. అతడట్లు అణుపరిమాణుడై యున్నను, 'అవిరోధశ్చందన వత్' (వే. సూ. 2.3.23) శరీరమున నొకభాగమున నుప యోగింపబడిన చందనము శరీరమున కంతటికి శీతము చేకూర్చుచందము, ఆత్మశరీరమునంతటి సుఖదుఃఖాదిక అను భూతికి కారణమగుచున్నాడు. లేక 'గుణాద్వా లోకవత్' (వే. సూ. 2.3.25) లోకమున దీపిక గృహమునంతటిని ప్రకాశింపజేయునట్లు ప్రజ్ఞాస్వరూపమగు ఆత్మ అణువయ్యును శరీరమునంతటిని చైతన్యమొనరించును. అదేభావమును 'తథా చ దర్శయతి' (వే. సూ. 2.3.27) శ్రుతులు 'ప్రజ్ఞయా శరీరం సమారుహ్య' (కౌ. 3.6) ప్రజ్ఞచేత జీవుడు శరీరమున బ్రవేశించుననియు 'ఆలోమభ్య ఆనఖాగ్రేభ్యః' (కౌ. 4.20) నఖశిఖ పర్యంతము ఆక్రమించి యుండుననియు తెలుపుచున్నట్లు 'పృథగుపదేశాత్' (వే. సూ. 2.4.28) సూత్రముకూడ బోధించుచున్నది.

ఇట్లు దేహగతుడైన జీవుడు ప్రాణోత్క్రమణ సమయమున 'తదంతర ప్రతిపత్తౌ రంహతి సంపరిష్వక్తః' (వే. సూ. 3 1.1) జీవుడు సూక్ష్మ శరీరప్రాప్తి నపేక్షించి సూక్ష్మభూత పరివృతుడై యీ శరీరత్యాగ మొనర్చును. 'ప్రాణగతేశ్చ' (వే. సూ. 3.1.3) ప్రాణాది యింద్రియ ప్రవృత్తులను వెంబడించుటచే తత్కారణములగు సూక్ష్మ భూతములును వెంటాడునని గ్రాహ్యము. తర్వాత పుణ్య పాపకర్మ ఫలితముల స్వర్గ నరకాదుల ననుభవించి 'క-తా

త్యయేఽనుశయవాన్, దృష్టస్మృతిభ్యాం, యథేత మనేవం చ' (వే. సూ. 3.1.8) పుణ్యకర్మ తరిగిపోవ, నైమిత్తికకర్మ సహితులై పునరావృత్తి నొందుచున్నారు. ఈ విషయము 'తస్మిన్యావత్సంపాత ముషిత్వాఽథైత మేవాధ్వానం పునర్నివర్తంతే యథేత' (ఛాం. 5.10.5) జీవులు చంద్ర మండలమందు భోగకారణ కర్మ క్షయించునంతవరకు సూక్ష్మ భూత నిర్మిత శరీరముతో ననుభవించి, అంత, వెళ్ళిన విధం బున, తిరిగి వచ్చుచున్నారు. ఎట్లన 'రమణీయచరణా బ్రాహ్మణాది యోనిమాపద్యంతే కపూయచరణాశ్వాది యోనిః' (ఛాం. 5.10.7) పుణ్యకర్మ శేషమున్నవారు బ్రాహ్మణాది జన్మలను, పాపకర్మ శేషులు అశ్వాది గర్భముల జననమును పొందుదురని ఛాందోగ్యశ్రుతియే వాకొను చున్నది. యజ్ఞయాగాది పుణ్యకర్మము నాచరించినవారు స్వర్గమునుండి పునరావృత్తి నొందుచుండ, పాపకర్ములు యమలోకము నొంది (వే. సూ. 3.1.13) పాపకర్మ క్షయానంతరమున పునరావృత్తి నొందెదరని గ్రాహ్యము. 'అపి చ సప్త' (వే. సూ. 3 1.15) నరకములు సప్త సంఖ్యగ నున్నవని 'స్మరంతి చ' (వే. సూ. 3.1.14) యమలోక ప్రాప్త్యనంతర జన్మమునుస్మృతులుగూడ వక్కా ణించుచున్నవి.

అట్లు ఊర్ధ్వలోక భోగానంతరము జనించు జీవుడు పంచసోపానముల జనించుచున్నాడు, దానినే పంచాగ్ని యందురు. ఈవిషయము 'న తృతీయే, తథోపలబ్ధేః'

(వే. సూ. 3 1.17) ఒక్క పాపకర్ముల కన్వయింపదు. వారు మరల ప్రథమాగ్నియగు చంద్రలోకమును పొందకయే జనించెదరు. ఛాందోగ్యము ననుసరించి జీవరూపమున నున్న 'అండజ జీవజ ముద్భిజ్జ మితి' (వే. సూ. 6.3.1) అను త్రివిధ ప్రాణులును, చంద్ర, పర్జన్య, పృథ్వి, పురుష, స్త్రీ రూపమైన పంచాగ్నులద్వారా (వే. సూ. 5.4.1, 5. 8.1) జనన మొందును.

కాని అనగా జీవుడు పై విధానమున జనన మరణ రూప వికారములను, సుఖదుఃఖరూప అనుభూతులను పొందుచున్నటుల కానుపించుచున్నను యథార్థముగ పూర్వోక్తరీతి 'జ్ఞోఽత ఏవ' (వే. సూ. 2.3.18) ప్రజ్ఞాన స్వరూపుడై యుండుటయేగాక, 'సంధ్యే సృష్టిరాహ హి' (వే. సూ. 3.2.1) సంధ్యావస్థనాబడు స్వప్నమునగల సృష్టి కాలమునను, 'తదభావో నాడీషు' (వే. సూ. 3.2.7) అదియు లేనిచో నాడీమండలమున జీవుడుండునను సుషుప్తి యందును, 'అతః ప్రబోధోఽస్మాత్' (వే. సూ 3.2.8) సుషుప్తినుండి ప్రబోధావస్థ యనబడు జాగ్రత్తయందును ఆయాత్మయే సామాన్యముగనుండి 'స ఏవ తు కర్మాను స్మృతి శబ్దవిధిభ్యః' (వే. సూ. 3.2.9) కర్మ స్మృతి ననుసరించి, శ్రుతిస్మృతులు వాకొనురీతి ఆయాత్మయే సుషుప్త్యాదులనుండి తిరుగుచుండుటచేతను, 'చరాచర వ్యపాశ్రయస్తు స్యాత్ తద్వ్యపదేశో భాక్తః, తద్భావ భావితాత్' (వే. సూ. 2.3.16) జీవునకు జనన మరణములు

లనగా చరాచరములకుగల ఉపాధిరూప దేహములనియు, కాని ఆత్మవిషయము నాపుట్టుచావులు, దేహాధారము లగుటచే గౌణములనియు సూత్ర తాత్పర్యమగుటచే 'నాత్మా, శ్రుతేర్నిత్యత్వాచ్చ తాభ్యః' (వే. సూ. 2. 3.17) శ్రుతులు ఆత్మ జననముగూర్చి వచింపకుండుట చేతను, మరియు నాత్మ నిత్య మగుటచేతను ఆత్మ జనన మరణాది వికారముల పొందక నిత్యమైయున్నది. మరియు నది 'ఆభాస ఏవ చ' (వే. సూ. 2 3.50) పరబ్రహ్మ స్వరూపముయొక్క ప్రతిబింబముగనే యుండుటయు స్పష్టము. బింబ ప్రతిబింబములకు ఉపాధిసంబంధ భేదము ఒప్పారి తత్త్వతః వ్యత్యస్త మభానమైనట్లు ఆభాసరూప జీవునకును, ఆభాసకాధారమై యధిష్ఠానమైయొప్పు బ్రహ్మమునకు తత్త్వతః అభేదము నగు 'ఉత్తరాచ్చేత్, ఆవిర్భూత స్వరూపస్తు' (వే. సూ. 1.3.19) ఆత్మ నిజస్వరూపము గోచరము. బ్రహ్మ జీవ భేదరాహిత్యమును 'ప్రకాశాది వచ్చావైశేష్యం ప్రకాశశ్చ కర్మణి, అభ్యాసాత్' (వే. సూ. 3.2.25) సూర్య బింబ ప్రతిబింబముల కభేదమై యున్నట్లు అవ్యక్త బ్రహ్మమునకును, వ్యక్త బ్రహ్మమైన జీవునకును అభేదము. ఇది శ్రుతి ప్రమాణ సిద్ధము. ఆ రెండింటికి అభిన్నత్వ ముండుటచేతనే 'అతో అనంతేన, తథా హి లింగం' (వే. సూ. 3.2.26) జీవుడు ముక్తస్థితిలో బ్రహ్మైక్యమును పొందగలుగుచున్నాడు.

కాని, వ్యక్తావస్థలో 'ఉభయవ్యపదేశాత్యహి కుండలవత్' (వే. సూ. 3 2 27) జీవబ్రహ్మములకు ఉపాధితః భేదము తత్త్వతః అభేదము బోధింపబడుటచే సర్పము దాని కుండలాకృతికిగల సంబంధము గలదని గ్రాహ్యము. అనగా విస్తరించియున్న సర్పము ముడుచుకొని యున్నటుల, సువిశాల బ్రహ్మము జీవరూపము దాల్చెను గుణభేదము బాహ్యగోచరముగాని తత్త్వతః ఉభయము ఏకమే యగుచున్నవి, లేక 'ప్రకాశాశ్రయవద్వా, తేజస్త్వాత్' (వే. సూ. 3.2.28) ప్రకాశ జ్యోతి సంబంధమువంటిది జీవ బ్రహ్మ బాంధవ్యమనియు సూచింపబడియున్నది. కాని 'ప్రతిషేధాచ్చ' (వే. సూ. 3.2. 30) జీవ బ్రహ్మభిన్నత్వమునకు ప్రతిషేధ వాక్యములు లేకుండుటయుగాక 'నాన్యోఽతోఽస్తి ద్రష్టా' (బృ. 3.7,23) మొదలగు శ్రుతులు అచ్చట మరొక ద్రష్టయొక్క యభావమును సూచించుచుండుటచేతను 'పూర్వవద్వా' (వే. సూ. 3.2.29) పూర్వము పదేశింపబడిన చందము జీవ బ్రహ్మములకు భేదాభేదము గాక సంపూర్ణాభిన్నత్వమే యని తెలియుచున్నది.

ఈ విధముగ జీవుడు కేవలము బ్రహ్మభిన్న పదార్థమై చిదాభావరూపమున వెలుగొందుచు ఉపాధిగతుడై నటుల భాసించుచు యథార్థమున నిత్యశుద్ధ స్వరూపుడై వెలుగొందియుండునని వేదాంత దర్శన తాత్పర్యము.

## సాధన

అట్లు అయినను జీవుడు ఉపాధి గత నానాత్వము తోడను, ఉపాధిగుణ సముదాయము తోడను అధ్యాస పొంది యుండుటచేత తన స్వస్వరూప గ్రహణమునకు చేయ దగు కృషిని గూర్చి యాలోచించెదము.

సాధన విషయమును 'అథాతో బ్రహ్మ జిజ్ఞాసా' (వే సూ. 1.1.1) అను సూత్రముననే 'అథ' అను ప్రథమ పదముననే బాదరాయణ వ్యాసులు సూచించియున్నారు. అనగా నిచట అధికార నిర్ణయము గావింప, బ్రహ్మవిచార ణము గావింప నధికారి యైనవాడు బ్రహ్మజిజ్ఞాసకు బూన వలెనని వాకొనియున్నాడు. అథ శబ్దమున కేయర్థము నన్వయింపవలెనో యను విషయమున భాష్యకర్తలు కొంచెము విభిన్న భావముల ప్రదర్శించిరి. సాధన చతుష్టయ సంపత్తి యనంతరమని శంకరులును, వేదాధ్యయ నానంతర కర్మకాండానుష్ఠాన పర్యవసానమున యని రామానుజు లును, శమదమాది సాధన సంపత్తియు, శ్రీహరియొక్క శ్రవణ మననాది భక్తిసాధనములును అవసరమనియు మధ్వా చార్యుల వారును భావించిరి.

వేదవ్యాసుడును మూడవ అధ్యాయమున తృతీయ పాదమున వేదాంతములలో విద్యలుగా వ్యవహారములో గల ఉద్గీథ విద్య, ప్రాణవిద్య, శాండిల్యవిద్య, పురుషవిద్య, వైశ్వానరవిద్య మొదలగు ఉపాసనల జర్చించెను. ఈ ఉపాసనలనియు 'సర్వ వేదాంతప్రత్యయం. చోదనాద్య

విశేషాత్' (వే. సూ. 3 3.1) విభిన్నములు గావని తెలుపుచు, 'భేదాన్నేతిచేత్,న ఏకస్యామపి'(వే.సూ.3.3.2)అల్పభేదము లున్నను వ్యత్యస్తము కావని నిర్ణయించెను. 'విద్యాకర్మణోతి తు ప్రకృతత్వాత్' (వే.సూ.3.1.17) విద్య, కర్మలు అను మార్గద్వయము గలదు.అదియే ప్రకృతవిషయము అను సూత్రప్రోక్త విద్యా కర్మలలో యజ్ఞయాగాదికము కర్మమార్గమనియు, ఉద్గీథాది ఉపాసనా విధానము విద్యావిషయకమనియు తాత్పర్యము ఉపాసనాపద్ధతి జ్ఞానమార్గోపయుక్తము. కర్మమార్గ ఫలితములైన స్వర్గాదుల 'ఫలమతః ఉపపత్తేః' (వే. సూ. 3 2.38) నీశ్వరుడే ఫలప్రదాతయనియు, నట్లు భావించుటయే యుచితమనియు, 'శ్రుతత్వాచ్చ' (వే. సూ. 3.3 39) శ్రుతులు అట్లే వాకొనుచున్నవనియు నిర్ణయము. కర్మకు గారణముగూడ నీశ్వరుడే యగుటచే ఫలప్రదాతయు నాతడే యని బాదరాయణుడు 'పూర్వం తు బాదరాయణః, హేతువ్యపదేశాత్' (వే.సూ. 3.2.41) అను సూత్రము ముఖతః తీర్మానించెను.

కర్మ జ్ఞానమార్గముల బరిశీలించి, 'అధికోపదేశాత్తు బాదరాయణస్యైవం, తద్దర్శనాత్' (వే. సూ. 3.4.8) వేదాంతము కర్మమార్గమువలె కర్మ కర్తను ప్రతిపాదింపక, పరబ్రహ్మము నుపదేశించుననియు, నదియే బాదరాయణ భావమనియు, 'తుల్యం తు దర్శనం' (వే. సూ. 3.4.9) శ్రుతివాక్యములు ఉభయమార్గముల బలపరుచుచున్నవనియు వేదాంతము తెలుపుచున్నది. అందుచే కర్మజ్ఞానములు

రెండును గలిసి జీవు ననుసరించుననుట (వే. సూ. 3.4 5) గాక 'విభాగః శతవత్' (వే.సూ. 3.4.11) జ్ఞాన కర్మలు విభజ్యములని గ్రాహ్యములు. వేదజ్ఞానికి కర్మనియమము (వే. సూ. 3.4.6) గాక 'అధ్యయనమాత్రవతః' (వే. సూ. (3.4 12) వేదాధ్యయనపరునకు మాత్రము కర్మప్రవృత్తియు తత్సంబంధ నియమము గలదుగాని, 'న, అవిశేషాత్' (వే. సూ. 3.4.13) జ్ఞానికి అభావమని జ్ఞాన కర్మ విభేదము వివరింపబడియున్నది. మరియు కర్మ 'ఆచారదర్శనాత్' (వే. సూ. 3.4 3) జ్ఞానులుగూడ కర్మాచరణ గావించి యున్నను, 'కామకారేణ చైకే' (వే. సూ. 3.4.15) కొందరు కర్మను త్యజింప నిచ్ఛగించిరి. అనగా జనకాదులు జ్ఞానులయ్యుండియు కర్మానుష్ఠానపరులుగా నుండియున్నను, జ్ఞానుల కది నియమము గాదనియు, కర్మ త్యాగమే నియమ మనియు గ్రాహ్యము. అంతియగాక 'ఉపమర్దం చ' (వే. సూ. 3.4.16) కర్మరతి జ్ఞానమును నశింపచేయునని శ్రుతి యర్థము.

అట్లైనచో సర్వకర్మ త్యాగమే జ్ఞానియొక్క లక్షణమే యగుచో నది సర్వసంగ సన్న్యాసమే యగును. ఈ విషయమును 'ఊర్ధ్వరేతస్సు చ, శబ్దేహి' (వే.సూ. 3.4.17) ఊర్ధ్వరేతస్కులైన సన్న్యాసులకే జ్ఞానముండునని, అట్టి తురీయాశ్రమమును శాస్త్ర ముపదేశించుచున్నదనియు వేదాంతసూత్ర పాఠము. సన్న్యాసమును శాస్త్రము పరామర్శించునేగాని నియమింపదనియు కొన్ని శ్రుతులు ఖండించు

చున్నవనియు (వే. సూ. 3.4 18) జైమిని భావింప 'అను ష్ఠేయం బాదరాయణః, సామ్యశ్రుతేః' (వే.సూ. 3.4.19) సన్న్యాసము తప్పక అనుష్ఠేయమని బాదరాయణుడు నిర్ణ యించెను. అంతియగాక 'విధిర్వా ధారణవత్' (వే.సూ. (3.4.20) అగ్నిహోత్రధారణ విధివలె, సన్న్యాసము విధేయ మనియు నతడు వాదించెను.

సన్న్యాసి 'అత ఏవ చాగ్నీంధనా ద్యనపేక్షా' (వే. సూ. 3.4.25) జ్ఞానియగువాడు అగ్నిహోత్రాది కర్మల జేయవలసిన అవసరము లేదు. కాని 'శమదమాద్యుపేతః స్యాత్తథాపి తు,' (వే.సూ. 3.4.27) శమదమాదుల గలిగి, నిషిద్ధాహారమునుత్యజించుచు, (వే.సూ. 3.4.28)నుండవలెను. 'అనభిభవం చ దర్శయతి' (వే. సూ. 3.4.35) బ్రహ్మ చర్యనిష్ఠుడు కోపాద్రిక్తుడు కాజాలడనుటచే బ్రహ్మచర్య వ్రత దీక్షితుడై సన్న్యాసియుండును. అంతియగాక జ్ఞానార్థి యగువాడు 'అనావిష్కుర్వన్, అన్వయాత్' (వే సూ. 3.4.50) అమాయికమైన శిశుస్థితిని అపేక్షించుచుండ వలెను. అట్లు కృషిసల్పుచుండ 'ఐహికమప్యప్రస్తుత ప్రతి బంధే, తద్దర్శనాత్' (వే. సూ. 3.4.51) ఆటంకములు లేనిచో యీజన్మముననే జ్ఞానప్రాప్తి సిద్ధించును.

అట్టి జ్ఞానప్రాప్తికి 'ఆవృత్తిః, అసకృదుపదేశాత్' (వే. సూ. 4.1.1) శ్రవణ మనన నిదిధ్యాసనములు శ్రుతు లచే బోధితములుగాన నవి అవశ్య మనుష్ఠేయములు, ధ్యానకాలమున 'ఆత్మేతి తూపగచ్ఛంతి గ్రాహయంతి చ'

(వే. సూ. 4.1.3) శ్రుతి జీవ బ్రహ్మైక్యమును బోధించు చున్నదికాన, తానే బ్రహ్మమని భావింపవలెను. అట్లుకాక బ్రహ్మస్థానమున ప్రతీకమునే యుపయోగించుచో, 'నప్రతీకే, న హి సః' (వే. సూ. 4.1.4) ప్రతీకయందు ఆత్మత్వ భావన గావింపక 'బ్రహ్మదృష్టిః, ఉత్కర్షాత్' (వే. సూ. 4.1.5) బ్రహ్మమును ప్రతీకముగా నెంచక ప్రతీకమునే బ్రహ్మముగా భావింపవలెను. ధ్యానకాలమున నెల్లప్పుడు 'ఆసనః, సంభవాత్' (వే. సూ. 4.1.7) కూరుచుండియే యుండవలెను. 'ధ్యానాచ్చ' (వే. సూ. 4.1.8) ధ్యానము ఆసీనునికే లభించును. పృథ్వివలె నచలరూపుడై ధ్యానింపవలెనని 'అచలత్వం చాపేక్ష్య' (వే. సూ. 4.1.9) అను సూత్ర ముపదేశించుచున్నది. 'యత్రైకాగ్రతా తత్ర, అవిశేషాత్' (వే. సూ. 4.1.11) అను సూత్రము స్థాన నిర్దేశము సేయక, ఎచ్చట ఏకాగ్రత లభించునో అచ్చట ధ్యాన మభ్యసింప వచ్చునని బోధించుచున్నది. ఇట్లు ధ్యానాభ్యాసమును, 'అప్రాయణాత్, తత్రాపి హి దృష్టం' (వే. సూ, 4.1.12) మరణ పర్యంత మాచరింపవలెను. 'పరాభిధ్యానాత్తు తిరోహితం తతోహ్యస్య బంధ విపర్యయే' (వే. సూ. 3.2.5) ఇట్లు బంధమోక్షములకు కారణభూతుడైన పరబ్రహ్మధ్యానమును, 'ఆనందాదయః ప్రధానస్య' (వే. సూ. 3.3.11) బ్రహ్మము యొక్క ఆనందాది ప్రధాన లక్షణములతో సమ్మేళన మొనరించి గావించుచో 'అపి చ సంరాధనే, ప్రత్యక్షానుమా

నాభ్యాం' (వే. సూ. 3.2 24) శ్రుతి స్మృతుల వచనము రీతి పరిపూర్ణ ధ్యాననిష్ఠలో బ్రహ్మము ప్రత్యక్ష గోచరమగును. అంత 'అతో అనంతేన తాథా హి లింగం' (వే. సూ. 3.2.26) శ్రుతులు చెప్పువిధమున జీవుడు బ్రహ్మముతో నైక్యము నొందుచున్నాడు.

ఆ విధముగ జ్ఞానియైనవాడు 'తదధిగమ ఉత్తర పూర్వాధయోరశ్లేష వినాశౌ తద్వ్యపదేశాత్' (వే. సూ. 4.1.13) శ్రుతులును బోధించురీతి ఆగామి సంచిత కర్మల నుండి విముక్తుడై, 'ఇతరస్యాప్యేవ మసంశ్లేషః' (వే. సూ. 4.1.14) సత్కర్మఫల పుణ్యమునుండియు విముక్తుడై అనగా 'అనారబ్ధకార్యే ఏవ తు పూర్వే, తదవధేః' (వే. సూ. 4.1.15) అనారబ్ధకర్మము నశింప ప్రారబ్ధము మరణకాలమున నశించునుగాన, 'పాతే తు' (వే. సూ. 4.1.14) మరణ కాలమున విదేహ ముక్తి నొందుచున్నాడు.

---

## స్వర్గము

వేదాంతదర్శనమున, కర్మమార్గ ఫలితమైన స్వర్గము జ్ఞానమార్గ గమ్యమైన ముక్తియు వివరింపబడియున్నవి. 'భాక్త్యం వా నాత్మవిత్వాత్, తథా హి దర్శయతి' (వే. సూ. 3.1.7) ఆత్మజ్ఞాన రహితుడైనవాడు దేవతల కాహారముగా గౌణముగా నగుటకై యజ్ఞ యాగాది పుణ్యకర్మ

ననుష్ఠించి, 'విద్యాకర్మణోరితి తు ప్రకృతత్వాత్' (వే.సూ. 3.1.17) విద్యా కర్మమార్గములని వచింపబడిన ద్వివిధ మార్గములలో, తృతీయమగు పునరావృత్తి మార్గము ననుసరింపక, దేవయానము ననుసరించును. 'సమానా చా శ్రుత్యుపక్రమాత్, అమృతత్వతం చానుపోష్య' (వే. సూ. 4 2.7.) అజ్ఞుడును సగుణ బ్రహ్మోపాసకుడును ఉత్క్రమణానంతరము వారివారి మార్గము ప్రారంభమువరకు నేకముగనే యుండు మార్గమున నరుగుదురు. సగుణ బ్రహ్మోపాసకునికి అమృతత్వ మిచ్చుట సత్యముగాక గౌణముగనే వచింపబడి యున్నది, 'తదాఽపీతేః, సంసార వ్యపదేశాత్' (వే. సూ. 4.2.8) జ్ఞానముద్వారా నిర్గుణబ్రహ్మము నొందువరకు సూక్ష్మశరీర ముండునుగాన దానితో దేవయాన మార్గముల నా యుపాసకుడు ప్రవేశించును. 'సూక్ష్మం ప్రమాణతశ్చ, తథోపలబ్ధేః' (వే. సూ. 4.2.9) అనుభవము ననుసరించి చూచినచో నీ సూక్ష్మ శరీరము తత్త్వతః అతి సూక్ష్మమై యుండును. అందుచే 'నోపమర్దేనాతః' (వే. సూ.4.2.10) స్థూలశరీర నాశనమున నది నశింపదు. 'తదోకో గ్రజ్వలనం తత్ప్రకాశిత ద్వారః, విద్యా సామర్థ్యాత్ తచ్ఛేషగత్యనుస్మృతి యోగాచ్చ, హార్దానుగృహీతాః శతాధికయా' (వే.సూ.4.2.17) నాసగుణారాధకుని ఆత్మ ఉత్క్రమణ కాలమున, హృదయస్థానము ప్రకాశవంతమగును. ఈ ప్రకాశముచే మార్గము వికసింప, హృదయస్థితుడై యున్న పరమాత్ముని అనుగ్రహమున సుషుమ్నాద్వారా బహిర్గత

మగును. ఆ ధ్యానముగూడ జ్ఞానోపయుక్తమే యగు చున్నది. అంత నా ఆత్మ సూక్ష్మ శరీరస్థుడై 'రశ్మ్యను సారీ' (వే. సూ. 4.2.18) సూర్యకిరణముల ననుసరించును. 'నిశి న ఇతి చేత్ న, సంబంధస్య యావద్దేహ భావిత్వాత్, దర్శయతి చ' (వే. సూ. 4.2 19) రాత్రికాలమున మరణించియున్నను, నాడీమండలమునకును సూర్య కిరణములకును దేహమున్నంతవరకు నిత్య సంబంధముండుటచే జీవుడు ఆదిత్యకిరణముల పొందునని తాత్పర్యము. (వే సూ. 4.2 20)

—oo:o:oo—

## దేవయానము

సగుణ బ్రహ్మోపాసకులు, దేవయానము నాబడు అర్చిరాదిక మార్గముద్వారా బ్రహ్మలోకము నొందుదురని తెలుపుచు దాని వివరము నింకను వేదాంతదర్శనము తెలుపుచున్నది. 'అర్చిరాదినా, తత్ప్రథితేః' (వే. సూ. 4.3.1) అను సూత్రము వారికి బ్రహ్మలోక ప్రాప్తినే గమ్యముగా నిర్ణయించుచున్నది. 'వాయుమబ్దాత్, అవిశేష విశేషాభ్యాం' (వే. సూ. 4.3.2) సగుణ బ్రహ్మజ్ఞాని పై నుదాహరింపబడియున్న చందము సంవత్సరాధిష్ఠాన పురుషుని పొంది అంత వాయ్వధిష్ఠాన పురుషుని బొందును అని సూత్రము. అట 'తాడితోఽధి వరుణః, సంబంధాత్' (వే. సూ. 4.3.3) విద్యుదధిష్ఠాన దేవతను పొంది, తర్వాత విద్యుత్తుకు వరుణు

నికి సంబంధ ముండుటచే వరుణదేవతను పొందును. ఇట్లు యీ దేవతలు ఆపురుషుని 'ఆతివాహికాః' (వే.సూ.4.3.4) దేవయాన మార్గమును నధిగమింప జేయుదురు. యింద్రియ ములు లయించుటచే జీవులును, అచేతనములై యలరారుటచే నీమార్గమున, దేవతాసహాయముచగాక స్వతంత్రించియరుగ నేరరు. అటుపిమ్మట 'వైద్యుతేనైవ తతః, తచ్ఛ్రుతేః' (వే. సూ. 4 3.6) అంత విద్యుత్ సంబంధియగు అమానుష పురుషుడు జీవుని నడుపును.

ఆవిధముగ బ్రహ్మలోకమే దేవయానముయొక్క గమ్యమగుచున్నదని బాదరిమహర్షి సూక్తి. 'సామాన్యాత్ తు తద్వ్యపదేశః' (వే. సూ. 4.3.9) ఈవిధముగ సగుణ బ్రహ్మలోకప్రాప్తి పొందినవాని పరబ్రహ్మమును పొంది నట్లు వచింతురు. సగుణబ్రహ్మము పరబ్రహ్మమునకు సామీప్య స్థితి నుండుటయే అట్టి వ్యవహారమునకు కారణము. అంత కొంతకాలమునకు 'కార్యాత్యయే తదధ్యక్షేణ సహాతః పరం,' (వే. సూ. 4.3.10) బ్రహ్మలోక లయకాలమున అందుగల సగుణబ్రహ్మముతోసహా అంతకంటె పరమైన నిర్గుణ బ్రహ్మమందు జీవులు లయించెదరు. ఈవిషయ మును 'అభిధానాత్' (వే సూ. 4.3.10) శ్రుతి ప్రకటించు చున్నది. 'స్మృతేశ్చ' (వే. సూ. 4.3.11) స్మృతులుగూడ యీ విషయమును తెలుపుచున్నవి. ఇట్లు పరంపరాసంబంధము ద్వారా దేవయానగతులగు జీవులు పరబ్రహ్మమునే పొందెద రని జైమిన్యాచార్యుడు వచించియున్నట్లు 'పరం జైమినిః,

ముఖ్యత్వాత్' (వే. సూ. 4.3.12) అను సూత్రము వివరించుచున్నది. శ్రుతులుగూడ నదేవిషయమును తెలుపుచున్నట్లు 'దర్శనాచ్చ' (వే. సూ. 4.3 13) సూత్రము వ్యక్తపరచుచున్నది. ఆస్థితియైనను దేవయానము ననుసరించువారెల్లరుగాక 'అప్రతీకాలంబనా న్నయతీతి బాదరాయణః' (వే. సూ. 4.3.15) ప్రతీక సహాయము నపేక్షింపని సగుణ బ్రహ్మోపాసకులే నిర్గుణబ్రహ్మమును యీవిధముగ పొందుదురని బాదరాయణాచార్యుల అభిప్రాయము. బ్రహ్మలోకప్రాప్తి నొందిన జీవుడు 'సంకల్పాదేవ తు,' (వే సూ. 4.4.8) సంకల్పమాత్రముననే పితృలోకాదిక గమనమును చేయగలుగును. అనగ వారి సంకల్పము అజేయముగ నుండును, 'అత ఏవ చానన్యాధిపతిః' (వే. సూ. 4.4.9) అందుచేతనే తనకు అధిపతి లేకుండ అతడుండునని యర్థము. అక్కడ ముక్తులకు శరీరత్రయము లుండజాలవని బాదరి మహర్షి తలంప (వే. సూ. 4.4 11) 'భావం జైమినిః' గలవని జైమిని మహర్షి శ్రుతి ప్రమాణమున భావించును. ముక్తుడు 'ఉభయవిధం బాదరాయణోఽతః' (వే. సూ. 4.4. 12) తన యిష్టముప్రకారము శరీరేంద్రియములు గలిగిగాని లేకగాని యుండవచ్చునని బాదరాయణాచార్యుని నిశ్చయము. స్వప్నమునందువలె, శరీరేంద్రియాపేక్ష లేకయే కామిత మీడేరునని 'తన్వభావే సంధ్యవత్ ఉపపత్తేః' (వే. సూ. 4.4.13) అనుసూత్రము సయుక్తికముగ వివరించియున్నది. 'భావే జాగ్రద్వత్' (వే. సూ 4.4 14)

శరీరాదిక మున్నచో జాగ్రత్తువలె ననుభవముండును. అట్లు సగుణ బ్రహ్మప్రాప్తి నొందినవాడు సంకల్పసిద్ధు డగుటచే 'ప్రదీపవ దావేశః' (వే. సూ. 4.4 15) జ్యోతి నుండి జ్యోతు లుద్భవించునట్లు అనేకశరీరముల సృజింప జేయగల్గును. అంతియగాక 'జగద్వ్యాపారవర్జం,' (వే సూ. 4.4.17) వానికి జగత్సృష్ట్యాది శక్తివినా సర్వేతర శక్తులును లభించును. అతడికి సర్వశక్తులును రావని (వే. సూ. 4. 4.18) నిర్ణయించుచున్నది. 'వికారావర్తి చ తథా హి స్థితిమాహ' (వే. సూ. 4.4.19) సృజింపబడినవాని కన్నింటికి నతీతుడు పరబ్రహ్మమని శాస్త్రవచనము లగుటచే, 'భోగమాత్ర సామ్యలింగాచ్చ' (వే. సూ. 4.4.21) ముక్త బ్రహ్మములకు శక్తులతో సామ్యముగాక భోగమునందు మాత్రమే యని గ్రాహ్యము. ఆవిధముగ బ్రహ్మలోక ప్రాప్తి నొందినవారు 'అనువృత్తిః' (వే. సూ. 4.4.22) మరల జన్మపరంపరల బారిబడక జన్మరహితులై యుందురని వేదాంతదర్శన తాత్పర్యము.

---

## మోక్షము

ఇంతవరకు కర్మమార్గావలంబకులు పుణ్యసంపాదనా ఫలితముగ బ్రహ్మలోకప్రాప్తి నొందెదరని గ్రహించి యుంటిమి. ఇక నిర్గుణోపాసకుల విషయము చూచెదముగాక. నిర్గుణ బ్రహ్మోపాసన గావించి అజ్ఞాననివృత్తి పొందినవారు

'సాంపరాయే, తర్తవ్యాభావాత్,' (వే. సూ. 3.3.27) పుణ్య పాపవర్జితులై మరణకాలమున తమకు నిష్ప్రయోజన మగుటచే దేవయానము ననుసరింపరు. 'గతేరర్థవత్వ ముభయథా, అన్యథా హి విరోధః' (వే. సూ. 3.3.29) దేవయానము ద్వివిధముగ నన్వయింపనగును. అట్లుగాని-చో వైరుధ్యముగలుగును. సగుణబ్రహ్మోపాసకుడు పొందదగు బ్రహ్మలోకము దేశాంతరమున గలుగుటచే నటకరుగ ప్రయాణ మవసరముగాని, అజ్ఞాననివృత్తితో నిర్గుణబ్రహ్మే లయమొందు జీవునికి ఉత్క్రమణము యానము అనవసరము. అసంగతము. అభావ ముపపన్నమని 'ఉపపన్నః' (వే.సూ. 3 3.30) అనుసూత్ర మనువదించుచున్నది. అవసానకాలమున పూర్వోక్తరీతి వాక్కు చిత్తమునను (వే. సూ. 4.1.1) అట్లే సర్వేంద్రియములు చిత్తమున లయించును. (వే. సూ. 4.1.2) అంత మనసు ప్రాణమున లయించును. (వే. సూ. 4.2.3) మరల ప్రాణము సర్వాధ్యక్షుడైన జీవుని యందు లయించును. జీవుడు ప్రాణములతో భూతములందు లయించును. (వే. సూ. 4.2 5,6)ఆ లయము సంపూర్ణము కాక సూక్ష్మశరీరముగలిగి జీవుడుండునని పూర్వవిషయము. కాని సూక్ష్మశరీరము జ్ఞానప్రాప్తివరకే యుండునని 'తదాపీతేః సంసార వ్యపదేశాత్' (వే. సూ. 4.2.8) సూత్రముండుటచే. నిర్గుణ బ్రహ్మజ్ఞానికూడ 'ప్రతిషేధాదితి చేత్ న, శరీరాత్' (వే. సూ. 4.2.12) స్థూలశరీరమునుండి

ౖమణము గావించిన, 'తాని పరే,

తథా హ్యాహ' (వే. సూ. 4.2.15) ఆప్రాణములు పరబ్రహ్మమునందు లయించును. అంత జీవుడు 'అవిభాగః' (వే. సూ. 4.2.16) నిర్గుణబ్రహ్మముతో అవిభాగస్థితి నేకమై యుండును. అట్లు ముక్తిగాంచిన జీవుడు 'సంపద్యావిర్భావః స్వేన శబ్దాత్' (వే. సూ. 4.4.1) స్వేన శబ్దముచేత ముక్తుడు తన స్వస్వరూపమున నున్నట్లు విదితము. 'ముక్తః' (వే. సూ. 4.4.2) అట్టివాడు ముక్తినొందినట్లుగ స్పష్టము. 'ఆత్మా' (వే. సూ. 4 4 3) జీవుడు పొందినది పరబ్రహ్మమునే యనియు విదితము.' అప్పుడు జీవుడు 'అవిభాగేన' (వే. సూ. 4 4.4.) బ్రహ్మముతో భిన్నత్వము లేక సంపూర్ణైక్యము పొందియుండును. 'బ్రహ్మేణ జైమినిః' (వే. సూ. 4.4.5) అతడు బ్రహ్మగుణముల బొందియుండునని జైమినియు, 'చిత్తతన్మాత్రేణ, తదాత్మకత్వాదిత్యౌడులోమిః' (వే. సూ. 4.4.6) తన స్వస్వరూపమైన చిన్మాత్రత్వమున జీవు డుండునని ఔడులోమియు, వచింప, 'దీవమప్యుపన్యాసాత్ పూర్వభావాదవిరోధం బాదరాయణః' (వే. సూ. 4.4.7) పారమార్థికముగ ఆత్మ చిన్మాత్ర స్వరూపమై యున్నను, వ్యావహారికముగ జైమినిప్రోక్త గుణవిశిష్టుడనియు, అట్లనుటచే వైరుధ్యమేమియు నుండదని బాదరాయణుడు తలంచుచు, వ్యావహారికావస్థలోని గుణము లదృశ్యమై ముక్తావస్థలో జీవుడు తన స్వస్వరూపసంధానమున బ్రహ్మైక్యము నొందునని నిర్ణయించెను. ఆము కసితి 'ఐహికమప్యప్రస్తుతప్రతిబంధే'

(వే. సూ. 3 4.51) జ్ఞానము, ఆటంకరహితమైయున్న చో నీజన్మమునందే పరిపక్వము అయి, ఫలప్రదము అగును. 'ఏవం ముక్తిఫలానియమః, తదవస్థావధృతే స్తదవస్థాధృతేః' (వే. సూ. 3.4.52) పూర్వసూత్రము జ్ఞానమునకు ప్రతిబంధకమన్నచో ఉత్తరజన్మమునను, ప్రతిబంధకాభావమున ప్రస్తుతజన్మమున పరిపక్వమై ఫలప్రద మగునని వాకొనబడియున్నది. కాని యిట్టి నియమమునుగూడ యీ సూత్రము నివారించుచున్నది. అగమ్యస్థానమగు బ్రహ్మము మాత్రమే యగుచున్నది. అనగా బ్రహ్మైక్యస్థితియందు వ్యత్యాసము లెవ్వియును లేక సమరసమై ఏకరూపమై యుండునని తాత్పర్యము.



## సమాప్తి

న్యాయ వైశేషిక సాంఖ్యయోగ పూర్వమీమాంసా ఉత్తరమీమాంస లనబడు దర్శనషట్కములో క్రమము ననేగాక ఆధ్యాత్మిక పరిణామమునగూడ పర్యవసానస్థానము నొంది భౌతిక మానసి కాధ్యాత్మికములలో నాధ్యాత్మికముగ జీవబ్రహ్మ సృష్టుల నిర్వచన వివరణ సంబంధముల జర్చించి 'దుఃఖాదీనామపవర్జన మపవర్గః' దుఃఖమును వర్జించునది యనబడు అపవర్గమును లేక 'శరీరేంద్రియాభ్యా మాత్మనో ముక్తిరం ముక్తిః' శరీరేంద్రియములనుండి ఆత్మయొక్క

విమోచనము ముక్తియనియు అమరముచే నిర్వచింపబడిన మోక్షమును వివరించి సర్వమానవకోటియొక్క హితము గోరి ప్రసాదించియున్న వేదాంతదర్శనము సమాప్తి నొందించి యున్నాము. అట్టి అద్వితీయమును, అజేయమును, అద్భుతమును, ప్రశాంతి కాకరమును అగు శాస్త్రరాజమును ముముక్షు కల్పకముగ నిర్మించి, యర్పించిన అమానుష శక్తిధనుడైన వేదవ్యాస బాదరాయణాచార్యు డెంతయు మాన్యుడు, పూజ్యుడు. అందుచేత నే యితర దర్శనాచార్యులకు లేని గౌరవము ఈమహానుభావునకు అర్పింపబడి సాక్షాత్తు 'అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహురపరో హరిః। అఫాలలోచనో శంభుః భగవాన్ బాదరాయణః॥' నాలుగు ముఖములు లేని బ్రహ్మదేవుడును, ద్విబాహువులుగల హరియును, త్రినేత్రములులేని శంకరుడును నై భగవానుడైన బాదరాయణుడు విరాజిల్లు ననురీతి అవతారముగా పూజింపబడు గౌరవము నామహాపురుషుడు చూరగొనియున్నాడు. ఆమునిచంద్రునకు సర్వకాల ముముక్షుకోటి సర్వదా కృతజ్ఞులనక తప్పదు.

అందుచే ఒక భారతముననే గాక దేశదేశాంతరముల బ్రసరించి అత్యంత ప్రఖ్యాతినార్జించి అసంఖ్యాకులకు దరుణోపాయమును ప్రసాదించియున్న యీ వేదాంతము నెల్లరు అధ్యయనము గావించి, సారము గ్రహించి, అందు గల బ్రహ్మైకాత్మ్యానుసంధానజన్యమగు అనుభవానంద విభూతి సమగ్రులై సాధకులు విరాజిల్లుదురుగాక అని ఆశించు

చున్నాను. ఆర్ష గ్రంథముల మణిపూసవంటిదగు దీని సద్వినియోగ మొనర్చుకొందురుగాక అని విశ్వసించు చున్నాను. భగవంతునిగూర్చిన పరోక్ష జ్ఞానముకంటె భగవంతునితో మనకు గలుగు సహృదయ సంబంధ బాంధ వ్యమునసే ఆనందమిమిడి యుండుటచే, నట్టి జీవ బ్రహ్మ సంబంధమును నెరింగి పాఠకులు ఆనందించెదరుగాక!

హరిః ఓం తత్ సత్



ఓం

# శ్రీ అనుభవానంద గ్రంథమాల

## సాధన రహస్యము

### అభిప్రాయములు

1. శ్రీపతంజలి ప్రోక్తాష్టాంగయోగము, వివేక వైరాగ్య శమాది ముముక్షుత్వా లనబడే సాధనచతుష్టయ రహస్యాలు యీగ్రంథంలో సర్వులకు బోధపడేరీతిని సులభవ్యావహారికభాషలో వివరింపబడినవి. ఆధ్యాత్మిక జ్ఞానాసక్తఅయిన పదమూడేళ్ళ వయస్సుగలబాలిక అభివృద్ధిని కాంక్షించి లేఖలరూపములో స్వామి రచించిన యీ గ్రంథం కేవలము ముముక్షువులకే గాక ఆధ్యాత్మికజిజ్ఞాసాపరులైన వారందరికి ఉపయోగకరంగా ఉందనడంలో సందేహంలేదు.

సంతతాభ్యాసంద్వారా ఏకాగ్రత వైరాగ్యాలను అలవరచుకొని ఆత్మ తత్త్వానుభూతిని పొందటానికి భారతఋషులు ప్రతిపాదించిన సూత్రాలను అవగాహన చేసుకోడానికి యీగ్రంథం చాలసహాయం చేస్తున్నది.

శ్రుతిప్రోక్తమైన కర్మయోగానికి లోకమాన్యతిలక్ ప్రతిపాదించిన నిష్కామయోగం భిన్నమైనదని చెపుతూ, కాలానుగుణంగా కర్మభక్తిజ్ఞానయోగాలకు రాజయోగాన్ని చేర్చుకున్నట్లే నిష్కామయోగాన్నికూడా పరిగ్రహించి ఆదరించదగుననీ, వర్తమానంలో ఆచరణీయమైనది యిదేనని కూడ స్వామి యీగ్రంథంలో చేర్చాని సమన్వయ దృక్పథాన్ని వెల్లడించారు.

పండితులకేకాకుండ సామాన్యులకుకూడా ఆధ్యాత్మిక విషయపరిజ్ఞానం అందుబాటులో ఉండాలను లక్ష్యంతో పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమత్ అనుభవానందస్వాములు చేస్తున్నకృషి ప్రస్తుతించతగినది. శ్రీరామకృష్ణ పరమహంస శిష్యకోటి సాంప్రదాయానికి అనుగుణమైనది. స్వామి రచించిన గ్రంథాలన్నీ, ముఖ్యంగా భారతీయ మతాచార ప్రోక్తమైన సకల తత్త్వశాస్త్ర విషయాలను చర్చించిన 'సర్వ సిద్ధాంత సౌరభము' త్వరలో ప్రకటితముకాగలదని ఆశించుతాము.

— [illegible]

2. ఈ గ్రంథం 36 లేఖల సంపుటి. ఈ లేఖలన్నీ గ్రంథకర్త శిష్యురాలి నుద్దేశించి వ్రాసినవి. ఈలేఖలలో సాధకుల కుపయోగించే విషయాలను గురించిన చర్చే ప్రధానవిషయం. వీటిలో బ్రహ్మచర్యం ఆసనాభ్యాసం మొదలైన విషయాలెన్నో ఉన్నాయి. మొత్తంమీద లేఖలన్నీ రాజయోగ, జ్ఞానయోగ, భక్తియోగాలకు సంబంధించినవి.

అయితే యివన్నియూ ఒక బాలిక నుద్దేశించివ్రాయడంచేత రచయిత ఎక్కువ పాండిత్యధోరణి లేకుండా ఆయా విషయాలన్నీ అతిసులభమైన శైలిలో వివరించారు. వీరిలేఖల్లో వాడిన వ్యావహారికం అనర్గళప్రవాహంలాగా సాగిపోతూ పాఠకులలో బాగా అభిరుచి కలిగిస్తున్నది.

ఆంధ్రపత్రిక

3. భీమునిపట్నంలో శ్రీశారదా రామకృష్ణ సంఘము, బాపట్లలో శ్రీ రామకృష్ణ భక్తసమాజమూ స్థాపించి, బాపట్లలోనే శ్రీ బ్రహ్మానందాశ్రమం నిర్మించుకొని, శ్రీ అనుభవానంద గ్రంథమాలద్వారా తెలుగునాటికి అనుభవంతోగూడిన తత్త్వబోధలు నిత్యోత్సాహంతో చేస్తున్న మహనీయులు శ్రీ అనుభవానంద స్వాములవారు. గొప్ప పండితులేగాక గొప్ప కవులుగూడ. చక్కని భాషలో పాటలూ, పద్యాలు వ్రాయగలరు, వ్రాశారు. ఈ గ్రంథమాలలో మొదటి నాలుగు కుసుమములూ అవే. స్వాములవారు ముచ్చటైన వ్యావహారిక భాషకూడ వ్రాయగలరనడానికి 'ఈ సాధనరహస్యం' నిదర్శనం.

'సాధనరహస్యం' యిందులో లేఖలరూపంలో వివరించబడింది. పదమూడేండ్ల ఒక ఆడపిల్లకోసం వ్రాసినదైనందుకు ఎంతో సరళత్వం సాధించి కృతకృత్యులైనారు స్వాములవారు. ఈబాలిక పూర్వజన్మసంస్కారఫలితంగా చిన్ననాటినుంచి ఆధ్యాత్మికజిజ్ఞాసకలిగి సాంసారిక ప్రవృత్తిరహితమైన చిత్తంతో స్వాములవారి నాశ్రయించిన ధన్యజీవి. ఆధ్యాత్మికనిష్ఠయందు వయస్సుతోబాటు ఎదుగుతూ, ఈమెయే యిప్పుడు 'మాతాజీ' యను పేర దివ్యయై వెలుగుతున్నది.

ఈగ్రంథములో 36 లేఖలున్నాయి. మొదటి ఉత్తరంలోనే చిన్నపిల్లలకుసైతం బోధపడేటట్టు తత్వవిషయాలు చెప్పడంలో స్వాములవారికి

ప్రత్యక్షం - భ్రమ - అనుమానం - శబ్దం - జగత్సృష్టి-నిమిత్తోపాదనకారణాలు - ప్రధానవాదం - పరిణామవాదం - వివర్తవాదం - యీవిషయాలను వీరు విప్పిచెప్పిన ధోరణిచూస్తే ముచ్చటవేస్తుంది. పెద్దల మనుకునేవారుకూడా పిన్నలై కూర్చుండి వినవచ్చు,

ఈ ధోరణిలోనే ఒక లేఖలో కర్మయోగం వివరించబడింది. పదమూడు లేఖలలో రాజయోగం విస్తరించబడింది. నాలుగు లేఖలలో భక్తియోగము, ఆరు లేఖలలో జ్ఞానయోగము బోధించబడింది. సాధన చతుష్టయసంపద లేనిదే తత్వజ్ఞానం ఫలించదు కనుక చివరిలేఖలలో దానిని ప్రత్యేకంగా విశదీకరించారు. ప్రతివారూ చదువుకోవలసిన గ్రంథం. 1946 లో ఒక మూడునెలల కాలంలో వ్రాసి ముగించిన లేఖలివి. మంచి కాగితంమీద, గ్రంథం చక్కగా ముంద్రించబడింది. ఉత్తమ సంస్కారంతో పుట్టిన ఒక బాలిక నిమిత్తంగా పుట్టిన గ్రంథం కావడంతో దీని పవిత్రత ఇనుమడిస్తున్నది.

కృష్ణాపత్రిక

4. ఈగ్రంథంలో సిద్ధాంతమునకు సాధనమునకుగల అవినాభావ సంబంధము, సాధనకు సంబంధించిన వివరములు కలవు. శ్రీ స్వాములవారు అనేక వేదాంత విషయముల సులభగ్రాహ్యంగా సరళమైనభాషలో మాతాజీకి వ్రాసిన ఉత్తరములు సేకరించబడి గ్రంథముగా రూపొందింది.

ఇందులో 36 ఉత్తరములలో పండితులకు పామరులకుకూడా వేదాంతసంబంధమైన విషయాలలో ప్రవేశము, ఆసక్తి కలిగించే అనేక విషయాలు కలవు. శీఘ్రగతిని ఆధ్యాత్మిక పారమార్థికచింతను వ్యాప్తిని చెయ్యడానికి యీ గ్రంథము విశేషముగా నుపకరించగలదు. పైగా సిద్ధాంత సాధనలు విశేషంగా ప్రజల కందుబాటులోనికి సయితం రాగలవు, ఈ గ్రంథ పఠనానంతరం ఏ వేదాంత గ్రంథమునైనను పఠించి అర్థముచేసుకొనుట సులభసాధ్యము కాగలదు.

ఈ గ్రంథముగా రూపొందిన శ్రీ స్వాములవారి ఉత్తరములు స్త్రీమూర్తి నుద్దేశించి వ్రాసినవైనను సర్వప్రజానీకానికి ఉపయుక్తమే కాన అమూల్యమైనవనిగూడ చెప్పనగును.

5. ప్రస్తుతగ్రంథం ఉత్తరాల సంపుటిరూపంలో వ్రాయబడి ఆధ్యాత్మిక జిజ్ఞాసాపరులకు ఉద్దేశించబడింది. యోగార్థం, తత్త్వచింతనం, శ్రీశ్రీఅవ్వారత, కర్మయోగం, రాజయోగం, భక్తియోగం, జ్ఞానయోగం, యోగాసనాలు, ప్రాణాయామం మున్నగు విభాగాలన్నీ యీ గ్రంథములో వివరించబడినవి. ఎక్కువగా సిద్ధాంత చర్చల్లోకి పోకుండా సాధనమీదనే దృష్టినుంచి వ్రాయబడటంవలనను చాల సులభశైలిలో వివరించబడటంవలనను యీ గ్రంథ విషయాలను యీ విషయాలలో ఏమాత్రం ప్రవేశం లేనివారుకూడ అర్థంచేసుకొనగలరు.

తెలంగాణములో ఆధ్యాత్మికవిజ్ఞానం ప్రచారంచేస్తున్న డివైన్ లైఫ్ సొసైటీవారుగాని, యితరులుగాని యిలాంటి గ్రంథాలను ప్రచురించి యుండలేదు. ముముక్షువులైన తెలంగాణీయులు ఆధ్యాత్మికాభివృద్ధికి మూలాధారమైన అష్టాంగయోగము, సాధనచతుష్టయ సంపత్తివివరములతోగల యీగ్రంథానికి తగు ప్రోత్సాహం యివ్వగలరని ఆశిస్తున్నాము.

గోలకొండ

6. తీవ్రముముక్షుత్వంతో తంటాలు పడుతుండే సర్వసాధకలోకానికి అనగా అతిసామాన్యులకునూ అర్థంఅయ్యేలాగ ఆత్మతత్త్వ విషయాలను సిద్ధాంతము, సాధన అనే రెండు విషయాలను అందులోను రెండవ విషయమే ప్రధానంగా వ్యావహారిక భాషలో శ్రీ మాతాజీకి వ్రాసిన లేఖారూపములో అందిచ్చినారు. ఆత్మవిషయాలు గహనములు. సాధన విషయములు మరింత కొంతఅయినా తత్త్వశాస్త్రపరిభాష అర్థమయి యుండాలి. వీటి నన్నిటిని ఆలోచించి సాధకుని కవసరమైన సర్వవిషయాలు పండొలచి చేతిలో పెట్టినట్లు స్వాములవారు మనకిచ్చి యున్నారీగ్రంథములో. అన్ని యోగమార్గములు, సాధనచతుష్టయము యిందులో చాల వివరంగా ఉన్నవి కాబట్టి, సిద్ధాంతములు తర్కభూయిష్టములు కాబట్టి విసివిపోయేవారంతా యీ గ్రంథం చదివి సనాతన ధర్మప్రకారం సాధనలో సోపాన పరంపరను తెలిసికోవచ్చును; యీ గ్రంథంలో పరిభాషలో 'సుహృత్సమ్మతం'గా రచన ఉన్నది.

ఈభూమిలో పుట్టి యింతమాత్రమన్నా తెలిసికొని కొంత అయినా ఆచరణలోనికి తెచ్చుకోకపోతే మన జన్మెందుకు? శ్రీ అనుభవానంద

7. 4 వ లేఖలోను, 5 వ లేఖ చివరను కర్మయోగ నూతన నిర్వచనము దాని సమర్థనము తృప్తిగా ఉన్నది. అహింసాప్రేమలకు చేసిన నిర్వచనము చాల రసవంతముగా ఉన్నది. 'అస్తేయ' నిర్వచనము చక్కగా ఉన్నది...బ్రహ్మచర్యాన్ని గురించిన వ్యాఖ్య నాకు చాలా నచ్చినది. అపరిగ్రహ మెంత శ్రేష్ఠమైనదో దాని వ్యాఖ్యయు అంత శ్రేష్ఠముగా ఉన్నది. యోగాసనములు, ధ్యానాసనములు వీని స్వరూపస్వభావములు చాల బాగుగా వివరింపబడినవి. మీ సింహావలోకనపద్ధతి చాల బాగుగా ఉన్నది. ధ్యానాన్నిగురించి ప్రస్తావన, వ్యాఖ్యానము నాకు హర్షాన్ని కలిగించినది. ధారణాసమాధుల వ్యాఖ్యానము బాగుగా ఉన్నది. భక్తి యోగప్రస్తావన, భక్తిజ్ఞానముల సామ్యసూచన చాల నచ్చినది. భక్తి యోగ నిర్వచనము రసవంతముగా ఉన్నది. జ్ఞానయోగ ప్రస్తావన, జ్ఞాన యోగ వ్యాఖ్యానము చాల బాగుగా వున్నవి. ఉపసంహార విషయము చాల బాగున్నది. తితీక్ష, శ్రద్ధ వీని వ్యాఖ్యానము చాల బాగున్నది. ముముక్షుత్వ నిర్వచనము బాగున్నది.

ఈ గ్రంథము 'వాఙ్మయగురువు' అనవచ్చును. ఈ వాడుకభాష బోధకు చాల అనుకూలముగా ఉన్నది. అచ్చముగా సాధనకు సంబంధించిన విషయములు పుష్కలముగా యిందున్నందున అనేక ఉత్తమగ్రంథాల ప్రయోజన మీ ఒక్కదానిచే సిద్ధింపజేసుకొనవచ్చును.

శ్రీ శుద్ధచైతన్య స్వాములవారు

8. సాధకులకు కల్పతరువు, బందరు.

9. సాధనరహస్యం చదివిన ప్రతివాడు చాల బాగుందంటాడు. సాధనరహస్యములో ఉన్నవి ఉత్తరములు కావు, అవి ఉత్తమాధికారులకు యివ్వవలసిన ఉపదేశాలు అని నా నమ్మకం. ఈ సాధనరహస్యం తన నిత్యజీవితంలో సాధించి అనుభవానందాన్ని రుచి చూచినట్లయిన స్వామివారి ఋణము తీరుతుందనుకుంటాను. బందరు.

10. మీ రిచ్చిన సాధనరహస్యము అను పుస్తకమును జదివితిని. ఇంతవరకు తెనుగున అంత విపులముగా వివరించిన గ్రంథమిదియే మొదటిది. ఇటి ఉత్తమోత్తమ గ్రంథము నిచ్చి అజ్ఞానివ్యక్తికి ఉపచ్చరించు మీ

11. సాధకులకు అనగా నాలాంటివాళ్ళకు అమూల్యమైన విష యాలు అందించినందుకు మీకు అనేక ధన్యవాదా లర్పిస్తున్నాను.
గజపతినగరం

12. చాల ప్రశంసనీయముగా సులభ శైలిలో అర్థమిస్తూ బాగా ఉన్నది. అనంతపురం

13. ఇట్టి అమూల్య గ్రంథరాజమును విశేషశ్రమతో వ్రాసి తెనుగు ఆధ్యాత్మికలోకమునకు మహోపకృతిచేసిన పూజ్యపాద శ్రీ అనుభవానంద స్వామివారికి మా హృదయపూర్వక వందన సహస్రములు. ఏలూరు

14. అందలి రచన బహుసులభ శైలిలో నుండుటచే అనుభవా నంద దాయిక మగుననుటకు సందేహము లేదు. అందరి చేతులలోను ఉండవలసిన గ్రంథము. హైదరాబాదు

15. సాధనరహస్యము అతి అమూల్యమైన గ్రంథము. విశాల దృక్పథమున మన సంప్రదాయములను లోకమునకు జాటుట, ఒక్క భార తీయులయొక్కయేగాక తదితర ప్రపంచవాసుల భాగ్యము. మద్రాసు

16. శ్రీ అనుభవానంద స్వామివారి 'సాధనరహస్యం' శ్రద్ధగా చదివాను. ఆ లేఖల సారాన్ని అనుభవించాలంటే నిరంతరమూ పఠించి ఆచరణలో పెట్టాలి. దిమిలి

17. ముఖ్యముగా సాధనరహస్యము అమూల్యము. ఎన్నిమారులు చదివినను యింకను మరిమరి చదువవలయుననియే కోరికయుండును. ఆంధ్ర మున, ఆంగ్లమున మన సంప్రదాయ రహస్యములను దెలుపు గ్రంథము లెన్నియో గలవు. కాని యింత సులభవాక్యములలో, స్వానుభవమున మన సాధనమార్గమును తెలిపినవారు బహుకొద్దిమందియై యున్నారు. ఇట్టి గ్రంథమును చదివినవారే ధన్యులు. అట్టివారే సాధనరహస్యములను గ్రహించి ఆచరణలో బెట్టగలిగినవారగుదురు. మద్రాసు

18. తాము బహుసామర్థ్యముతో సులభ శైలిలో రచించగల్గిన గ్రంథము సాధనరహస్యమును పొందుటకు కృతజ్ఞుడను, విజయవాడ

19. I have closely gone through your Sadhana Rahasyam. When I read it, I will have to say that the musing words put there-in will be ringing in our ears ever and anon, being in simple and affectionate style. Thereby though we

ana those words, precious as they

# శ్రీ అనుభవానంద గ్రంథమాల

## ప్రచురణములు

1. శ్రీరామకృష్ణ లీలాసంకీర్తనము :
(తృతీయ ముద్రణము)

శ్రీరామకృష్ణ, శారద, వివేకానందుల నిజస్వరూప
మును వెలువరించుచు, భక్తితన్మయత్వమును, జ్ఞాన
ప్రకాశమును, వైరాగ్యప్రబోధమును గావించు 122
కీర్తనలు. 1/16 డెమ్మీ. సుమారు 170 పుటలు. రు 0-10-0

2. శ్రీ రామకృష్ణాంజలి : (తృతీయముద్రణము)

భగవాన్ శ్రీ రామకృష్ణ వివేకానందుల తత్త్వమును
ప్రకటించు భక్తిరసభరితమగు 100 పద్యములు. రు 0- 2-0

3. శ్రీ దక్షిణేశ్వరీ స్తవము : (ద్వితీయముద్రణము)

భక్తి జ్ఞాన వైరాగ్యప్రబోధకమును తత్త్వవిషయపూర్ణ
మైన దక్షిణేశ్వరీ కాళికా స్తవరూప పద్యశతకము. రు 0- 2-0

4. చిత్తప్రబోధ : (ద్వితీయముద్రణము)

సాధకుల కనేక అమూల్య రహస్యముల బోధించు భావ
[illegible] రు 0- 2-0

5. సాధనరహస్యము :

ఆధ్యాత్మికాభివృద్ధికి మూలాధారమైన పతంజలి ప్రోక్త అష్టాంగయోగము, మరియు సాధన చతుష్టయ సంపత్తియు, అతిసులభమగు భాషలో సర్వోపయుక్తమగు వినూత్న వివరణములతో నొప్పారు గ్రంథరాజము.

1/8 క్రౌను. 300 పుటలు. రు 2-0-0



6. అనుభవానందము.

అద్వైతానుభూత జీవేశ్వరైక్యభావ విభూషిత పద్య శతకము. రు 0-2-0



7. సాధన సుధ :

సాధనకాలమున ఘటిల్లు అనేక విక్షేపములు, వాని నిరోధోపాయములు, సాధనావిధానములు, వేదాంత సమాధియగు అస్పర్శయోగాది రహస్యములు, అట్టి జ్ఞానసిద్ధునిస్థితి మొదలగు సాధకోపయుక్త విషయములతో గూడిన అమూల్య పద్యగ్రంథము

1/8 క్రౌను. 62 పుటలు. రు 0-8-0



8. మన శారదామాయి :

శ్రీమాతాజీ త్యాగీశానంద రచితము. సులభమై ఉత్సాహ ప్రేరిత సర్వజిజ్ఞాసాపరులకు ముఖ్యముగ స్త్రీలోకమునకు మహోపయుక్తమగు గ్రంథము. ఇందు శ్రీ శారదామాయి జీవితోపదేశ విశిష్టతయు స్త్రీజనాదర్శమును చక్కగ వివరించబడియున్నది.

క్రౌను. 64 పుటలు. రు 0-8-0

9. మన వివేకానందుడు :

శ్రీ మాతాజీ త్యాగీశానంద కృతము. భక్తి జ్ఞాన ప్రబోధకమై జ్ఞానవైరాగ్య జనకమై తీవ్రజిజ్ఞాసువుల కాదర్శమై యిందలి రచన శ్రీ వివేకానందుని మూర్తిని ప్రస్ఫుట మొనరించును.

1/8 క్రౌను. 68 పుటలు. రు 0-8-0

10. మన రామకృష్ణుడు :

శ్రీ మాతాజీ త్యాగీశానంద కృతము. భక్తిజ్ఞాన ప్రబోధకమై, సాధకుల కాదర్శకమై, మధుర శైలి రచింపబడిన యీ గ్రంథము భగవాన్ శ్రీ రామకృష్ణదేవుని సర్వాదర్శమును పాఠకులకు పొడకట్టజేయును.

1/8 క్రౌను. 74 పుటలు. రు 0-8-0

11. సర్వ సిద్ధాంత సౌరభము :

దర్శన ఖండము - ప్రథమభాగము

దర్శన, అద్వైత, వైష్ణవ, శైవ సమన్వయాది ఖండములతోనున్న సర్వ సిద్ధాంత సౌరభమున, దర్శనఖండమున ప్రథమ భాగమున శ్రీ కపిల పతంజలి మహార్షి పుంగవులచే నిర్మింపబడిన సాంఖ్యయోగములు, ఆయా కర్తల జీవిత విశేషములు ఆమూలాగ్రము అనేక పండితాభిప్రాయములతో జర్చించబడి యున్నవి.

1/8 క్రౌను. 850 పుటలు. రు 8-4-0

12. శాంతి సామ్రాజ్యము :

శాంతి నాకాంక్షించు కల్లోలిత ఆధునిక ప్రపంచమునకు శాంతి సాధనోపాయముల జర్చించు అమూల్య భావ గర్భితమగు గ్రంథము.

1/8 క్రౌను. 40 పుటలు. రు 0-6-0

13. శ్రీ రామకృష్ణాదర్శము :

అర రహిత సాధనలలో మునుంగు సాధకలోకమునకు శ్రీరామకృష్ణుడుపదేశించిన పరమ సాధన విధానము. రు 0-2-0

14. శ్రీరామకృష్ణ పూజ :

శ్రీ రామకృష్ణ సహస్రనామావళి, షోడశోపచార అష్టోత్తరశత నామములతో గూడిన పూజావిధానము.

1/16 డెమ్మీ. 71 పుటలు. రు 0-8-0

15. సర్వ సిద్ధాంత సౌరభము :

దర్శన ఖండము - ద్వితీయ భాగము

ఈ ద్వితీయభాగమున ప్రాక్పాశ్చాత్య పండితాభిప్రాయములతో శ్రీ కణాద గౌతమ ఋషివరేణ్యులచే ప్రతిపాదింపబడిన వైశేషిక న్యాయదర్శనములు వివరింపబడియున్నవి.

1/8 క్రౌను. 294 పుటలు. రు 3-0-0

16. సర్వ సిద్ధాంత సౌరభము :

దర్శన ఖండము - తృతీయ భాగము

ఇందు శ్రీ జైమిని బాదరాయణ వ్యాసుల ప్రజ్ఞావిశేషములు, వారి మీమాంసా వేదాంత దర్శన వివరణములు సర్వోపయుక్తముగ ననేక విద్వాంసుల అభిప్రాయములతో రచితములైనవి.

1/8 క్రౌను. సుమారు 34[illegible] పుటలు. రు 3-0-0